## పుత్రదర్శనపర్వము

## నారదాగమనపర్వము



---

# మౌసలపర్వము



---

# మహాప్రస్థానికపర్వము



---

# స్వర్గారోహణపర్వము



---



శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# శ్రీ మహాభారతము

## ఆశ్రమవాసిక పర్వము

—:౦:—

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్.

— ధర్మరాజాదులు గాంధారీధృతరాష్ట్రుల నుపచరించుట. —

జనమేజయుఁడు వైశంపాయనున కిట్లనియె. 'మునీంద్రా! మహాత్ములైన మా పితామహులు తమ పిత్ర్యమైన రాజ్యమును బొంది, ధృతరాష్ట్రమహారాజునెడ నెట్లు ప్రవర్తించిరి? ధృతరాష్ట్రమహారాజుగూడ, కొడుకులను—మంత్రులను—ఐశ్వర్యమును—సర్వమును' బోఁగొట్టుకొని నిరాశ్రయుఁడై యెట్లు ప్రవర్తించెను? పేరు ప్రతిష్ఠలు వహించిన గాంధారియు నెవ్విధమునఁ బ్రవర్తిల్లెి? మహాత్ము లగు మాపితామహు లెంతకాలము రాజ్యపరిపాలనము చేసిరి? ఈవిషయము నా కెఱిఁగింపవే' యని యడుగ వైశంపాయనుఁ డిట్లనియె.

రాజేంద్రా! మహాత్ములగు పాండవులు శత్రునిర్మూలనము గావించి సామ్రాజ్యము నొందినతరువాతఁ దమపెదతండ్రి యగు ధృతరాష్ట్రమహారాజును బురస్కరించుకొని



శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# శ్రీ మహాభారతము

## ఆశ్రమవాసిక పర్వము

—:0:—

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్.

— ధర్మరాజాదులు గాంధారీధృతరాష్ట్రుల నుపచరించుట. —

జనమేజయుఁడు వైశంపాయనున కిట్లనియె. 'మునీంద్రా! మహాత్ములైన మా పితామహులు తమ పిత్ర్యమైన రాజ్యమును బొంది, ధృతరాష్ట్రమహారాజునెడ నెట్లు ప్రవర్తించిరి? ధృతరాష్ట్రమహారాజుగూడ, కొడుకులను—మంత్రులను—ఐశ్వర్యమును—సర్వమును' బోఁగొట్టుకొని నిరాశ్రయుఁడై యెట్లు ప్రవర్తించెను? పేరుప్రతిష్ఠలు వహించిన గాంధారియు నెవ్విధమునఁ బ్రవర్తిల్లె? మహాత్ము లగు మాపితామహు లెంతకాలము రాజ్యపరిపాలనము చేసిరి? ఈవిషయము నా కెఱిఁగింపవే' యని యడుగ వైశంపాయనుఁ డిట్లనియె.

రాజేంద్రా! మహాత్ములగు పాండవులు శత్రునిర్మూలనము గావించి సామ్రాజ్యము నొందినతరువాతఁ దమ పెదతండ్రి యగు ధృతరాష్ట్రమహారాజును బురస్కరించుకొని

రాజ్యపరిపాలనము గావించిరి. విదురుఁడును, సంజయుఁడును, ధృతరాష్ట్రునకు వైశ్యయనుభార్యయందుఁ బుట్టినవాఁడును, మేధావియు నగు యుయుత్సుఁడును ధృతరాష్ట్రుని సేవించుచుండిరి. పాండవులు ప్రతికార్యమును ధృతరాష్ట్రమహారాజు నడుగుచుండెడివారు. ఆయన యాజ్ఞాపించిన మీఁదటఁ జేయుచుండువారు. ఈరీతిగా వీరాధివీరు లైన పాండవులు పదునైదు సంవత్సరములకాల మమ్మహారాజుసన్నిధిలో నుండుచు, నాతనిని సేవించుచుండిరి. భీముఁడు మొదలగు వీరులు ధర్మజుని యభిమతానుసారము ధృతరాష్ట్రునిపాదములకు మ్రొక్కి యారాజు శిరము నిమిరి మూర్కొని పంపఁగా నన్నిపనులును జేయుచుండిరి. కుంతీదేవియు గాంధారీదేవి ననుసరించి ప్రవర్తించుచుండెను. ద్రౌపదియు, సుభద్రయును, దక్కంగల పాండవస్త్రీ లందఱును దమయత్త లగు నా కుంతీగాంధారుల యిరువురియందును సమానప్రవర్తనముతోఁ దగినట్లు మెలఁగుచుండిరి. మఱియు మహారా జగు యుధిష్ఠిరుఁడు రాజోచితములై మిక్కిలి విలువ గలిగిన శయనములు, వస్త్రములు, ఆభరణములు, అనేక విధములైన భక్ష్య భోజ్యములు ననేకములుగా ధృతరాష్ట్రునకు సమర్పించుచుండును. అట్లే కుంతియును గాంధారియెడ గౌరవభావముతో నుపచరించెను. విదుర సంజయ యుయుత్సులు ముువ్వురును హతపుత్రుఁ డైన యావృద్ధరాజు నుపాసించుచుండిరి. అట్టిసమయమున ద్రోణాచార్యుని బావమఱఁదియు, మేటివిలుకాఁడును, ఉత్తమ బ్రాహ్మణుఁడు నగు కృపాచార్యుఁడు గూడ నా ధృతరాష్ట్రుని సన్నిధిలో నుండెడివాఁడు. పురాణఋషి యగు వ్యాసభగవా

నుఁడు దేవ ఋషి పితృ రాక్షసుల కథలను జెప్పుచు నిత్యము నారాజుతోఁడ నుండెడివాఁడు. విదురుఁడు ధృతరాష్ట్ర మహారాజుచే ననుజ్ఞాతుఁ డగుచు ధర్మకార్యములను, వ్యవహారమునకు సంబంధించిన కార్యములను నన్నిటిని జేయించుచుండెను. విదురుని కార్యనిర్వాహకత్వముచేతను, నాతని ప్రశస్తమైన నీతివలనను ధర్మరాజునకు సామంతరాజులవలనఁ గావలసిన యభిమతకార్యము లెన్నియేనియు స్వల్పద్రవ్యవినియోగముతోఁడనే నెఱవేఱుచు వచ్చెను. మఱియు ధృతరాష్ట్ర మహారాజునాజ్ఞచే విదురుఁడు కారాగారబద్ధులై యున్నవారలను విడిపించెను. అట్లే వధ్యులై యున్నవారలను వదలివేసెను. ఇట్లు జరుగుచుండఁగా ధర్మరాజుమాత్ర మెప్పుడుగాని యేమియు ననకుండెను. మహాతేజస్సంపన్నుఁ డయిన ధర్మరాజు, ధృతరాష్ట్రమహారాజు విహారయాత్రలు సలుపఁబోయినపు డాయనకుఁ గావలసిన వెల్ల సమకూర్చి నివేదించుచుండెడివాఁడు. మఱియు నాతని యాజ్ఞచే * ఆరాళికులును, సూపకారులును, రాగఖాండవికులును మునుపటివలె ధృతరాష్ట్రునివెంట నుండిరి. ధృతరాష్ట్రుఁడు విహారయాత్రలు పోయిన సమయమునఁ బాండవులు విలువ గల వస్త్రములను, నానావిధములైన పుష్పహారములను మర్యాదగాఁ దీసికొనిపోయి యయ్యయికాలములయం దారాజునకు సమర్పించుచుండిరి. చెఱకురసముతోఁ జేసినకల్లు, రకరకములైన

---

* కత్తిపీఁటతోఁ దఱిగిన కూరలను వండువా రారాళికులు. పప్పు మొదలైనవానిని జేయువారు సూపకారులు. పిప్పలి, సొంటి, శర్కర వేసి పెసరకట్టు చేయువారు రాగఖాండవికులు.

మద్యములు, మాంసములు, తేలికలైన పానకములు (=ఫలరసములును, బెల్లము, కలకండ వేసి చేసిన పానీయములును), చిత్రములైన భక్ష్య భోజ్యములు వీని నెల్ల నావృద్ధరాజున కనువుపఱచుచుండిరి. ఎవరేని రాజు లటనటనుండి వచ్చినచో వారెల్ల ముందటివలె ధృతరాష్ట్రునిసన్నిధి కరుగుచుండిరి. కుంతియు, ద్రౌపదియు, సాత్వతియు, నాగకన్యయైన యులూపియుఁ, జిత్రాంగదాదేవియు, ధృష్టకేతుని చెల్లెలును, జరాసంధుని కూఁతురును (సహదేవునిభార్య), ఇంకను దక్కుంగల పెక్కండ్రు యువతులును గాంధారీదేవికి సేవకురాండ్రయి యామెను సేవించుచుండిరి. 'పుత్రవియోగము నందియున్న యీరాజే విధముగా నా పుత్రశోకము నందకుండ నుండఁ గలఁడో యావిధముగ నారయుచుండునది' యని ధర్మరాజు తన తమ్ములకాజ్ఞాపించెను. గంభీరార్థము గల యీ వాక్యమును విని, యొక్క భీముఁడు తప్పఁ దక్కినవా రందఱును జెప్పినదానికన్న నెక్కుడుగఁ బ్రవర్తించిరి. భీముని హృదయమునందు మున్ను జూదమాడుతఱి నా ధృతరాష్ట్రుని కుచ్చితపుబుద్ధిలో నేమేమి జరిగియుండెనో యది యవ్వీరుని హృదయమునుండి తొలఁగినది గా కుండెను.

ఇది యొకటవ యధ్యాయము.

---

## ధర్మరాజాదుల యుపచారములకు గాంధారీధృతరాష్ట్రులు సంతోషించుట.

ఈ ప్రకారముగా ధృతరాష్ట్రమహారాజు పాండవులచేఁ, బూజితుఁ డగుచు, మహర్షులచేఁ బరివృతుఁడై వెనుకటియట్ల

సంతోషముగాఁ గాలక్షేపము సేయుచుండెను. మఱియు, కురుకులోద్ధారకుఁ డగు నారాజు బ్రాహ్మణుల కీఁదగిన యగ్రహారము లనేకము లిచ్చెను. ధర్మరాజు క్రౌర్యస్వభావము వాఁడు కాఁడు గాన నాయన సేయు దానధర్మములకు మిక్కిలి సంతసించుచు, నాయన యొనరించు దాని కంతటికి నామోదించుచుండెను. మఱియుఁ దనతమ్ములతోను, మంత్రులతోను నిట్లు చెప్పెను. 'ఈ ధృతరాష్ట్రమహారాజు నాకును, మీకును బూజింపఁ దగినవాఁడు. ఈయనయాజ్ఞలో మెలంగినవాఁడు నాకు మిత్రుఁడు. అట్లు కానివాఁడు నాకు శత్రువును, మీఁదు మిక్కిలి దండింపఁ దగినవాఁడు నగును.' అని చెప్పెను. మృత తిథులయందును, బితృదివసములయందును బుత్రులకును, మిత్రులకును జేయఁబడుశ్రాద్ధములయందు ధృతరాష్ట్రమహారాజేమేమి చేయనభిలషించునో, యవి యెల్లఁ జేయుటకు వలయు ద్రవ్యములను ధర్మరాజొసఁగుచుండెను. అద్దాన మహామనస్కుఁ డగు ధృతరాష్ట్రుఁడు దానపాత్రు లగు బ్రాహ్మణుల కనేకములుగాధనము లొసఁగెను. ధర్మజ భీమార్జున నకుల సహదేవు లేవురును నాతనికిఁ బ్రియము గూర్చువారై యాతఁ డొనరించుదాని కంతకును ననుసరించి వర్తించుచుండిరి. మఱియు వారు తా మాతని కొడుకులను, మనుమలను యుద్ధములో వధించి యుండుటచే నావృద్ధరాజు మిక్కిలి శోకపీడితుఁడై యున్నవాఁడు గాన మనమూలమునఁగలిగిన పుత్రశోకముతో నీతఁడు మరణింపరాదు. అట్లు మరణింపకుండు టెట్లనియు -, 'పుత్రులు జీవించి యున్న కాలములో నీయన యెట్టిసౌఖ్యము నొందుచుండెనో, యెట్టిభోగము లనుభవించుచుండెనో యవి

యెల్ల నీనాఁడీయనకుఁ గొఱఁత లేకుండఁ జూడవలయు' నని యు నాలోచించుకొని యట్లన సేయ సంసిద్ధులై, యాకారణమున నేవురు సోదరులును నేకీభవించి తా మనుకొన్నట్లుగా ధృతరాష్ట్రుని శాసనములో మిక్కిలి జాగరూకతతో మెలంగుచుండిరి. ధృతరాష్ట్రుఁడును—వా రట్లు తనయెడ వినయవిధేయతలు గలిగి యొకనియమములో నిలిచి శిష్యవృత్తితోఁ దన్ను సేవించుచుండఁగా వారలయెడఁ దానును జ్ఞానోపదేష్ట యగు గురువువలె నడుచుకొనుచుండెను. గాంధారియును దనపుత్రులకు వివిధము లగుశ్రాద్ధము లొనరించుటతో బ్రాహ్మణులకుఁ గోరిన వెల్ల నిచ్చి, పుత్ర ఋణమును దీర్చుకొన్నదయ్యెను. ధర్మనిర్వాహకులలో నుత్తముఁడును, బుద్ధిశాలియు నగుధర్మరాజు తమ్ములతోఁ గూడి యీ ప్రకారముగా ధృతరాష్ట్రమహారాజును బూజించెను. అట్టియెడ ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునం దించుకేనియు నప్రియము గాంచినవాఁడు గాఁడయ్యెను. పాండవులు మహాత్ములు గాన వా రఁదఱును సద్వృత్తి నవలంబించి ప్రవర్తించుచుండఁగా ధృతరాష్ట్రుఁడు వారియెడ మిక్కిలి ప్రీతి గలవాఁ డయ్యెను. గాంధారియును వారిసత్ప్రవర్తనముచేఁ బుత్రశోకమును వీడి,వారలయందుఁ దనకన్నకొడుకులయందువలె వాత్సల్యము గల దయ్యెను. కురుకులమున జనించినవాఁ డగుటచే నక్కులము నుద్ధరించువాఁడై ధర్మరాజు సర్వదా ధృతరాష్ట్రమహారాజువిషయములోఁ బ్రియములనే చేసినవాఁ డయ్యెను. గాంధారీ ధృతరాష్ట్రులలో నెవ్వరైనఁ గొద్దిపనినిగుఱించి గానీ, గొప్పపనిని గుఱించిగానీ యొకించుక యేది చెప్పినను వారలయెడఁ

బూజ్యభావము వహించి పాండవశ్రేష్ఠుఁ డగుధర్మరాజు వారి మాట చెల్లించుచుండెను. అట్టి ధర్మజుని సత్ప్రవర్తనముచేత నాధృతరాష్ట్రుఁ డాతనియెడఁ బ్రీతుఁడై (యిట్టి వానికి ద్రోహము తలఁచెఁ గదా! యని) మూర్ఖచిత్తుఁ డైన తనకుమారునిఁ దలంచుకొని పశ్చాత్తాపము నొందుచుండెను. ప్రతిదిన మారాజు ప్రాతఃకాలమున లేచి, స్నానాదికృత్యము లొనరించి, శుచియై జప మాచరించి, 'పాండవులకు యుద్ధములలో నపజయము గలుగకుండుఁ గాక' యని కోరుచుండెను. మఱియు బ్రాహ్మణులచే స్వస్తివాచనము చేయించి, హోమము గావించి పాండవుల కాయుర్వృద్ధి గలుగవలె నని యభిలషించుచుండెను. ఈనాఁ డాతఁడు పాండవులవలనఁ బొందిన పరమ ప్రీతిని, ఇదివఱలోఁ దనకొడుకులవలనఁ గూడఁ బొందియుండ లేదు. ఇట్లున్నయెడ, ధర్మరా జెట్లు ప్రవర్తించి బ్రాహ్మణులకుఁ దాను బ్రియుఁ డయ్యెనో, యెవ్విధముగా నుండి క్షత్రియులకుఁ బ్రీతిపాత్రుఁడు కాఁగలిగెనో యా యావిధముగనే నడుచుకొని వైశ్య శూద్రసంఘములకును బ్రియుఁడు గా నుండెను. లోగడ నీ ధృతరాష్ట్రుని కొడుకులు చేసిన పాపము నించుకేని తన మనసులో నుంచుకొనక ధర్మరా జీ ధృతరాష్ట్ర మహారాజును సేవించుచుండెను. మఱియు ధృతరాష్ట్రుని విషయములో నెవ్వఁడేని ప్రమాదవశమున నేకొంచెమేని యప్రియము చేసెనేని, వాఁడు ధర్మజుని ద్వేషమునకుఁ బాత్రుఁ డగుచు వచ్చెను. ఆకారణముచే నయ్యుధిష్ఠిరునకు భయపడి యెవ్వఁడును ధృతరాష్ట్రుఁడు గాని, దుర్యోధనుఁడు గానీ చేసి యున్న దుష్కృత్యమును నోట నుచ్చరించినవాఁడు గాఁడు.

ఇట్టి యజాతశత్రుని సత్ప్రవర్తనముచే గాంధారీ ధృతరాష్ట్రులును, విదురుఁడును మిక్కిలి సంతోషించినవారైరి. కాని భీముని ప్రవర్తనము మాత్రము వారి కంత సంతోషము గలిగించినది గాదు. భీముఁడైనను విధిలేక ధర్మరాజు ననుసరించెనే గాని ధృతరాష్ట్రునిఁ జూచినపుడెల్ల నాతఁడు తనమనసులోఁ గలంగుచుండెను. శత్రుసంహారకుఁడగు భీమసేనుఁడు ధృతరాష్ట్రుని ననువర్తించుచున్న ధర్మరాజును దా ననువర్తించుట గూడ బొత్తిగా మనసులో నిష్టము లేకయే.

ఇది రెండవ యధ్యాయము.

---

## ధృతరాష్ట్రుఁడు భీముని పరుషోక్తులచే వనగమనమునకు నిశ్చయించుకొనుట.

ఇట్లు జరుగుచుండ రాష్ట్రములోని ప్రజలు యుధిష్ఠిర మహారాజునకును, దుర్యోధనుని తండ్రికిని (ధృతరాష్ట్రునికిని) నొండొరులయెడఁ గల ప్రేమవిషయములో నెట్టిభేదమును గానరైరి. ధృతరాష్ట్రుఁడు తనకుమారుని (దుర్యోధనుని) స్మరణకుఁ దెచ్చుకొనినపుడెల్ల (అన్యాయముగాఁ జంపెనని) భీముని దురాత్మునిఁగా మనసులో ననుకొనుచుండెను. అట్లే భీముఁడు గూడ ధృతరాష్ట్రునిగుఱించి తనమనసులో ననుకొనెడివాఁడు. ఇట్లు వారుభయులును మనసులలో ననుకొనెడివారే గాని, పైకిమాత్రము ప్రియవచనములతో సంభాషించుకొనుచుండిరి. భీముఁడు, మున్ను ధృతరాష్ట్రుఁ డొనరించియున్న దురాలోచనను, నడిపియున్న దుష్కృత్యములను

దలఁచుకొని రహస్యముగా నాతని కప్రియములు చేయుచు, వంచకులచే నాతని యాజ్ఞ సాగకుండఁ బ్రతిష్టంభనము సేయుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు భీమసేనుఁడు మిత్రులందఱు కూడియుండగా వారినడుమఁ దన శత్రువులగు కర్ణ దుశ్శాసన దుర్యోధనులను దలఁపునకుఁ దెచ్చుకొని యుగ్రుఁడై భుజములు చఱచి గాంధారీధృతరాష్ట్రులు వినునట్లు మిక్కిలి యాద్ధత్యముతో నిట్లు కఠినముగాఁ బలికెను. 'మిత్రులారా! యీ గ్రుడ్డిరాజుకొడుకులు! నానాశస్త్రాస్త్రయోధులు!! పరిఘలవంటి (ఇనుపగుదియలవంటి) నా బాహువులలోఁ బడి చచ్చిరి. ఇట్టి నా బాహువుల నోరులోర్వఁగలరా? ఈ బాహువులనడుమఁ జిక్కి ధృతరాష్ట్రునికొడుకులు నీల్గిరి సుఁడీ! దుర్యోధనుని సపుత్రబాంధవముగా యమలోకమునకు సాగనంపినవి యీ నాభుజములే! ఇట్టి నా బాహువులకు గంధము పూసి పూజించి నమస్కరింప నగును.' అని యీ వాక్యములను, మఱికొన్ని వాక్యములను మర్మఘాతముగాఁ బలికెను. ధృతరాష్ట్రుఁడు శల్యప్రాయములుగా నున్న భీముని వాక్యములను విని 'ఛీ! ఛీ!! యెంత హేయము' అని నిర్వేదము నొందెను. బుద్ధిశాలినియు, సర్వధర్మజ్ఞురాలును, కాలమునం[illegible]లి మార్పులను గుర్తెఱిగినదియు నగు గాంధారీదేవి యప్రియము లగు నీ మాటలు విని, మాన్యురాలైన కుంతీదేవిని జూచి భీముని శపింప కూరకుండెను.

అనంతరము పదునేనవవత్సరము గడచుటయు ధృతరాష్ట్రుఁడు భీముని వాక్యములు శల్యములై హృదయమును

గలంపఁ దన జీవితముపై నిర్వేదము నొందుచుండెను. కాని యీ సమాచారము ధర్మరాజునకుఁ దెలియదు. అర్జునునకుఁ గాని, కుంతికిఁగాని, ద్రౌపదికిఁ గానీ యెవ్వరికిని దెలియదు. నకుల సహదేవులకు మాత్రము తెలియును. వారు భీమునిమతానుసారముగాఁ బోవుచుందురు; కాన వారికిఁ దెలిసినను వారీసంగతి ధర్మరాజుచెవిని బడినచో నాయన మనసు సంక్షోభించు ననియు, ఆయన మనసునకు సంక్షోభము గల్గింప రాదనియు నీ సమాచార మాయనకుఁ జెప్పరైరి. ఇట్లున్నయెడ ధృతరాష్ట్రుఁడు తన మిత్రులను బిలిపించి మిక్కిలి తొట్రుపడుచున్న కంఠస్వరముతో నిట్లు పలికెను.

'మిత్రులారా! తెలియుదురుగదా! కౌరవక్షయ మెట్లు జరిగినదియును. ఇది యంతయు నా యపరాధమువలననే జరిగిన దని తెలియనగును. నేను బుద్ధిలేక దుష్టాత్ముఁడును, జ్ఞాతిభయవర్ధనుఁడు నగు దుర్యోధనుని, కౌరవరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేసితిని. శ్రీకృష్ణుఁడు చెప్పిన శ్రేయోదాయకములైన వాక్యములను వినకపోయితిని. ఇందుచేత మంచిచెడ్డ లెఱిఁగిన పెద్దలు నన్నుఁగూర్చి 'ఈతఁడు పాపాత్ముఁడు. ఈ దుర్మతిని మంత్రిజనసహితముగాఁ జంపఁదగును. ఇట్లు సేయుట తప్పుగాదు.' అని పలికిరి. వా రన్నమాటలు పుత్రస్నేహాభిభూతుఁడనగు నన్నుఁ దగినవే యగును. విదురుఁడు, భీష్ముఁడు, ద్రోణాచార్యుఁడు, కృపుఁడు, మహాత్ముఁ డగు వ్యాసభగవానుఁడు, సంజయుఁడు, గాంధారి వీరందఱు మాటిమాటికి నా హితమును గోరి చెప్పుచు వచ్చిరి. ఏమైన నేమి?

గుణవంతులు, మహాత్ములు నగు పాండుకుమారులకు వారి తాతతండ్రులపాలిరాజ్యమును వారి కిచ్చినవాఁడను గానైతిని. ఇట్లు చేసినందుల కే నెంతయుఁ బరితపించెదను. జనార్దనుఁ డగు శ్రీకృష్ణుఁడు సకలక్షత్త్రియులకును వినాశము కలుగ నున్న దని యెఱిఁగియే కాఁబోలు నే నిట్లు సేయుట యంతయుఁ బరమ శ్రేయస్కర మని తలంచెను. ఇట్టి నే నల నాఁడు నామూలమున జరిగిన యకార్యములను హృదయశల్యములైనవానిని వేలకొలఁదిగ నాహృదయములో మఱచిపోక స్మరించుచున్నాను. విశేషించి యీ పదునైదవయేఁట మిక్కిలి దహించుకొనిపోవుచున్నాను. మహాదుర్మతినైన నే నీపాపపరిహారమునకై నియమవ్రతము పెట్టుకొన్నవాఁడ నగుచున్నాను. నియతముగా * నాలవకాలముననో, (అపరాహ్ణకాలము) ఒకానొకప్పు డెనిమిదవ కాలముననో (రాత్రి పండ్రెండు గడియలమీఁదటికాలము) ఆహారము తీసికొనుచున్నాను. ఆ తీసికొను నాహార మైనను దాహశాంతికి మాత్రము గంజినీళ్లో యేవొ, అంతమాత్రమే కాని యాఁకటిబాధ తీఱుటకుఁ గాదు. ఈ సంగతి గాంధారికిఁ దెలియును. నేను యథాప్రకా

---

* ఒక పగటిలో నైదుకాలములు. కాలమున కాఱేసిగడియలు. అవి క్రమముగా ౧. ప్రాతఃకాలము. ౨. సంగవకాలము. 3. మధ్యాహ్నకాలము. ౪. అపరాహ్ణకాలము. ౫. సాయంకాలము, అనునవి. ఆఱేసి గడియలవంతున రాత్రికాలము విభాగింపఁగా సూర్యోదయమునుండి యెనిమిదవకాలము రాత్రి పండ్రెండు గడియలనుండి ప్రారంభ మగుచున్నదని తెలియవలయును.

గాదు. ఛీ! ఛీ!! నే నెంత దుర్బుద్ధిని? రాజ్యభోగములం దవిలి ప్రమాదపడిపోయితిని! తండ్రీ! నీవు నియతాహారుఁడ వై యుపవాసములు సేయుచు మిక్కిలి కృశించి దుఃఖార్తుఁడ వై భూతలశాయివై యుండఁగా నిన్ను నే నెఱుఁగఁజాల నైతిని! నాసోదరులై నను దెలియఁ జాలక పోయిరి. అకటా! మనసు దాఁచి ప్రవర్తించిన నీచే మూఢుఁడ నగు నేను వంచితుఁడ నైతిని. ఇతఃపూర్వము నన్ను విశ్వసింపఁ జేసి యిపుడు నీవు దుఃఖార్తుఁడ వగుట నన్ను వంచించుట గాదా? మహీపాలా! నీ విట్లున్నపుడు నాకీరాజ్యముతోఁ బని యేమి? భోగములతోఁ బని యేమి? యజ్ఞము లెందులకు? సుఖ మెందులకు? ఇంతవఱకే నీనిమిత్తము దుఃఖితుఁడ నై యున్న నన్ను, నాయాత్మను, నారాజ్యమును నీ వన్నయీ మాటతో మరలఁ గొంత నొప్పి పఱచినట్లుగా భావించుచున్నాను. మాకుఁదండ్రివి నీవు. తల్లివి నీవు. పరమగురుఁడవు నీవు. ఇట్టి వాఁడవు మమ్ము విడిచి పోయిన నిఁక మే మెక్కడ నుందుము? మహారాజా! నీ వన్యునిఁగా భావించుచుండిన యుయుత్సుఁడు నీ ఔరసపుత్రుఁడు. అతఁడు రా జగుఁ గాక. నేను వనమున కరిగెదను. నీవు రాజ్యమును బాలింపుము. ఇప్పటికే యప కీర్తిచే దహింపఁబడి యున్న నన్ను నీవు మరల దహింపఁ దగవు. నేను గాదు రాజు! నీవు. నీచే నేను బరాధీనుఁడను. నేనా నీ కిప్పు డాజ్ఞ యిచ్చువాఁడను? నీవు నాకు గురుఁడవు, ధర్మజ్ఞుఁడవును. ఇట్టి నీకు నే నెట్లాజ్ఞ యిత్తును? అనఘా! సుయోధనుఁ డొనరించిన కృత్యములపై మామనస్సులలో నించుకేని యాగ్రహము లేదు. అది యట్లు కావలసి

యున్నది, అయినది. అంతియే కాని యతఁడేమో చేసె నని మేమును, మావలె నితరులును అజ్ఞానములోఁ బడి మోహితుల మైతిమి. దుర్యోధనాదు లెట్లో యట్లే మేమును నీకుఁ బుత్రులము. మేమును—, గాంధారియుఁ, గుంతియు నొకటే యనుకొంటిమి గాని భేదము తలఁచినవారము గాము. రాజా! నీవు నన్ను వదలి పోయితి వేని నేను నీవెనువెంటనే వచ్చెదను. నిజము! నన్నుఁ జంపుకొనినంత! నీవు న న్నెడఁబాసి పోయితివేని ధనసంపూర్ణమై సముద్రముద్రితమైన యీ ధరణి నాకు సంతోషకరము కాఁ జాలదు. రాజేంద్రా! యిది యంతయు నీది. మేము నీయధీనులము. తల యొగ్గి ప్రార్థించుచున్నాఁడను. నీ మనోజ్వరము తొలఁగుఁగాక. ఇంతవఱకు నీవనుభవించిన దంతయు దైవయోగముచే నగు యట్లు గానుండి యనుభవించితివి గాఁ దలంచెదను. నేను నీకు శుశ్రూషలు చేసి నీమనోవ్యాధిని దొలఁగించెదను.' అని దోసిలి యొగ్గి వేఁడుకొనుచు, వణఁకుచు నున్న ధర్మరాజునకు ధృతరాష్ట్రుఁ డిట్లనియె.

'నాయనా! కురునందనా! నామనన్ను తపన్సు చేసికొన నిచ్ఛగించుచున్నది. మన వంశమునం దరణ్యములకు వెడలుట యుచితము గూడ. కుమారా! నీచే శుశ్రూషలు గొనుచుఁ జిరకాల ముంటిని. నేను వృద్ధుఁడనై నను నీవు రాజవు కావున నన్ను నీ వాజ్ఞాపింపఁ దగుదువు.' అని చెప్పి నీతిశాలి యగు విదురుని, మహాత్ముఁ డగు సంజయుని, మహారథుఁ డగు కృపాచార్యునిఁ గాంచి 'అయ్యలారా! మీ రీధర్మరాజు నోదార్పుదు' రని కోరుచున్నాను. కేవలము ముసలితనము చేతను,

ఇంతమాత్రము సంభాషించుటచేతను ఈ నాహృదయము శోషించుచున్నది. ముఖ మెండుకొని పోవుచున్నది.' అని చెప్పి యావృద్ధరాజు వెంటనే ప్రాణములు పోయినవానివలె గాంధారిప్రక్క కొఱఁగి పడిపోయెను. స్మృతి లేనివానివలెఁ బడిపోయి యున్న యారాజును జూచి ధర్మరాజు తీవ్రదుఃఖముతో నిట్లు విలపించెను.

'అకటా! యెవ్వానికి నూఱువేలయేనుఁగులంత బలము గలిగి యుండెనో, ఆ యీరాజొకయాఁడుదాని నాశ్రయించుకొని చచ్చినవానివలెఁ బడి యున్నాఁడు. ఎవ్వానిచే మున్ను, భీమసేనునియాకృతిగాఁ జేయఁబడిన యా యినుపప్రతిమ చూర్ణము చేయఁబడెనో, ఆయీ బలాఢ్యుఁ డబల యైన స్త్రీ నాశ్రయించినాఁడు! చీ! చీ!! నే నెంత ధర్మము తెలియని వాఁడ నైతిని! ఏమి నాబుద్ధి? ఏమి నాచదువు? కాల్పనా? నానిమిత్తముగా నీరా జిట్లు నేలపైఁ బడి యున్నవాఁడే! ఇట్లుండఁ దగినవాఁడా యీమహారాజు? ఈరాజును, యశస్విని యైన గాంధారియు భుజింపక పోయిరేని నేనును నాగురుఁ డగునీరాజువలె నుపవసించెదను.' అని విలపించుచు ధర్మరాజు మూర్ఛఁదేర్చు మణులను, ఓషధులను జేత నుంచుకొని చల్లని నీరద్ది యాచేతితో నాతనివక్షస్థలమును, ముఖమును మెల్లగాఁ దుడిచెను. పవిత్ర మైనదియుఁ, బరిమళము వెలయించునదియు నగు నాధర్మజుని పాణిస్పర్శముతో నావృద్ధరాజునకుఁ దెలివి వచ్చెను. అంత ధృతరాష్ట్రుఁడు జలశీతలపాణితలముతో మాటిమాటికిఁ దుడుచుచున్న ధర్మరాజు నాలింగనము చేసికొని యిట్లు పలికెను.

'కుమారా! నీకరస్పర్శనమువలన బ్రతికిన ట్లున్నాను. నాయనా! నీశిరము మూర్కొన నిచ్చ పొడముచున్నది. నీ చేతులతో న న్నొకమాఱు స్పృశింపుము. నా ప్రాణములకు హాయి గల్గెడిని. తండ్రీ! నే నాహారము పుచ్చుకొని ముప్పది గడియ లై నది. అందుచేతనే నే నేమియుఁ జేయఁజాలనై తిని. వనగమనమున కనుమతి యిమ్మని నీతో మాట్లాడిన యీకొంచె మునకే మిక్కిలి యాయాసము గలిగి స్పృహ తప్పినట్లయ్యెను. అమృతమువంటి సుఖస్పర్శము గల నీ హస్తస్పర్శముతో మరల నుజ్జీవితుఁడ నైనట్లు తలఁచుచున్నాను.' అని తన పెద తండ్రి చెప్పఁగా యుధిష్ఠిరుఁడు స్నేహార్ద్రహృదయుఁడై తన చేతితో నాయనశరీర మంతయును మెల్లగ స్పృశించెను. అంత ధృతరాష్ట్రమహారాజా జాత్తప్రాణుఁడై ధర్మరాజు నాలింగనము చేసికొని, శిరము మూర్కొనెను. విదురుఁడు మున్నగువా రంద ఱును బెద్దపెట్టున నేడ్చుచు నాదుఃఖాతిరేకమున ధర్మరాజు నోదార్చుటకై యేమియు మాటాడఁ జాలకుండిరి. ధర్మజ్ఞురా లగు గాంధారి యన్నన్నో మనసు బిగ్గఁ బట్టి దుఃఖము నాఁపు కొని, దుఃఖాక్రాంతులై యున్న ధర్మరాజునకును, దక్కిన వారికిని 'ఇట్లు సేయఁదగ' దనికూడఁ జెప్పెను. కుంతి మున్నగుస్త్రీ లందఱును బెద్దపెట్టున నేడ్చుచు, చుట్టు మూఁగిరి. అప్పుడు ధృతరాష్ట్రుఁడు మరల ధర్మరాజును జూచి 'భరతర్షభా! రాజా! తపస్సు చేసికొన నా కనుజ్ఞ యిమ్ము. నాయనా! తేపతేపకు నిన్నడుగుచున్నందున నా మన స్సాయాసపడుచున్నది. ఇఁక ముందు న న్నాయాసపెట్ట వలదు.' అని ధృతరాష్ట్రుఁడు చెప్పుచుండ నంతఃపుర స్త్రీల

యార్తనాదము పెద్దపెట్టున నుప్పతిల్లెను. అప్పుడు ధర్మరా జుపవాసములచే నలసి కృశించి యస్థిచర్మావశేషుఁడై కళ దఱిఁగి యున్న వృద్ధునిఁ దమపెదతండ్రిని గౌఁగిలించుకొని కన్నీరు గార్చుచు మరల నిట్లు పలికెను. 'నరశ్రేష్ఠా! నాకీ జీవితముపై నపేక్ష లేదు. భూమియు నక్కఱలేదు. పరంతపా! నీకుఁ బ్రియ మెట్లో యట్లు చేయఁ దలఁచుకొంటిని. నేను నీ కనుగ్రహింపఁ దగినవాఁడనేని, మఱియు నేను నీ కిష్టుఁడ నేని నీ విప్పు డాహారము పుచ్చుకొందువుగాక. అటు తరువాత నేను జేయఁదగిన కార్యమును దెలిసికొందును' అని చెప్ప ధృతరాష్ట్రుఁడు ధర్మరాజుతో 'కుమారా! నీవు నా కనుజ్ఞ యిచ్చినచో నేను భుజింతును. ఇదియే నేఁ గోరునది.' అని చెప్పెను. అతఁ డిట్లు చెప్పుచుండఁగా నింతలో సత్యవతీతనూ జుఁడగు వ్యాసమహర్షి యచటి కేతెంచెను.

ఇది నాలవ యధ్యాయము.

---

## వ్యాసుని ప్రేరణచే ధర్మరాజు ధృతరాష్ట్రుని వనగమనమున కంగీకరించుట.

వ్యాసమహర్షి ధర్మరాజుతో నిట్లనియె. 'యుధిష్ఠిరా! మహా బాహూ! ధృతరాష్ట్రుఁడు చెప్పినట్లు సేయుము. ఆలోచింప కుము. ఇతఁడా? కేవలము వృద్ధుఁడైనాఁడు. విశేషించి కొడుకుల నందఱను ఖోఁగొట్టుకొని జీవించి యున్నాఁడు. ఈ కష్టము నీతఁడు చిరకాలము సహింప లేఁడని నా యభిప్రాయము. మహాభాగ్యశాలినియుఁ, బ్రాజ్ఞురాలును, గరుణవేదినియు (శోకము ననుభవించినది గాన దాని

తత్త్వమును బాగుఁగాఁ దెలిసినదియు) నగు గాంధారియును బుత్రశోకము నతిధైర్యముతో నతికష్టముమీఁద భరించుకొని యున్నది. నేనుగూడ నీకిదే విషయము చెప్పుచున్నాను. నా మాటప్రకారము చేయుము. ధృతరాష్ట్రుఁడు నీవలన ననుజ్ఞ పొందుఁగాక. ఇక్కడ వృథాగా మరణింప నేల? పూఁదేనియవాసనలు గుబాళించు వనములలో నీతఁడు సుఖముగా నుండనిమ్ము. ఈరాజు పూర్వ రాజర్షులు వోయిన త్రోవఁ బోవుఁగాక. రాజర్షుల కందఱకును జివరకు వనము నాశ్రయించుటయే గదా!'

అని యద్భుతచర్యలు గల వ్యాసమహర్షి చెప్ప ధర్మరాజమ్మహాముని కిట్లనియె. 'మహాత్మా! భగవానుఁడే (తామే యనుట) మాకు మాన్యుఁడు. భగవానుఁడే మాకు గురుఁడు. మా యీ రాజ్యమునకును, మా వంశమునకును, భగవానుఁడే యాశ్రయము. పూజ్యపాదా! నేనో పుత్త్రుఁడను. ఈ రాజో నాకుఁ దండ్రియును, గురుఁడును. ధర్మము ననుసరించి కుమారుఁడు తండ్రియాజ్ఞ నడుచుకొనవలయునుగదా!' అని చెప్ప వేదవిద్వరిష్ఠుఁడును, మహాతేజస్కుఁడును, మహాకవియు నగు వ్యాసమహర్షి ధర్మరాజుతో మరల నిట్లనియె. 'మహాభాగా! నీవు చెప్పినది వాస్తవము. ఈ రాజు వార్ధక్యముఁ బొంది యున్నాఁడు. పరమప్రామాణికుఁడు కావున నీ రాజునకు నే ననుమతి యిచ్చుచున్నాను. నీవును ననుమతి యిత్తువుగాక. ఆయన తనయిచ్ఛ వచ్చినట్లు తపస్సు చేసికొనని నిమ్ము. విఘ్నకరుఁడవు గాకుము. ఇదియే రాజర్షులకుఁ బరమధర్మము. యుద్ధములోనైనఁ జావవలె, లేదా? విధిపూర్వకముగా వనములలో

నైన మరణింపవలె. రాజేంద్రా! మీ తండ్రి పాండురాజు శిష్యుఁడుగా నుండి యీరాజును గురు నుపాసించినట్లు యుపాసించి యున్నాఁడు. ఈ రాజు, సంపూర్ణదక్షిణలు వెట్టి పర్వతములంతటి రత్నరాసులతో శోభిల్లుచుండ మహాక్రతువు లనేకము లొనరించి యున్నాఁడు, పృథివీ సామ్రాజ్యము నేలినాఁడు, ప్రజలను బరిపాలించినాఁడు. నీ వరణ్యవాసముసేయుచున్నకాలములో నీయఖండసామ్రాజ్యమును గొడుకునకుఁ గట్టఁ బెట్టి పదుమూఁడేఁడులును ననుభవించినాఁడు. పెక్కుధనములు దానము చేసినాఁడు. మఱియు నీవు, నీ భృత్యులతోఁగూడి శుశ్రూషించుచుండ గాంధారీసమేతముగాఁ దాను నీ శుశ్రూష లందుకొన్నాఁడు. కనుక నిఁక నే కొఱతయు లేదు. కాన నీతనికి వనగమనమున కనుజ్ఞ యిమ్ము. ఇది యీతనికిఁ దపశ్చర్య చేసికొనఁ దగిన సమయము. వనములలో నున్నందువలన నీతనికి లేశమాత్రమును మృత్యుభయము లేదు.' అని చెప్పి ధర్మరాజు ననునయించి యతనిచే 'తథాస్తు' అని యనిపించుకొని తాను వనమున కరిగెను.

వ్యాసభగవానుఁ డరిగిన తరువాత ధర్మరాజు, వంగి నమస్కరించి వృద్ధుఁడైన తన పెత్తండ్రితో మెల మెల్లగా నిట్లనియె. 'తండ్రీ! వ్యాసభగవానుఁ డేమి యానతిచ్చెనో, నీ యభిమత మేదిగా నుండెనో, కృప విదుర సంజయ యుయుత్సులేవిధముగాఁ జెప్పిరో యట్లే యది యంతయుఁ ద్వరగా నేను నిర్వర్తింతును. మీ రందఱును నాకు మాననీయులును, కులమునకు హితమును గోరువారును గదా! నాయనా! నేను దలఁ దాఁకి నమస్కరించి యిది యొకటిమాత్రము నిన్నుఁ గోరు

చున్నాను. ఏమన? ముందు నీవిప్పుడు భోజనముచేయుము, తరువాత నాశ్రమమునకుఁ బొమ్ము. ఇదియే నా ప్రార్థన.'

ఇది యైదవ యధ్యాయము.

---

{వనగమనమున కనుజ్ఞాతుఁడైన ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునకు రాజనీతి గఱపుట.}

అనంతరము మహామనస్కుఁడైన ధృతరాష్ట్రమహారాజు ధర్మరాజుచే ననుజ్ఞాతుఁడై గాంధారి తనవెంట రాఁగా నప్పుడు నిజమందిరమున కరిగెను. శోషించి యుండుటచేఁ బ్రాణగతి మందగించి యున్న యమ్మహీపాలుఁడు ముసలి యేనుఁగువలె నతికష్టముమీఁద నడుగు లిడుచు వెళ్లెను. ఆతని వెంట విద్వాంసుఁ డగు విదురుఁడును, సూతుఁ డగు సంజయుఁడును, మేటివిలుకాఁ డగు కృపాచార్యుఁడును వెళ్లిరి. ఆ రాజును—నిజగృహము ప్రవేశించి పూర్వాహ్ణిక క్రియలు నిర్వర్తించి, బ్రాహ్మణోత్తములను దృప్తిపఱచి తర్వాతఁ దా నాహారముఁ బుచ్చుకొనియెను. ధర్మజ్ఞురాలు, దృఢమనస్కురాలు నగు గాంధారియును—గోడండ్రుపచారము చేయుచుఁ దన్ను సేవింపఁ దాను గుంతితోడ భోజనము సేసెను. విదురాదులును, పాండవులును—అందఱును భోజనము చేసి కృతాహారుఁడై యున్న ధృతరాష్ట్రమహారాజుసన్నిధిలోఁ గూర్చుండిరి. అంత నా ధృతరాష్ట్రమహారాజు తన దగ్గఱఁ గూర్చుండియున్న ధర్మరాజును జేతితో వీపుఁ దడవుచు నిట్లు చెప్పెను.

'కురునందనా! రాజశార్దూలా! * అష్టాంగ సంపన్నమైన రాజ్యమును ధర్మపురస్సరముగాఁ బరిపాలించుచు నీ వేమాత్రమును నేమఱుపాటుఁ జెందక సర్వవిధముల నెచ్చరిక గలిగి యుండవలయును. రాజ్యమును రక్షించుకొనుట యను పని ధర్మముచేతనే సాధ్యమయ్యెడి సుమీ! నీవు విద్వాంసుఁడవు. నీ వీ విషయమును జక్కఁగాఁ దెలిసికొనుము. యుధిష్ఠిరా! నీ వెల్లప్పుడును విద్యావృద్ధు లగు వారలను సేవించుచుండుము. వా రేమి చెప్పుదురో దానిని వినుము. విని వేఱువిచారము సేయక వారు చెప్పినట్లు చేయుము. నీవు ప్రొద్దుననే లేచి, యథావిధిగ వారిని బూజించి, కార్యములయవసరము వచ్చి నప్పుడు నీ కార్యమునుగుఱించి వారి నడుగుము. లోక హితార్థివై నీవు వారిని బూజించితివి గాన నీచేఁ బూజితులై సర్వవిధములచేతను వారు నీ మేలునుగుఱించి చెప్పఁగలరు. నీవు నీ సర్వేంద్రియములను గుఱ్ఱములను నిర్బంధించినట్లు నిర్బంధించి వానిని రక్షింపుము. అట్లు రక్షించితివేని యవి, రక్షింపఁబడిన ధనమువలె నీ మేలునకే కాఁగలవు. † ఉపధా శుద్ధులును, తండ్రి తాతల తరములనుండియుఁ బారంపర్యముగా వచ్చుచున్నవారును, నిర్దోషులును, మనోనిగ్రహము

* స్వామి (=ప్రభువు), మంత్రులు, మిత్రులు, కోశము (=బొక్కసము), రాష్ట్రము (=పట్టణములతోఁ గూడిన దేశము), దుర్గములు (పర్వతాదులచేఁ బోవ శక్యముగాని పట్టణములు), సేనలు, ప్రజలు—ఈ యెనిమిది రాజ్యమున కుండవలసిన యెనిమిది విధములగు నంగములు.

† ఉపధ అనఁగా ధర్మార్థకామములచేత మంత్రి లోనగువారిని బరీక్షించు పరీక్ష.

గలవారును, కేవలము ముఖ్యులుగా నుండువారు నగు మంత్రు లను ముఖ్యములుగా నున్న యన్ని కార్యములయందును నియమింపుము. నాయనా! నీవు పరులచేఁ దెలియఁబడక, నీచారులను నీవు చక్కఁగాఁ బరీక్షించి, పలువిధములచే నర్హు లని తోఁచినవారిని బంపి నీరాష్ట్రములలోను, బరరాష్ట్రముల లోను బ్రచారము చేయింపుము. మఱియు దృఢములైన ప్రాకారములు గల్గి, దిట్టమైన బహిర్ద్వారముచే నొప్పి, దిటవు లగు కోట 'బురుజు' లచే నిండి, ఆఱు (ఏడు) అంతస్తులచే నొప్పు రాణివాసము గల నీ పట్టణ మన్నిదిక్కులను జక్కఁగా రక్షింపఁబడవలయును. నీ పట్టణద్వారములన్నియుఁ జాల పెద్దవి. ఉండవలసినంత యున్నవి. అట్టి స్థానములయందుఁ జక్కఁగా నమర్పఁబడియున్నవి. మఱియు యంత్రములచే రక్షితములై కూడ నున్నవి. రాజా! నీవు కులశీలములు చక్కఁగాఁ దెలి యఁబడిన పురుషులచేతనే నీ రాజకార్యములను జక్కఁబఱచు కొనుము. భారతా! మఱియు భోజనాదులయందును, ఆహార విహారకాలములయందును, పుష్పహారములు ధరించునపుడును, శయ్యపైఁ బరుండునపుడును, పీఁట మొదలగు నాసనములపైఁ గూర్చుండు నపుడును నిన్ను నీవు కాపాడుకొనవలయును. నీ యంతఃపుర స్త్రీలను వృద్ధులుగాను, ఆప్తులుగాను, శీలసంపన్ను లుగాను, సత్కుల సంభూతులుగాను, జక్కఁగాఁ జదువుకొన్న వారుగాను—ఉన్నట్టి సత్పురుషులయధీనములో నుంచి మిక్కిలి జాగ్రత్తగా రక్షింపవలయును. మఱియు నన్నివిద్య లలో నాఱితేఱినవారును, వినయవిధేయతలు చక్కనై యొప్పువారును, మంచికులమునఁ బుట్టినవారును, ధర్మార్థకుశలు

లును, మనోవాక్కాయకర్మములచేఁ బరిశుద్ధులును నగు బ్రాహ్మణోత్తములను మంత్రులనుగా నియమింపుము. నియమించి నీవు వారితోఁ గార్యభాగము నాలోచింపుము. ఆ యాలోచించుటలోను-బెక్కుమందితో విశేషముగ నాలోచింపకుము. ఏదో నెపము పెట్టి యొక్కొక్కరితోఁ బ్రత్యేకముగ నాలోచింపుము. తర్వాత నందఱితో నాలోచింపుము. రహస్యముగా నేర్పాటు చేయఁబడిన మంత్రగృహములోని యుపరిస్థలమున కెక్కి మంత్రాలోచనము సేయుము. లేదా ? గడ్డిగాదము లేని నిర్జరారణ్యమునకుఁ బోయి యాలోచింపుము. రాత్రిపూఁట నెంతమాత్రము నాలోచింపఁ జనదు. మనుష్యభాషణములు విని యట్లె యనుకరింపఁగల కోఁతులు, పక్షులు మున్నగున వేవియు మంత్రగృహమునం దుండఁదగదు. మఱియు, మూఁగవాండ్రును, గుంటివాండ్రునుగదా యని యట్టి వారిని మంత్రగృహములోనికి రానీయరాదు. రాజులకు మంత్రభేద ముప్పతిల్లెనేని యందువలనఁ గలిగెడి దోషముల నతికష్టముమీఁద నేనియు సరిపఱచుకొనుటకు సాధ్యము గాదని నాయభిప్రాయము. కావున నోయరిందమా! నీవు మంత్రభేదమువలని దోషములను, మంత్రరక్షణమువలని గుణములను మంత్రిసంఘమునందు మాటిమాటికిఁ జెప్పుచుండవలయును. యుధిష్ఠిరా! పట్టణములలోను, బల్లెలలోను నివసించు జనులయొక్క మంచి చెడ్డలనుగుఱించి నీ కెట్లు తెలియఁబడఁగలదో యట్లు చేయుము. రాజా ! నీరాజ్యవ్యవహారములను నీ కాప్తులగువారి యాధిపత్యమున, తుష్టులును, హితులును నగు చారులచే నెల్లప్పుడును జేయించు చుండునది.

భారతా ! నీ న్యాయాధికారులు దండనార్హు లగువారియెడ వారు వా రొనరించిన యపరాధములకుఁ దగిన దండనమును సరిగాఁ బరిశీలించి, న్యాయాతిక్రమణము గాకుండ దండనము విధింతురుగాక. (అన్యాయాధికారులలో) లంచగొండులును, పరస్త్రీలను దడవువారును, తప్పునకు మించిన కఠినశిక్ష విధించు వారును, న్యాయము చెప్పుచున్నా మని యసత్యముఁ జెప్పువారును— (ఇతరులలో) తిట్టుచుండెడి వారును, లోభులును, దొంగతనము చేయువారును, సాహసకార్యము లొనరించు వారును, సభ జరుగుచున్నపుడు చెడఁగొట్టువారును, వర్ణ సాంకర్యము సేయువారును—వీ రందఱును ఆయా దేశ కాలముల ననుసరించి ధనదండనముతోనో (జుల్మానా), ఉరిశిక్షతోనో దండింపఁ దగినవారుగా నుందురు. కుమారా ! రాజు, అంతఃపురములో నెక్కడేని భృత్యులతోఁగలసి మద్యపానము చేయరాదు. అట్లు చేసినచో మద్యపానము చేసిన భృత్యులు కైపెక్కి తిట్ట నారంభింతురు. రాజపత్నిని సంగ్రహించినను గూడ సంగ్రహింతురు. మతిచెడి శస్త్రము దీసికొని చంపఁ దలఁచినను జంపఁ దలఁచినవారే. ఇది గాక చెలరేఁగి గంతులిడుదురు. నానావిధాక్షేపణములును జేయ మొదలిడుదురు. పోఁదగిన చోట్లని, పోరాని స్థలము లని తెలియఁజాలకుందురు. భృత్యుల సంగతి యటుండ రాజుగూడ నతిపానము చేయరాదు. అతిపానముచే ధనము నంతయు నాశము చేయును. తన్నుఁ బొగడిన స్తుతిపాఠకులకు వృథాగా ధనరాసులఁ గొల్లవెట్టును. మద్యపానముచే లోకమున నిందపాలగును. నానావిధదోషములకును బాత్రుఁ డగును. కనుక రా జతిగా మద్య

పానము చేయరాదు. వీర్యాభివృద్ధి కని పానము చేసినను దా నొక్కఁడుగా భార్యతోడఁ బానము చేయవలయును. అట్లు చేసినను గొన్ని సూచనలనుబట్టి యది యెట్లయినను బయటఁ బడనే పడును. కుమారా! నీకుఁ బ్రియకార్యము లొనరించువా రెవరో వారిని బ్రతిదినము ప్రాతఃకాలముననే చూచు చుండుము. ఆతరువాత నలంకారము చేసికొని, పిమ్మట భోజనము చేయుము. అనంతరము యుద్ధవీరులను జూడుము. ప్రతి దినమును వారలను సంతోషపెట్టుచుండుము. నిత్యమును సాయంకాలము దూతలను, చారులను జూడుము. వారల వలన వినిన కార్యార్థములను వేకువజామున నిర్ణయింపుము. ప్రతిదినము మధ్యాహ్నకాలమునను, అర్ధరాత్రకాలమునను వినోదవిహారములు సలుపుము. భరతసత్తమా! రాజకీయ వ్యవహారముల కొక కాల మని నియతి లేదు. అన్ని వేళలును దగినవి గానే యుండును. నీ విట్టిదముగా నడచుకొనుచు, నుచితకాలములందు భూషణాదులచే నలంకరించుకొని భూరి దక్షిణలతో సిద్ధముగా నుండుము. భూషణములను దీసివేసి యుండకుము. అక్కఱ లేదని ధరింపకుండ నుండకుము. భూషణము లెల్లప్పటికిని ధరింపఁదగినవి. అవి మంగళకరములును, పాపనాశకములును నగును. నాయనా! కార్యముల వరుస యొక దాని వెంట నొకటి బండిచక్రమువలెఁ గనఁబడుచుండును. మహారాజా! బహువిధోపాయములచేఁ గూర్పఁదగిన ధనమును గూర్పువిషయమై న్యాయమార్గమునఁ బ్రయత్నింపుము. అన్యాయమార్గమును విడువుము. నరనాథా! యెవ్వారు రాజులకుఁ గీడు సేయసమయమునకు వేచియుందురో

యట్టిశత్రువుల నాప్తులచే దూరమునఁ జంపింపుము. కురూద్వహా! భృత్యులను దీసికొనువిషయమున ముందుగా వారు చేయుపనిని బరిశీలించి, తరువాత వారిని దగ్గఱఁ జేర్చికొనుము. చేర్చికొని, యుక్తాయుక్తవివేచన గల యధికారులను వారిపై నుంచి, వారిచేఁ గార్యములను జేయింపుము. నాయనా! నీ సేనానాయకుఁడు దృఢవ్రతుఁడుగను, శూరుఁడుగను, గష్టముల కోర్చువాఁడుగను, హితుఁడుగను, భక్తుఁడుగను నుండవలయును. వడ్రంగులు, చిత్రకారులు మొదలైన పనిపాటులవాండ్రందఱును విసువొందక వృషభములవలెను, రాసభముల (కంచరగాడిదల) వలెను నీ కార్యములను నెఱవేర్చుచుందురుగాక. యుధిష్ఠిరా! తమవారియం దెట్టిలోపము లుండునదియుఁ, బరులయం దెట్టిలోపము లుండునదియు నెల్లప్పటికిని నీవు కనిపెట్టుచుండవలయును. మఱియు స్వదేశమునఁ బుట్టినవారును, దమ తమ కర్తవ్యములను నిర్వర్తించుటలో మహాశూరులును, హితులు నగువారిని దగ్గఱఁ దీసి తగిన జీవనోపాధులను గల్పించి యాదరింపవలయును. రాజా! విద్వాంసుఁడ వగు నీవు మంచి కోరెడివారికి మంచి చేయవలయును. అట్లు చేసినచో నీక వారినిగుఱించి యేమాత్రమును విచారణ చేయవలసిన యక్కఱ యుండదు. వారేనాఁటికైనను బర్వతములవలె నిశ్చలముగా నుండఁగల్గుదురు.

ఇది యాఱవ యధ్యాయము.

---

### ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునకు రాజనీతి సెప్పుట.

యుధిష్ఠిరా! నీవు స్వమండలమును, బరమండలమును దెలిసికొనుము. అట్లే యుదాసీన మధ్యస్థుల మండలములను దెలిసికొనుము. మఱియు * నాల్గురకములైన శత్రుపక్షము వారిని † ఆఱు రకములైన ఆతతాయివర్గము వారిని దెలిసికొనుము. మఱియు నీ మిత్రులను, నీ శత్రుని మిత్రులను దెలిసికొనుము. అట్లే వారివారి మంత్రివర్గమును, గ్రామములను, వివిధములైన దుర్గములను, సైన్యములను దెలిసికొనుము. ఇవి యన్నియు భేద్యములుగాను, నభేద్యములుగాను నుండును కనుక నీవు, నీ మంత్రివర్గ ప్రభృతు లభేద్యులుగా నుండునట్లు జాగరూకుఁడవై యుండుము.

కౌంతేయా! ‡ రాజులు పన్నిద్దఱు. వారు శత్రువు,

---

* నాల్గురకములైన శత్రుపక్షమువారు:—శత్రు వొకఁడు, శత్రుని మిత్రుఁ డొకఁడు, తనకును దన శత్రువునకును జయము గోరువాఁ డొకఁడు, తనకును దనశత్రువునకును బరాజయము గోరువాఁ డొకఁడు—వీరు నలువురు.

† ఆఱురకములైన ఆతతాయులు:—కొంపలు గాల్చువాఁడు, విషము పెట్టువాఁడు, కత్తితో నఱకువాఁడు, ధనము దోఁచుకొనిపోవువాఁడు, భూమి నపహరించువాఁడు, పరునిభార్యను జెఱఁబట్టువాఁడు — వీ రార్వురు ఆతతాయులు.

‡ పన్నిద్దఱు రాజులు:—తా నొకఁడు; తన మిత్రుఁడు, అతని మిత్రుఁడు-వీ రిరువురు; తన శత్రు వొకఁడు, తనశత్రుని మిత్రుఁ డొకఁడు, వాని మిత్రుఁ డొకఁడు-వీరు ముప్వురు; పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందుఁడు,

మిత్రుఁడు అని పలురకములవారుగా నుందురు. * మంత్రము మొదలైన గుణము లఱువది. ఈ పన్నిద్దఱు రాజులును, ఈ యఱువది గుణములును గలసి యొక మండల మని నీతి శాస్త్రజ్ఞులైన పెద్దలు వక్కాణింతురు. యుధిష్ఠిరా! యీ మండలమునందు † సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయములను షాడ్గుణ్యము, అధీనమై యున్నది. దానిని నీవు తెలిసికొనుము.

---

పార్ష్ణిగ్రాహాసారుఁడు, ఆక్రందనాసారుఁడు-అను వారు నలువురు; మధ్యస్థుఁడు, ఉదాసీనుఁడు అను వా రిరువురు; వీ రందఱు కలసి పన్నిద్దఱు రాజులు. జయేచ్ఛ గల ప్రతిరాజునకును దాను గాక తక్కిన పదునొకండు మంది రాజులును నుందు రని తెలియవలయును.

* అఱువది గుణములు :—కూర్చుకొనఁ దగినవి కృష్యాదు లెనిమిది. చేర్చుకొనఁ దగని బాలుఁడు మొదలైన వా రిరువదిమంది. పరిత్యజింపఁ దగిన నాస్తికత మొదలైన దోషములు పదునాలుగు. అవలంబింపఁ దగిన మంత్రము మొదలైనవి పదునెనిమిది (౮+౨౦+౧౪+౧౮=౬౦.) వీని వివరణ మింతకంటె నీలకంఠీయవ్యాఖ్య విశదీకరించినది గాదు. నీతిశాస్త్రమునఁ దెలియనగును.

† సంధి = శత్రువుతో సంధి చేసికొనుట. విగ్రహము = శత్రువుతోఁ గలహించుట. యానము = శత్రువుమీఁదికి దండెత్తిపోవుట. ఆసనము = యుద్ధమునకై సమయమును నిరీక్షించుట. ద్వైధీభావము=శత్రువునకు బలము తగ్గుటకై యతని మిత్రునితో నతనిని వేఱుపఱుచుట. సమాశ్రయము = బలవంతునిని దన పక్షమునకుఁ జేర్చుకొనుట కాతని నాశ్రయించుట.

(పన్నిద్దఱు రాజులును, అఱువది గుణములును గలసిన) ఈ డెబ్బది రెండింటిలోను దాను దన శత్రునికంటె వృద్ధిలో నున్నదియు, క్షీణదశలో నున్నదియు, లేక సమానస్థితిలో నున్నదియుఁ దెలిసికొనవలయును. తరువాత షాడ్గుణ్యప్రయోగమువలని గుణములను దెలిసికొనవలయును. ఎట్లన:— ఎప్పుడు తన పక్షము బలిష్ఠమై శత్రుపక్షము దుర్బలముగా నుండునో, అప్పుడు కలహించి శత్రువులమీఁదికి దండెత్తవలయును. ఎప్పుడు శత్రుపక్షము బలిష్ఠమై తనపక్షము దుర్బలముగా నుండునో, అప్పుడు విజ్ఞుఁడగు రాజు తాను, తగ్గియున్నవాఁడు గాన శత్రువులతో సంధి చేసికొనవలయును. అట్లు సంధి చేసికొని తనకుఁ గావలసినంత ద్రవ్యసముదాయమును సమకూర్చుకొనవలయును. అట్లు సమకూర్చుకొనిన తరువాత దండెత్తి పోవుట కెప్పుడు తాను సమర్థుఁ డగునో, అప్పుడు వెంటనే శీఘ్రముగా దండెత్తి పోయి యా పని చక్కఁ జేసికొనవలయును. ఇట్లు చేయుట యుక్తము. దండెత్తి పో సమర్థుఁడై యున్న యా రా జీవిషయములో నేమాత్ర మాలోచన పెట్టుకొనఁగూడదు. తాను దన శత్రువుపై దండెత్తి పోఁజాలని పరిస్థితిలోఁ దన శత్రువు తనమీఁదికి రావచ్చును గాన నట్లు రాకుండుటకై యాతనికి స్వల్పఫలము నిచ్చు భూమి నొసఁగి గాని, విస్తారముగా నితరలోహములు చేర్చి కొలఁది పాటి బంగారము నిచ్చి గాని, లేక క్షీణదశలో నున్న తన మిత్రుని నతనిపక్షమునఁ జేర్చి గాని, కొలఁదిపాటి సేన నిచ్చి గాని సంధి చేసికొని ప్రబలుఁడై యున్న యాతనివలన నాపద లేకుండఁ దన్నప్పటికి రక్షించుకొనవలయును. కుమారా!

నీతో నొకఁడు సంధి చేసికొన వచ్చినపుడు నీవు సంధి కొప్పు కొని యా రాజు మరల మాట దప్ప కుండుటకై యాతని కొడుకును సంధినిమిత్తముగా నీ యొద్ద నుంచున ట్లాతనిని గోరుము. అట్లు చేయకపోయినచో గొప్ప యాపదపాలు కావ లసి వచ్చును. అట్లగుట శ్రేయస్కరముగాదు. ఒకవేళ నట్టి యాపత్తు ఘటిల్లెనేని యుపాయ మెఱిఁగి చక్కని యాలోచన చేసి య య్యాపదనుండి నిస్తరించుటకుఁ బ్రయత్నింపవల యును. రాజేంద్రా! రాజు, తన రాష్ట్రములోని ప్రజలలోఁ గుంటి, గ్రుడ్డి మొదలైన యనాథుల నాదరింపవలయును. తన రాజ్యమును జక్కఁగ రక్షించుకొను రాజు, ఎట్లయినను బ్రయత్నించి తన శత్రువు నొత్తిడిచేయుచు, నతనిశక్తి నణఁగఁద్రొక్కుచు, నతని ధనధాన్యకోశమును జెడఁగొట్టుచు నుండవలయును. ఈ చేయు ప్రయత్నమును శత్రుని బలా బలములను గనిపట్టి యొక్కొక్కటిగాఁ గాని, యన్నియు నొక్కమాఱుగాఁ గాని చేయవలయును. అభివృద్ధిని గోరు రాజు, త న్నాశ్రయించి యున్న సామంతరాజును బాధింపఁ జనదు. మఱియు నెవ్వాఁడు భూమిని జయింపఁ దలఁచుకొనునో, యట్టివాఁడుగూడఁ ద న్నాశ్రయించి యున్న సామంతరాజును బాధింపరాదు. కౌంతేయా! భూమిని జయింపఁ దలఁచినట్టి నీ కిది గమనింపఁ దగిన హిత వగును. ధర్మనందనా! గుణము లను (పైని జెప్పిన యఱువదియాఱింటిని.) భేదించు విషయ మున నీవు నీ మంత్రులతోఁ జక్కఁగ సమాలోచనము చేయుము. మఱియు రాజు, సాధువులను దగ్గఱఁ జేర్చుకొనుచు, దుర్మార్గులను దూరముగాఁ బాఱఁదోలుచుఁ దన యింటిలో

వలెఁ దన రాష్ట్రములోను—దన పరిపాలనమును సాగించుచు రాష్ట్రములోని ప్రజలను దనవశము చేసికొనవలయును. రాజా! యెప్పుడు గానీ బలీయుఁడైన రాజు దుర్బలులైన రాజుల నుపేక్షించి (?) లింపరాదు. (నీ విషయములో) ఒకవేళ బలవంతుఁడైన రాజు దుర్బలుఁడవుగా నున్న నీపై దండెత్తి వచ్చెనేని యప్పుడు నీవు వేతసీవృత్తి నాశ్రయించి (ప్రవాహము వచ్చినప్పుడు వంగియుండు ప్రబ్బలిచెట్టువలె వంగియుండి) ఆ వచ్చినవాఁడు మరలిపోవుటకు సామాద్యుపాయములను బ్రయోగించి యాతనిని మరలించునది. ఇట్టిపరిస్థితిలో దండెత్తి వచ్చిన శత్రురాజు సామాద్యుపాయములచే మరలి పోఁడేని యప్పుడు దుర్బలుఁడుగా నున్న రాజు ధనధాన్యములు కూర్చుకొని, దండోపాయమే తగిన దని తన మంత్రులతోడను, పౌరులతోడను, ఇంకను దనకుఁ బ్రియకారులుగా నున్న వారందఱితోడను యుద్ధమునకై యాతని మీఁదఁ బడవలయును. చిట్టచివర కేదియుఁ గాకపోయినచోఁ ననహాయశూరుఁడై తా నొక్కఁడేనియు నాతనిపైఁ బడవలయును. అందుఁ దాను హతుఁ డయ్యెనా మోక్షమే సిద్ధించినట్లు. యుద్ధములో సర్వమునకును ప్రధానమైన శరీరము నర్పించుట యొక్కటియే క్షత్రియశూరులకు మోక్షమగును.

ఇది యేడవ యధ్యాయము.

---



### ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునకు సంధి-విగ్రహప్రకారము నెఱిఁగించుట.

యుధిష్ఠిరా! యీరాజనీతిలో నీవు సంధిని, విగ్రహమును గనిపెట్టవలయును. సంధి విగ్రహములు రెండును—ప్రబలప్రతియోగికము లని, దుర్బలప్రతియోగికము లని రెండు కారణములు గలవి. (అనఁగాఁ బ్రబలుఁడుగా నున్నశత్రువు నెడఁ బ్రయోగించునవి యనియు, దుర్బలుఁడు గా నున్న శత్రువు నెడఁ బ్రయోగించునవి యనియు రెండుకారణములు గలవి యనుట.) ఇవి బహువిధోపాయములు గలవిగను, అనేక విధములుగా నుండునవిగను నుండును. కనుక నీవు స్థైర్యము గలిగి, నీబలాబలములను జూచుకొని, శత్రువు నెడఁ దగినట్లు ప్రవర్తింపుము. శత్రువు తనప్రజలను సంతోషపెట్టుచు, వారిని బరిపుష్టులుగఁ జేసి, పుష్కలముగా ధనము గలవాఁడై యుండెనేని యట్టివాని ననుసరించి వర్తింపుచుండుము. అట్లు వర్తించుచు నతనిని జయించు నుపాయ మాలోచించుచుండుము. అంతియగాని, యాలోచన లేకుండఁ దటాలున నతని మీఁదికిఁ బోకుము. మఱియు నతని ననువర్తించుచు నుండి, యాతఁడు వెనుకటియట్లు గాక, ధనబలము తగ్గి, ప్రజలను సంతోషపెట్టఁ జాల కున్నప్పుడు వానిమీఁదికి దండెత్తిపోవలయును. దండెత్తి పోఁ దలఁచినపుడు ముందుగా మఱియొక ప్రయత్నముగూడఁ జేయవలయును. ఏమన? శత్రువునకు వ్యసనము గలిగింపవలయును. అతనికిని, నతనిపక్షమువారికిని భేదము పుట్టింపవలయును. అనంతరము కొంత యొత్తిడి చేసి

భయపెట్ట వలయును. ఇంత చేసినను వెనుదీయక యుద్ధము నకే తారసిల్లినపు డాయుద్ధములో నతనిసైన్యమును విస్తారముగా హతము సేయవలయును.

రాజేంద్రా! శత్రువుమీఁదికిఁ బోఁ దలఁచినవాఁడు నీతిశాస్త్రవిశారదుఁడై ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి యను మూఁడు శక్తులను ఆలోచించుకొనవలయును. ఇందుఁ దనయొక్కయు, శత్రునియొక్కయు శక్తితారతమ్యమును బరిశీలించుకొనవలయును. ప్రభు మంత్రోత్సాహశక్తులు మూఁడును సరిగా నున్నవాఁడే శత్రువుమీఁదికిఁ బోఁదగునుగాని యట్లుగానివాఁ డాప్రయత్నమును మానుకొనవలయును. మఱియు శత్రువుమీఁదికిఁ బోవువాఁడు ధనబలము, మిత్రబలము, భృత్యబలము, ఆటవికబలము, శ్రేణీబలము, చారబలము అను నీయాఱువిధములైన బలములను జేకూర్చుకొని శత్రువుమీఁదికిఁ బోవలయును. ఈయాఱు బలములలో మిత్రబలము, ధనబలము అనునీరెండును నన్నిటికంటె నతిశయమైనవనియు, శ్రేణీబలము, భృత్యబలము అను నీరెండును సరిసమానము లనియు నాయభిప్రాయము. అట్లే చారబలముగూడఁ బైవానియన్నిటితోను సమాన మైనదియే.

రాజా! అన్నిబలములు సరిగా నున్నవేళలలోఁ గూడ, కానికాలము దాపరించినపు డాపదలును రావచ్చు నని రాజు తెలిసికొనఁ దగును. ఆవచ్చెడియాపదలు బహురూపములుగా నుండును; గనుక వానినిగుఱించి వేఱువేఱుగాఁ దెల్పెద వినుము. పాండునందనా! యీతిబాధలు మొదలగు నాపద లనేకములు. అవి వచ్చినపుడు ప్రజల కలజడి గలుగ కుండ

వానిరాకడ ముందు దెల్పుచు, సామోక్తులు చెప్పి వారి నూఱడించుచు, అవసరపడినపుడు వారికిఁ గావలసినది దానము చేయుచు ఆవచ్చిన యాపదలను గడపవలయును. అనంతరము (పైఁజెప్పిన) ఆఱువిధములైన బలములను గూర్చుకొని, దేశ-కాలములను, దనశక్తి - సామర్థ్యములను సరిగాఁ జూచుకొని శత్రుని మీఁదికి దండెత్తి పోవలయును. ఇంతియగాక తన సైనికు లత్యుత్సాహవంతులై పరిపుష్టులై యుండిరేని యభివృద్ధిని గోరెడిరాజు బలిష్ఠుఁడుగా నున్నశత్రునిమీఁది కైనను బోవచ్చును. యుద్ధమునకుఁ బోరాని శిశిర ర్తువు మొదలైన కాలమునం దైనను బోవచ్చును.

భారతా! అమ్ములపొదులే రాళ్లుగాను, గుఱ్ఱములు, రథములే ప్రవాహములుగాను, ధ్వజములే తీరస్థవృక్షములుగాను, కాల్బంట్లు, ఏనుఁగులే బురదగాను ఒప్పునట్టి సేన యను మహానదిని శత్రునాశనమునకై రాజు ప్రయోగింపవలయును. ఇందులో శక్తికొలఁదిని శకటవ్యూహము, పద్మవ్యూహము, వజ్రవ్యూహము మొదలైన వ్యూహములుగా సేనలను బన్నవలయును. యుధిష్ఠిరా! శుక్రుఁడు చెప్పిన నీతిశాస్త్రమునం దిట్లు చెప్పఁబడియున్నది. ఎట్లన? "రాజు చారులను బంపి ముందు శత్రు బలమును దెలిసికొని, తర్వాతఁ దనబలమును జూచుకొని యావలఁ దనభూభాగములోఁ గాని, లేక శత్రునిభూభాగములో నైనను సరియే యుద్ధ ప్రయత్నములు చేయవలసినది. మఱియుఁ దన బలమును జాల సుప్రసన్నముగాఁ జేసి, బలాఢ్యులైన పురుషులను సేనలలోఁ జేర్పవలసినది. మఱియుఁ దనవిషయమును జక్కఁగాఁ దెలిసికొని, శత్రునివిషయమున

సామాద్యుపాయములు పనికివచ్చునేమో యొక్కటొక్కటిగఁ బ్రయోగించి చూచునది" అని.

మహారాజా! సర్వప్రయత్నములచేతను నీలోకమున శరీర ధారణము చేయవలయును. అట్లు శరీరధారణము చేసినం దుల కిహపరలోకములయందు రెండింటను దనకు శ్రేయస్కరమైన మార్గమును జూచుకొనవలయును. ఇట్లిహపరలోక శుభాపేక్షతో నడుచుకొను రాజు ధర్మముతోఁ బ్రజలను బాలించినచో నిహలోకమున మంచి కీర్తి ప్రతిష్ఠలను, బర లోకమున స్వర్గప్రాప్తిని బొందును. కావున నోకుమారా! నీవును నిహపరలోకములయందు శుభము లొందుటకై ప్రజలయెడ నిట్లు ప్రవర్తింపఁ జనును.

నాయనా! నీ కన్నివిషయములును భీష్ముఁడు తెల్పియున్నాఁడు. శ్రీకృష్ణుఁడును,విదురుఁడును దెల్పియే యున్నారు. అయినను నీయందుఁ గల వాత్సల్యముతో నేనుగూడ నవశ్యము చెప్పవలసి చెప్పితిని. తండ్రీ! యీ చెప్పిన దంతయును నీవు న్యాయాతిక్రమణము గా కుండ నాచరింపుము. ప్రజలకుఁ బ్రియుఁడవై స్వర్గసౌఖ్యము లందఁ గలవు. రాజు, వేయి యశ్వమేధయాగములు చేయనీ, ధర్మప్రకారము ప్రజలను బరిపాలింపనీ రెండింటికిని దుల్యమైన ఫలమునుబొందును.

ఇది యెనిమిదవ యధ్యాయము.

---

— ధృతరాష్ట్రుఁడు వనగమనమునకుఁ బ్రజాసమ్మతిని గోరుట. —

ధర్మరాజు ధృతరాష్ట్రునితో ని ట్లనియె. 'మహారాజా! నీవు చెప్పినట్టు లిది యంతయును జేయుదును. నీ వింకను నన్ను

శాసించి చెప్పఁదగుదువు. భీష్ముఁడు స్వర్గస్థుఁడు కాఁగా, శ్రీ కృష్ణుఁ డవతారము చాలింపఁగా, విదురసంజయులు గతిం పఁగా నిఁక నాకుఁ జెప్పెడివా రెవ రున్నారు ? ఇప్పుడు నీవు నాహితమును గోరి యేది యాజ్ఞాపించితివో యది నేను జేయఁగలవాఁడను ; గనుక నీ వింక నిర్వృతుఁడవు (సుఖము నొందినవాఁడవు) గమ్ము.'

అని యిట్టు లాబుద్ధిశాలి యగు ధర్మరాజు చెప్ప నా రాజర్షి యగు ధృతరాష్ట్రుఁ డాతనియనుమతి వడయఁ గోరి యత నితో 'కుమారా ! నీ విప్పుడు కొంచెము విశ్రమింపుము. నాకును జాల శ్రమముగా నున్నది' యని చెప్పి గాంధారీ భవనమున కరిగెను. అరిగి యటఁ గూర్చున్నతరువాత బ్రహ్మ సమానుఁడగు నాతనితోఁ గాలజ్ఞురాలును, ధర్మచారిణియు నగు గాంధారీదేవి యది హెచ్చరింపఁ దగినసమయ మని యప్పు డిట్లు పలికెను. 'నాథా ! భగవానుఁ డగు వ్యాస మహర్షి తానుగా వచ్చి యనుజ్ఞ యిచ్చిపోయెఁగదా ! ఇఁక నెప్పుడు ధర్మజుని యనుమతి గొని యరణ్యములకుఁ దఱలె దవు ?' అని చెప్ప ధృతరాష్ట్రుఁ డి ట్లనియె. 'దేవీ ! నేను మహాత్ముఁడగు మాతండ్రి వ్యాసభగవానునిచే స్వయముగ ననుజ్ఞాతుఁడ నైతిని. ఇఁక నచిరకాలములోనే ధర్మరాజు ననుమతి గొని యరణ్యములకుఁ దఱలుదును. ఇప్పుడు నేను, మాయజూద మాడిన—పరలోక గతులైన—మన పుత్రుల కందఱకును, రాష్ట్రములోని ప్రజలనురావించి పరలోకప్రాప్తు లకుఁ జెందఁగల ధనమును మనయింటిలో దానము చేయఁ దలఁచు కొన్నాను' అని చెప్పి యావిషయమును ధర్మరాజునకుఁ

దెలియపఱచెను. వెంటనే ధర్మరాజుకూడ నాతనిమాటప్రకారము రాష్ట్రములోనివారి నందఱను బిలిపించెను. వెంటనే కురుజాంగల దేశీయులైన బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును,శూద్రులును మహాసంతోషముతో వచ్చిరి. అనంతరము ధృతరాష్ట్రుఁడంతఃపురమునుండి దిగివచ్చి నానాదేశములనుండి వచ్చి గుమిగూడి యున్న యాజనమును గాంచెను. ప్రకృతిజనులు, పౌరులు, జానపదులు, మిత్రులు, నానాదేశాగత బ్రాహ్మణులు అందఱు వచ్చి యున్నట్లు తెలిసికొని వారలతో నిట్లనియె. 'నాగాదిలిప్రజలారా ! మీరును కురువంశము వారును (మేమును) జిరకాలమునుండి కలసి మెలసి యున్న వారు. మఱియుఁ బరస్పరమైత్రి గలిగి, పరస్పరహితాభిలాషులై యున్నవారు. ఇప్పు డవసరము గలిగి నే నొకమాట చెప్పుచున్నాను. మీరు విచారణ లేకుండ దానిని జేసి తీఱవలయును. ఇప్పుడు నేను గాంధారీసమేతముగా నరణ్యములకుఁ బోఁ దలఁచుకొన్నాఁడను. వ్యాసభగవానుఁ డనుజ్ఞ యిచ్చి యున్నాఁడు: ధర్మరా జనుమతి యిచ్చి యున్నాఁడు. మీరు గూడ ననుమతి యిండు. ఇఁక వేఱే విచారణ మీకుఁ దగదు. మాకును మీకును జిరకాలమునుండి వచ్చుచున్న ప్రీతివంటి ప్రీతిమాత్ర మితరదేశములలో నేరాజులకును లే దని నా యభిప్రాయము. ఇప్పుడు నేను గేవలము వార్ధకములో నున్నాను. కొడుకులు గూడ నందఱు పోయినారు. ఉపవాసములచే నేను మఱీ కృశించి యున్నాను. గాంధారిస్థితియు నిట్టిదిగానే యున్నది. ధర్మరాజురాజ్యములో నింతవఱకు మహాసుఖము నొందితిని. దుర్యోధనుని రాజ్యమునకంటెను ధర్మ

రాజురాజ్యమే యనేకగుణములను బట్టి యుత్త మోత్తమ ముగా నున్న దని తలఁచుచున్నాను. అంధుఁడను, వృద్ధుఁడను. మీఁదు మిక్కిలి హతపుత్త్రుఁడను నగు నాకీ తరుణమున వనమునకంటె నిఁక గతి యేమున్నది? కనుక నో మహాభాగులారా! నా కనుజ్ఞ యియ్యఁదగుదురు.' అని చెప్పెడి యా వృద్ధరాజువాక్యములు విని యా వచ్చినవా రందఱును గన్నీళ్లు వెట్టికొని 'కూడదు కూడదు' అని గద్గదస్వరముతోఁ బలుకుచు నేడువసాగిరి. అట్లు ప్రతికూలముగాఁ బలుకుచు నేడ్చుచున్న వారి నందఱను జూచి ధృతరాష్ట్రుఁడు మరల నిట్లు పలికెను.

ఇది తొమ్మిదవ యధ్యాయము.

---

(ధృతరాష్ట్రుఁడు తన కొడుకులు చేసిన తప్పిదములను మన్నించి తనకు వనగమనమున కనుమతి యిం డని ప్రజలను గోరుట.)

అనఘాత్ములారా! శంతనుమహారాజీ భూమిని ధర్మయుక్తముగాఁ బరిపాలించెను. అట్లే మా తండ్రి యగు విచిత్రవీర్యుఁడును భీష్ముని పరిపాలనక్రింద నుండి దీనిని బాలించెను. ఈ విషయము మీకును దెలియును. ఇందు సంశయము లేదు. మీకుఁ బ్రియుఁడును, నాకుఁ దమ్ముఁడు నగు పాండురాజుగూడ నట్లే ధర్మయుక్తముగఁ బరిపాలించెను. ఇదియు మీ రెఱుఁగుదురు. నేనును మీ సేవచేసితిని. బాగుగనే చేసితినో, యోగుగనే చేసితినో! మేలఁకువ గలిగి మీరు క్షమింపవలయును. మా దుర్యోధనుఁడు నిష్కంటకముగా రాజ్యము చేసినకాల

ములో నప్పు డా దుర్మతి మీయెడ నపరాధము చేసి యుండఁ డని చెప్పఁజాలను. వాని యపరాధమువలన, వాని దురభిమానమువలన, వాని యవినీతిచేష్టలవలన రాజులకు మహాయుద్ధసంఘర్షణము గలిగెను. అందులోఁ గౌరవు లందఱు హతులై పోయిరి. భూమి నాశన మయి పోయెను. నా వలన మంచియో చెడ్డయో యింతవట్టు జరిగిపోయినది. అది మీరు మనసులోఁ బెట్టుకొనవలదు. ఇదే దోసిలి యొగ్గి మిమ్ముఁ బ్రార్థించుచున్నాను. ఇతఁడు వృద్ధుఁ డని, పుత్రుల నందఱను బోఁగొట్టుకొని యున్నాఁ డని, దుఃఖితుఁడై యున్నాఁ డని, పూర్వరాజులవంశములోఁ బుట్టిన పుత్రుఁ డని తలంచి మన్నించి నా కనుజ్ఞ యిండు. ఈ దీనురాలు, హతపుత్ర, తపస్విని, పుత్రశోకార్త యగు గాంధారియు నావలెనే మిమ్ము యాచించుచున్నది. ఈ దంపతులు వృద్ధులు, హతపుత్రులు, దుఃఖితులు నని తలఁచి మన్నించి యనుమతి యిండు. మీకు శుభ మగును. మిమ్ము శరణు సొచ్చుచున్నవారము. ఇదిగో యీ కుంతీనందనుఁడు ధర్మరాజు మంచి చెడ్డలయందు మీ కందఱకును గనుపెట్టి యుండఁ దగినవాఁడు. ఈతఁ డెప్పుడు గానీ దుష్పథమున నడుచువాఁడు గాఁడు. ఈతని నల్వురు తమ్ములును నీతనికి మంత్రులు. వీరు మహాతేజస్సంపన్నులును, సర్వధర్మార్థకుశలులును, లోకపాలురతో సమానులును నగుదురు. నలువురు లోకపాలురనడుమ బ్రహ్మవలె నలువురు తమ్ములనడుమ నీ ధర్మరాజు మిక్కిలి ప్రకాశించుచున్నవాఁడు. ఈతఁడు మిమ్ముఁ జక్కఁగఁ బాలింపఁగలఁడు. అవశ్యముగఁ జెప్పఁదగు ననియే నేను మీ కిట్లు చెప్పుచున్నాను. ఇదిగో

యీ ధర్మరాజును మీ యందఱకును * న్యాసముగా నుంచు చున్నాను. మి మ్మందఱను నీతనికడ న్యాసము చేయుచున్నాను. నా కుమారులుగాని, నావాఁ డితరుఁ డెవఁడే గానీ మీ కేదేని కొంచె మప్రియము చేసియున్నను దానిని మీరు మన్నించి నా కనుజ్ఞ యీఁ దగుదురు. ఇదివఱలో మీరు నా కేవిధము గాను—గోపము గలిగించి యుండ లేదు. అత్యంత గురుభక్తి లగు మీ కిదే నా నమస్కారాంజలి. అనఘులారా! చపల చిత్తులును, లుబ్ధులును, కామచారులు నగు నా కొడుకుల నిమిత్తముగా నేనును, గాంధారియు నిప్పుడు మి మ్మందఱను బ్రార్థించుచున్నారము. అని చెప్పఁగనే యీ పౌరజానపదు లందఱును గన్నీరు వెట్టుచు నేమియుఁ బలుకక యొకరి మొగ మొకరు చూచుకొనసాగిరి.

ఇది పదియవ యధ్యాయము.

---

(ప్రజలు ధృతరాష్ట్రుని వనగమనమున కొక బ్రాహ్మణుని ముఖమునఁ దమ సమ్మతిని వెలువరించుట.)

ఈ ప్రకారము వృద్ధరాజగు ధృతరాష్ట్రుఁడు చెప్ప నప్పౌరజానపదులగు ప్రజ లందఱును నష్టసంజ్ఞులై పోయిరి. అట్లు స్తబ్ధులై బాష్పకంఠులై యున్న వారలను జూచి ధృత రాష్ట్ర మహీపాలుఁడు మరల వారి కిట్లు పలికెను.

---

* న్యాసము = ఇల్లడ. అనఁగా భద్రపఱచి పెట్టి, యడిగినప్పు డిచ్చునట్లుగా నొకరియొద్ద దాఁచ నుంచెడి వస్తువు.

సాధుసత్తములారా! భార్యాసహితముగా వార్ధకావస్థలో నున్నవాఁడను, కన్నకొడుకుల నందఱను బోఁగొట్టుకొని బహువిధములఁ బొక్కి పొక్కి దీనుఁడనై యున్నవాఁడను, తండ్రి యగు వ్యాసభగవానునిచే స్వయముగ వనగమనమున కనుజ్ఞాపింపఁబడినవాఁడను, ధర్మరాజుచే ననుమతి పొందియున్నవాఁడను, ఇట్టి నేను మిమ్ముఁ దల యొగ్గి నమస్కరించి మఱిమఱి ప్రార్థించుచున్నాను. వనగమనమునకు నాకనుమతి యిండు.

అని చెప్ప జాలి పుట్టించు ధృతరాష్ట్రుని దీనవాక్యములు విని యా ప్రజ లందఱును గుంపులు గుంపులుగాఁ గూడి ముఖములకుఁ బైపంచ లడ్డము వేసికొనియుఁ, జేతు లడ్డము పెట్టుకొనియు నంతటను నేడువసాగిరి. వా రట్టు లొక్క ముహూర్తకాలము కన్న తలిదండ్రులవలె శోకసంతప్తులై దుఃఖించి, యిఁకముందు ధృతరాష్ట్రుని నెడఁబాయవలసి వచ్చునే యను నా దుఃఖమును శూన్యహృదయములతో ధరించి, తెలివి దప్పినవారివలె నుండిపోయిరి. ధృతరాష్ట్రవియోగజనిత మైన యా దుఃఖమును గొంతసేపటికి కాఁపుకొని, మెల్లమెల్లగా నొకళ్లొకళ్లు తమతమ భావములను గలియఁబలుకుకొని, యనంతరము తమతమ చెప్పిన వాక్యములను సంగ్రహముగా సమాలోచనము చేసికొని, తమ యందఱ యభిప్రాయమును ధృతరాష్ట్రునకుఁ దెల్పుటకుఁగా నొక బ్రాహ్మణుని నియోగించి యా భారము నాయనపైఁ బెట్టిరి. ఆ బ్రాహ్మణుఁడును—స్వధర్మనిర్వహణ పటిష్ఠుఁడును, సర్వసమ్మతుఁడును, అభిప్రాయమును జక్కఁగ వెల్లడింపఁగల ప్రతిభాశాలియుఁ, బూజ్యుఁ

డును, బెక్కు వేదములు చదివినవాఁడును, మేధాశక్తి గల వాఁడును నగును. ఇట్టి యా బ్రాహ్మణోత్తముఁడు ప్రజల యనుమతి దీసికొని, ధృతరాష్ట్రమహారాజును బూజించి యిట్లు పలికెను.

ధృతరాష్ట్రమహారాజా! ఈ ప్రజ లందఱును దమ తమ చెప్పఁదలఁచిన విషయము నంతయు నాపైఁ బెట్టి యున్నారు. కనుక నేను వారి యభిప్రాయమును నీకు నివేదించెదను. చిత్తగింపవలయు. రాజేంద్రా! నీవు చెప్పిన దంతయు వాస్తవమే. ఇందులో నేమాత్రము నసత్య ముండుటకు వీలు లేదు. ఏలయన? మనకు మనకుఁ బరస్పరము గల సౌహృద మట్టిది. ఈ కురువంశమునం దుద్భవించిన రాజులలోఁ బ్రజాపాలకుఁ డైన రా జెవ్వఁడుగాని, యెప్పుడు గానీ యింత వఱకుఁ బ్రజల కప్రియుఁ డైనవాఁడు లేఁడు. మీరు మమ్ముఁ దలిదండ్రులవలెఁ బరిపాలించుచున్నారు. మహారాజా! దుర్యోధనుఁడు మా కేమియు నప్రియము చేసినవాఁడు గాఁడు. వాఁడు మిక్కిలి యందఱకును బ్రియకార్యములనే చేయుచుఁ, బ్రజాహితమునకే పాటుపడుచుండెను. నీవు ధర్మాత్ముఁ డైన వ్యాసమహాముని యానతిచ్చినట్లు సేయుము. ఆ మహానుభావుఁడు మాకును బరమగురుఁడు గదా! నీవు మమ్ము విడిచి పోయినప్పుడు మేమును నీ వియోగమువలన దుఃఖశోకపరాయణుల మై నీ సద్గుణశతములచేఁ జిరకాల మపహృతుల మగుచు నుండఁగలము. మహారాజా! శంతనుమహారాజు చేతను, చిత్రాంగద మహారాజుచేతను, భీష్ముని నిరీక్షణక్రిందఁ బరిపాలించిన మీ తండ్రిచేతను, నీ బుద్ధి ననుసరించి ప్రవ

_ర్తించిన పాండుమహారాజుచేతను మే మెట్లు రక్షింపఁబడి తిమో, యట్లే మీ దుర్యోధనునిచేతనుగూడఁ జక్కఁగ రక్షింపఁబడితిమి. రాజేంద్రా! నీ కుమారుఁడు మా కేమా త్రము నప్రియము చేసి యుండలేదు. అతనియందుఁ బ్రజలు కన్నతండ్రియందువలె విశ్వాసము గలిగి యుండిరి. మే మెంత సుఖముగా నున్నదియు నీకుఁ దెలియక పోలేదు. ఇఁక ముందును—మే మీ ప్రకారముగనే బుద్ధిశాలియు, ధైర్య వంతుఁడునగు ధర్మరాజుచేఁ బరిపాలితుల మగుచుఁ బెక్కువేల సంవత్సరములు సుఖముగా నుందుము. మహారాజా! ధర్మా త్ముఁడును, గొప్ప దక్షిణలు పెట్టి యజ్ఞము లొనరించిన వాఁడు నగు నీ ధర్మరాజు మీ వంశములోని పూర్వరాజర్షు లైన కురుమహారాజు, సంవరణుఁడు, భరతుఁడు మొదలుగాఁ గల పుణ్యాత్ముల యొక్క ప్రవర్తనము ననుసరించుచున్న వాఁడు. ఈ విషయములోఁ జెప్పఁ దగిన దేకొంచెమేనియు లేదు. నీవు పరిపాలించుచున్న కాలములో నీచేఁ బరిపాలితుల మగుచు సర్వకాలము సుఖముగా నుంటిమి. నీయందుఁగాని, నీ కొడుకులయందుఁగాని రవలేశమైనను నప్రియము లేదు. జ్ఞాతులకుఁ గలిగిన పోరాటము విషయములో దుర్యోధనుఁడేమో కారణభూతుఁడని చెప్పితివి; గాని యా విషయములో నిన్ను మేము మందలింప నున్నారము. కౌరవు లందఱు నాశనమై పోయినా రనఁగా నది దుర్యోధనునిచే నయినది గాదు. నీచేతను నైనది గాదు. కర్ణశకునులచేతను నైనది గాదు. అది దైవసంకల్పముచే జరిగినది. దైవసంకల్పమును దప్పించు కొనుట కెవరికి సాధ్యము? దైవప్రయత్న మెప్పటికిని బురుష

ప్రయత్నముచే బాధితము కాఁజాలదు గదా! మహారాజా! పదునెనిమిది యక్షౌహిణుల సైన్యము కూడినది! యోధవరులైన కౌరవులచేతను, భీష్మ ద్రోణ కృపాదులచేతను, కర్ణ యుయుధాన ధృష్టద్యుమ్నులచేతను, భీమార్జున నకుల సహదేవులచేతను నింత సైన్యము పదునెనిమిది దినములలో యుద్ధమునందు హతాహత మై పోయినది! ఇంతటి మహా ప్రళయము దైవసంకల్పబలముచేఁ గాక మఱొకదానిచే నగునా? రాజోత్తమా! యుత్తమ క్షత్త్రియుఁడు ముఖ్యముగా యుద్ధము చేసి యందులో మరణించుఁగాక. ఎవఁడో క్షత్త్రబంధువు (నామమాత్రుఁడు) కాలను దీటి చచ్చుఁగాక. అట్టి యుత్తమ క్షత్త్రియవీరులును, విద్యా బాహుబలాన్వితులును నగు వారిచే నీ సమస్తభూమండలమును—రథ గజాశ్వసహితముగా నాశనము చేయఁబడినది; కాని యీ రాజసంక్షయమునకు నీ కుమారుఁడు కారణము గాఁడు. నీవును—గావు. నీ భృత్యులును—గారు. కర్ణ శకునులును—గారు. కురుకులోత్తమా! వేలు లక్షలకొలఁదిగా క్షత్త్రియులు హతులై రనఁగా నిది యంతయు దైవకృత మనియే తెలిసికొనుము. ఈ విషయములో నెవఁడు మాత్ర మేమి చెప్పఁగలఁడు?

మహారాజా! నీ వీ ప్రపంచమున కంతటికిని గురుఁడవును, ప్రభుఁడవును. కాన నిన్ను గుఱించి నీ కుమారుని ధర్మాత్మునిగా సమ్మతించుచున్నారము. అతఁడు బ్రాహ్మణోత్తముల యాశీః ప్రభావముచేఁ దనకు సాయము సేయ వచ్చిన వీరులతోఁ గూడ వీరస్వర్గము నొంది యట సుఖపడుచు నానందించు

చుండుఁ గాక. నీవును నిరంతరము ధర్మనిష్ఠుఁడ వై పుణ్యము నార్జింపుము. మహాబాహూ! నీవు లౌకికధర్మమును, వైదిక ధర్మమును రెంటిని దెలిసికొనుము. పురుషశ్రేష్ఠులైన పాండవుల పూర్వవృత్త మంతయు మాకుఁ దెలియును. వారు దేవ లోకము నేనియుఁ బరిపాలింప సమర్థు లగుదురు. ఇఁక నీ భూలోకము మాట చెప్పవలసిన దేమి? శీలమే భూషణముగాఁ గల పాండవులను బ్రజ లందఱును మంచి చెడ్డలయం దనుసరించి యుండఁగలరు. ఈ ధర్మరాజు, పూర్వరాజులు బ్రాహ్మణుల కొసఁగి యున్న యగ్రహారములను, బిరుదములను, దానధర్మములను జక్కఁగఁ బరిపాలించుచున్నవాఁడు. ఈ ధర్మరా జెప్పటికిని మంచి దీర్ఘాలోచనము గలవాఁడు. మృదుస్వభావుఁడు. కుబేరునంతటి మనోనిగ్రహము గలవాఁడు. మంచి గొప్ప మనస్సు గలవాఁడు. తగిన మంత్రులను దగ్గఱ నుంచుకొన్నవాఁడు. పగవారియందును దయఁ దలఁచువాఁడు. పరిశుద్ధాంతఃకరణుఁడు. భరతకులమున కలంకారభూతుఁడు. గొప్ప మేధాశక్తిగలవాఁడు. ఇట్టి యీ ధర్మరాజు మమ్ముఁ గన్న బిడ్డలమాదిరిఁ జూచుచు నెల్లప్పుడును రక్షించుచున్నవాఁడు. రాజర్షీ! యీ ధర్మాత్ముని సాంగత్యవిశేషమున భీమార్జునాదులును ఈ ప్రజల కప్రియము చేసి యెఱుఁగరు. ఆ మహాత్ములు మహాబలాఢ్యులు. వారు మంచివారికి మంచివారుగను, క్రూరులకుఁ ద్రాఁచుఁబాములవంటి వారుగను నుండి ప్రజాహితమునకై యెల్లప్పుడు పాటుపడుచుందురు. కుంతీదేవి గాని, ద్రౌపది గాని, ఉలూపి గాని, సుభద్ర గానీ యీ ప్రజల విషయములో నెప్పుడేని ప్రతికూలము లాచ

రించి యెఱుఁగరు. మహారాజా! ఈ పౌరజానపదు లగు ప్రజలు నీచే నెలకొల్పఁబడి, ధర్మరాజుచే నభివర్ధిత మైన పరస్పరస్నేహమును ద్రోసిపుచ్చువారు గారు. మహారథులైన పాండవులు ధర్మపరాయణులుగా నుండి ప్రజలను, అధర్మిష్ఠులనుగూడఁ దగ్గఱఁ దీసికొని పరిపాలింతురు. కనుక నొక్క ధర్మరాజునుబట్టి నీ మానసమునఁ గల వ్యసనమును దొలఁగించుకొని యిఁక ధర్మ్యము లైన కార్యముల నాచరింపుము. నీ కిదే మా నమస్కారము.'

అని యా బ్రాహ్మణుఁడు పలుక ధర్మాతిరేకములు గాక, గుణవత్తరము లైన యా బ్రాహ్మణుని వచనములను మెచ్చుకొని జను లందఱును 'బాగు బా'గని యంగీకరించిరి. ధృతరాష్ట్రుఁడును నా బ్రాహ్మణుఁడు చెప్పిన వాక్యములను మఱిమఱి గౌరవించి మెలమెల్లగా నా ప్రకృతిజనులను వీడ్కొనెను. వారును ఆ వృద్ధభూపతిని గౌరవించి యాతనిపైఁ జల్లని చూపులను బ్రసరింపఁజేసిరి. ఆరాజును దోసిలిఁ బట్టి వారిని సన్మానించి యనంతరము గాంధారీసమేతముగా నిజభవనమున కరిగి, రాత్రి యగుటయు సుఖముగ నిద్రించెను.

ఇది పదునొకండవ యధ్యాయము.

---

{ధృతరాష్ట్రుఁడు భీష్మాదులకు శ్రాద్ధము లొనరింప ధన మడుగుట. భీముఁడు నిరాకరించుట.}

అనంతరము తెల్లవాఱుటయు ధృతరాష్ట్రమహారాజు యుధిష్ఠిరుని భవనమునకు విదురు నంపెను. బుద్ధిమదగ్రేసరుఁ

డైన విదురుఁడును ధర్మరాజుకడకుఁ బోయి ధృతరాష్ట్రుఁడు చెప్పిన ట్లిట్లు చెప్పెను.

యుధిష్ఠిరమహారాజా! ధృతరాష్ట్రమహారాజు వనవాసము సేయ దీక్షఁ బూని రానున్న యీ కార్తికమాసములో నరణ్యమునకుఁ బోనున్నవాఁడు. కురుకులశ్రేష్ఠా! యిప్పు డాయన నిన్నుఁ గొంచెము ధన మపేక్షించుచున్నాఁడు. ఆయన, పరలోకగతు లైన మహాత్ముఁడగు భీష్మునకును, ద్రోణాచార్యులకును, సోమదత్తునకును, బాహ్లికునకును, దన పుత్రులందఱకును, ఇంకను దనకుఁ గావలసిన మిత్రులకును, నీవు సమ్మతించితివేని యీ నీచసైంధవునకునుగూడ శ్రాద్ధము లొనరింప నిచ్ఛయించుచున్నవాఁడు.

అని చెప్ప విని ధర్మరాజును— అర్జునుఁడును— సంతోషించి యాతఁడు చెప్పినదాని కంగీకరించిరి. దృఢక్రోధుఁడును, మహాతేజస్కుఁడు నైన భీముఁడుమాత్రము దుర్యోధనుఁడు చేసి యున్న యపరాధములను స్మరించుచు విదురుఁడు చెప్పినదాని కంగీకరింపకుండెను. అప్పు డర్జునుఁడు భీమసేనుని యభిప్రాయమును దెలిసికొని కొంచెము నమ్రుఁడై యాతని కిట్లు చెప్పెను.

అన్నయ్యా! భీమసేనా! ధృతరాష్ట్రమహారాజు మనకుఁ దండ్రి. వృద్ధుఁడు. వనవాసమునకు దీక్షితుఁడై యున్నవాఁడు. వనవాసమునకుఁ బోఁబోవుచు భీష్మాదు లగు సమస్త మిత్రులకును శ్రాద్ధకర్మము లాచరింపవలె నని నీవు జయించిన ధనము నర్థించుచున్నాఁడు. మహాబాహూ! అఖండభూమండలము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మహారాజు! లోగడ

మనచే 'దేహి' యని యడిగించుకొనఁబడిన మహారాజు !! దైవ దుర్విపాకముచే నేఁడు నిన్నుఁ జేయిసాఁచి 'దేహి' యని యాచించుచున్నవాఁడు. చూడు, కాలవిపర్యయము ! మీఁదుమిక్కిలి పరులచేఁ బుత్రులను, మంత్రులను బోఁగొట్టుకొని నేఁ డరణ్యముల దారిఁ బట్టినున్నాఁడు. కనుక నీ వాయన గోరిన దిచ్చుటకు సమ్మతింపఁ దగుదువు. పురుషవ్యాఘ్రా ! నీ విప్పు డాయన కోరిన దిచ్చుటకంటె మఱియొక విషయమును దలఁపోయరాదు. ఇది మానుకొని మఱియొకటి చేసితివా ? తప్పక యపకీర్తి వచ్చును. అట్లు చేయుట యధర్మముగూడ. అన్న యున్నాఁడు, పెద్దవాఁడు ! ప్రభువు ! ఆయన ననుసరించి వర్తింపుము. భరతర్షభా ! నీ వైనను ధృతరాష్ట్రున కియ్యఁ దగుదువు గాని కూడ దని నిరాకరింపరాదు.

అని చెప్ప ధర్మరాజుగూడ నర్జునుఁడు చెప్పినది లెస్స యని గారవించెను. భీమసేనుఁడో ! సక్రోధముగా నర్జునునితో నిట్లనియె. 'ఫల్గునా! భీష్మ ద్రోణ భూరిశ్రవ స్సోమదత్త బాహ్లీక ప్రభృతి మిత్రవర్గమునకుఁ జేయవలసిన శ్రాద్ధములు మనము సేయుదము. కర్ణునకు మన యమ్మ కుంతీదేవి చేయఁగలదు. ధృతరాష్ట్రుఁ డేల చేయ వలెను ? అతఁడు చేయనే చేయరా దని నా యభిప్రాయము. ఓయీ ! మీ శత్రువులు దుర్యోధనాదులు సంతోషపడుచుండరాదు. వారు కష్టములలోను—మహాకష్టము లనుభవింపనీ. ఆ కులనాశకులీభూమి నంతయు నాశనము చేసివేసిరి. అర్జునా ! నీ విప్పు డెట్లు మఱచితివి ? పంద్రెం డేండ్లు నడిచిన పగయే ! అజ్ఞాతవాసక్లేశ మనుభవించితివే ! ద్రౌపదికిఁ జేసిన పరాభవ

మెంత ? అప్పుడే మఱపు వచ్చినదా ? పార్థా ! ఆనాఁడు నీవు—ఆభరణము లన్ని యొలిచి, కృష్ణాజినములు ధరించి, ద్రౌపదితో ధర్మరాజువెంట నరణ్యములకుఁ దరలునపు డీ ధృతరాష్ట్రునకు నేఁడు మనయెడఁ గల స్నేహ మెక్కడఁ బోయినది ? అప్పు డా భీష్మ ద్రోణు లెక్కడ నుండిరి ? సోమ దత్తుఁ డెక్కడ? పండ్రెండు సంవత్సరములు కాఱడవులలోఁ గందమూలములు దినుచుఁ గన్నకష్టము పడి కాలక్షేపము చేసిన యాకాలములో నీ పెత్తండ్రి, తాను దండ్రి యను భావముతో ని న్నేమైనఁ జూచెనా ? అర్జునా ! అప్పుడే యది యంత మఱచిపోయితివా ? ఈ కులపాంసనుఁడు, ఈ దుర్బుద్ధి (ధృతరాష్ట్రుఁడు) 'జూదములో జయింపఁబడిన దేది ?' యని తా నప్పుడు విదురు నడిగి యున్నాఁడు.

అని తీవ్రముగాఁ బలుకుచుండ బుద్ధిమంతుఁ డగు ధర్మరా 'జూరకుండు' మని భీమసేనుని గద్దించుచుఁ బలికెను.

ఇది పండ్రెండవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము.

{ ధర్మరాజు ధృతరాష్ట్రునకుఁ దనకోశమునుండి ధనము దీసికొని శ్రాద్ధము లొనరించు నట్లు విదురునితోఁ జెప్పి పంపుట. }

అర్జునుఁడు భీమసేనునితో ని ట్లనియె. 'భీమసేనా ! నీవు నాకంటెఁ బెద్దవాఁడవు, కావున గురుఁడవు; కాఁబట్టి నే నింత కంటె నేమియుఁ జెప్పఁ జాలను. రాజర్షి యైన ధృతరాష్ట్రుఁ డెల్లవిధములచేతను బూజార్హుఁ డగును. అన్నయా ! లోక

ములో నసంభిన్నార్యమర్యాదులును, సాధువులు నగు నుత్తమపురుషు లొకరు చేసిన యపరాధములను దలపోయరు. ఒకరు చేసిన సుకృతములనుగూడఁ దలపోయరు సుమా !'

అని చెప్ప నర్జునుని మాటలు విని ధర్మరాజు విదురునితో నిట్లనియె. 'ఆర్యా! నా మాటగా ధృతరాష్ట్రమహారాజున కిట్లు చెప్పుము. తన పుత్రులకును, దన కుపకారము చేసిన మిత్రులగు భీష్మాదులకును నందఱకును దా నేమి యియ్యఁ దలఁచుకొనియున్నాఁడో యది యంతయు నేను నా సొంతకోశము (ధనాగారము) నుండి యిచ్చుచున్నాను. భీముఁడు మనసు నొచ్చుకొనఁ బని లేదు.' అని చెప్పి ధర్మరా జర్జునుని గౌరవించెను. అంత భీముఁ డర్జునునివంకఁ గడకంటిచూపుతోఁ జూచెను. పిమ్మట ధర్మరాజు విదురునితో నిట్లనియె.

విదురా! ఆ రాజు భీమసేనునిపైఁ గోపము సేయరాదు. భీమసేనుఁ డరణ్యములలోఁ గడు నిడుమలువడినవాఁడు చలికి, వానకు, నెండకుఁ జిక్కి మిక్కిలి క్లేశపడినవాఁడు. నీకుఁగూడ నీ విషయము తెలియనిది గాదుగదా ! ఇఁక నీ వా రాజునకు నా మాటగా నిట్లు చెప్పుము. 'రాజేంద్రా! యేదేది, యెంతెంత కావలయు నని నీవు కోరుదువో యది యంతయు నా భవనమునుండి గ్రహింపఁబడుఁగాక.' అని చెప్పుము. మఱియు నీ భీముఁడు మిక్కిలి దుఃఖితుఁడై యుండి యేదియో మచ్చరము చేయుచున్నవాఁడు. అది మనసులోఁ బెట్టుకొనవల దని చెప్పుము. మా యింట నెంత ధన మున్నదో,యర్జును నింట నెంత ధన మున్నదో దాని కంతకును ఆ మహారాజే యధికారి యని చెప్పుము. ఆ మహారాజు తన యిష్టము వచ్చి

నట్లు బ్రాహ్మణుల కీయనీ. యథేచ్ఛముగా వ్యయము సేయనీ. పుత్రులకును, మిత్రులకును ఇప్పుడు ఋణము తీర్చుకొననీ. విదురా! నా ధనములే గాక నా శరీరముగూడఁ దన యధీనమే యని చెప్పుము. ఇందులో నేమాత్రమును సందేహము లేదని చెప్పుము.

ఇది పదుమూఁడవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము.

—విదురుఁడు ధృతరాష్ట్రునకు ధర్మజార్జునుల సమ్మతి నెఱిఁగించుట.—

అని ధర్మరాజు చెప్పి పంపఁగా విదురుఁడు ధృతరాష్ట్రుని కడకుఁ బోయి మహార్థవంతముగ నిట్లు చెప్పెను. 'మహారాజా! నీవు చెప్పిన మాటలను సంపూర్ణముగా ధర్మరాజునకుఁ జెప్పితిని. ఆతఁడు విని నీ చెప్పినది బాగున్న దని ప్రశంసించెను. అర్జునుఁడు తన గృహములను, దన సర్వస్వమును, జివరకుఁ దన ప్రాణములనుగూడ నీకు నివేదించుచున్నాఁడు. ధర్మరాజును—తన రాజ్యమును, తన ధనములను, తన ప్రాణములను, తన సోదరులను నీకు నివేదించుచున్నాఁడు. ఇంకను—నీ కేది కావలసినను నది యంతయు నిచ్చుటకు సిద్ధపడుచున్నాఁడు. భీముఁడుమాత్రము తా ననుభవించి యున్న దుర్భరదుఃఖముల నన్నిటిని స్మరించుకొని, నిట్టూర్పులు విడుచుచు నతికష్టముమీఁదనువలె ననుమతి యిచ్చెను. మహారాజా! ధర్మశీలుఁ డగు ధర్మరాజును—అర్జునుఁడును—భీముని జాల ననునయించి యీ మాత్రమేని యాతఁడు మనస్కరించుటకుఁ దీసికొని వచ్చిరి. భీముని విషయములో నీవు

కోపము సేయ రా దని ధర్మరాజు నీతోఁ జెప్పు మనియెను. భీముఁ డిదివఱలో మీరు చేసిన వైరమును దలంచుకొని యిపు డీ యన్యాయము నాచరించెను. నరనాథా! లోకములో క్షత్త్రియ ధర్మ మన నిట్టిదియే గదా! ఇది గాక యీ వృకోదరునకు శుద్ధక్షత్త్రియ ధర్మమునందు మిక్కిలి ప్రీతిగూడ. కాఁబట్టి మహారాజా! భీముని నిమిత్తముగా నేనును, మా యర్జునుఁడును మఱీమఱి ప్రార్థించుచున్నారము. నీవు ప్రసన్నుఁడ వగుము. ఇక్కడ మా సర్వస్వమునకును నీవ ప్రభుఁడవు. నీ వేమి యీఁ దలఁచితివో యది యంతయు నిమ్ము. నీవు మా రాజ్యమునకును, మా ప్రాణములకును బ్రభుఁడవు. అని చెప్పిరి. మఱియు మహారాజు పుత్త్రులకు శ్రాద్ధకర్మము లాచరించునట్లు చెప్పుము. బ్రాహ్మణాగ్రహారములను, తర్నములను, గోవులను, దాసదాసీజనులను, గొఱ్ఱెలను, మేఁకలను, ఈనావలన నేమి కావలయునో వాని నన్నిటిని బ్రాహ్మణులకుఁ బూజచేసి యిమ్మనుము. అని చెప్పి మఱియు నాతో ‘విదురా! నీవు మహారాజుగారి యాజ్ఞ దీసికొని యక్కడక్కడ బీదలకు, గ్రుడ్డివాండ్రకు, దీనులకు బహువిధాన్నపానములతో నొప్పు సత్త్రముల నేర్పాటు గావింపు మనియు, ఆవులకుఁ బానశాలల నిర్మింపు మనియు—ఇంకను నానావిధములైన పుణ్యకార్యముల కేర్పాటు గావింపుమనియుఁ—జెప్పిరి. ధర్మరాజు—అర్జునుఁడు—ఈ విధముగాఁ జెప్పియున్నారు. ఇఁక ననంతరకర్తవ్య మేమో యది నీవు సెలవీయఁదగుదువు.

అని విదురుఁడు చెప్ప ధృతరాష్ట్రమహారాజు వారల నభినందించి కార్తికపూర్ణిమనాఁడు మహాదానము లొనరింపవలె నని నిశ్చయించుకొనెను.

ఇది పదునాలవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము.

### ధృతరాష్ట్రుఁడు భీష్మాదుల నుద్దేశించి బ్రాహ్మణ సంతర్పణాదు లొనరించుట.

విదురుఁడు వచ్చి చెప్పినతరువాత ధృతరాష్ట్రమహారాజు, ధర్మరాజును—అర్జునుఁడును— సమ్మతించి తమసర్వస్వమును నివేదించినందులకు మిక్కిలి సంతసించెను. అనంతరము భీష్మునకును, దన పుత్త్రులకును, దన మిత్త్రులకును శ్రాద్ధములు చేయఁ దలంచి చక్కఁగాఁ జదువుకొన్నవారినిగాఁ జూచి వేలకొలఁది బ్రాహ్మణులను, ఋ శ్వరులను రావించి, అన్న పానములను, యానములను, వస్త్రములను, సువర్ణములను, మణులను, జాతీయరత్నములను, దాసదాసీపరిజనమును, రత్నకంబళములను, గ్రామములను, భూములను, ధనమును, సాలంకృతము లైన గజములను, అశ్వములను, కన్యకలను, ఉత్తమస్త్రీలను 'ఇది యిది' యని వేర్వేఱ నిర్దేశించి నిర్దేశించి సర్వులకు నొసంగెను. ద్రోణుని పేరు చెప్పి, భీష్ముని పేరు చెప్పి, సోమదత్తుని పేరు చెప్పి, బాహ్లికుని పేరు చెప్పి, దుర్యోధనుని పేరు చెప్పి, తక్కంగల పుత్రులయందఱ పేరులను వేర్వేఱుగాఁ జెప్పి, సైంధవుఁడు మొదలుగాఁ గలవారి పేరులను జెప్పి, తన మిత్త్రు లందఱపేరులను జెప్పి శ్రాద్ధము

లొనరించెను. ధృతరాష్ట్రమహారా జొనరించిన యాశ్రాద్ధ యజ్ఞము ధర్మజుని యనుమత ప్రకారము బహు గో ధన భూరి దక్షిణలతోను, అనేక రత్న రాసులతోను మహావైభవముగాఁ బ్రవర్తిల్లెను. ఆ శ్రాద్ధయజ్ఞమునందు లెక్కలు వ్రాయుగణ కులు, లేఖలువ్రాయు లేఖకులు యుధిష్ఠిరుని యాజ్ఞా ప్రకారము ధృతరాష్ట్రమహారాజుసన్నిధిలో నుండి 'వీరి కేమి యీఁదగునో సెల'విమ్మని యాయన నడుగుచు, నాయన చెప్పఁగనే యక్కడ సంసిద్ధముగా నుంపఁబడి యున్న దానినే యొసఁగుచుండిరి. వారు నూ టియఁ దగినచోట వేయియును, వేయి యీఁ దగిన చోటఁ బదివేలును గా నిట్లుదారాశయుఁ డగు ధర్మరాజు నభిమత ప్రకారమిచ్చుచుండిరి. ఈ ప్రకారముగా ధృతరాష్ట్రుఁ డను మహామేఘము ధనధారలచే వర్షించి బ్రాహ్మణు లనెడి సస్యములను మిక్కిలి తృప్తి పఱచెను తదనంతరమే యారాజు మృష్టాన్నప్రదానముచే ముక్కుమునుఁగ సర్వవర్ణముల వారిని ముంచి వేసెను. వస్త్రములు, ధనములు ననెడి రత్న రాసులును, మృదంగ ధ్వను లనెడి ఘోషమును, గోవు లనెడి మొసళ్లును, అశ్వము లనెడి నుళ్లును, గ్రామములు- అగ్రహా రములు ననెడి ద్వీపములును, మణులు-బంగారములు ననెడి తెప్పకొయ్యలును గలిగి నానావిధరత్నములకు నాకరమైన ధృతరాష్ట్రుఁ డనెడి మహాసముద్రము ప్రపంచము నంతయు ముంచి వేసెను.

ఈ ప్రకారముగా ధృతరాష్ట్రుఁడు తనపితరులకును, పుత్త్రులకును, పౌత్త్రులకును, దనకును, గాంధారికిని బరలోక సుఖావహము లైన దానధర్మము లాచరించెను. అనేకములు

గోదానము లొసఁగుటలో నాతఁ డెంతవఱ కాయాసితుఁ డయ్యెనో యంతవఱకు నిచ్చి యనంతర మా దానయజ్ఞమును బరిసమాప్తి చేసెను. ఈ ప్రకారముగా నా ధృతరాష్ట్రమహారాజు నటకుల నాట్యములతోను, నర్తకుల నర్తనములతోను, బహువిధాన్నపానములతోను, సంపూర్ణ దక్షిణలతోను దాన క్రతువును నిర్వర్తించెను. ఈ విధముగాఁ బదిదినము లారాజు దానము లొసఁగి పుత్త్ర పౌత్త్రులవలని ఋణమును దీర్చుకొన్నవాఁ డయ్యెను.

ఇది పదునేనవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము.

### ధృతరాష్ట్రుఁడు వనవాసమునకు బయలుదేఱుట.

మఱునాఁడు ప్రాతఃకాలమున ధృతరాష్ట్రమహారాజు వనవాసము వొంవ నాసక్తి పడి పాండవులను రావించి గాంధారియుఁ, దానును వారలను విధ్యుక్తప్రకార మాశీర్వదించెను. కార్తికపూర్ణిమనాఁడు వేదపారగు లయిన బ్రాహ్మణోత్తములచే ఉదవసనీయ మనునిష్టి చేయించి, నారబట్టలు, కృష్ణాజినములు ధరించి, యగ్నిహోత్రములను ముం దుంచుకొని యంతఃపురస్త్రీపరివృతుఁ డై నిజభవనమునుండి బయలు దేఱెను. ఆ మహారాజు బయలుదేఱఁగనే కౌరవ పాండవ స్త్రీలును, కౌరవ వంశోద్భవ లైన యితరస్త్రీలును 'ఇప్పుడే ప్రయాణమా?' యని ప్రార్థింప సాగిరి. అట్లు ప్రార్థించుచున్న వారికంఠధ్వని గొప్పగా వినఁబడెను. అనంతరము ధృతరాష్ట్రమహారాజు పేలాలతోను, పుష్పములతోను దనభవన



57. పాండవులు ధృతరాష్ట్రాదులతోడ వనముల కేఁగుచున్న తల్లిని వారింపఁజూచి నిష్ఫల మనోరథు లగుట.

BY COURTESY OF KARNATAKA DEPOT, MADRAS.

మునకుఁ బూజ చేసి, యశ్వములను రథమునకుఁ బూన్పించి, సమస్త భృత్యవర్గమును వదలిపెట్టి ప్రయాణ మయ్యెను.

అంతట ధర్మరాజు దోసిలి యొగ్గి వణఁకుచు, బాష్ప కంఠుఁడై 'మహారాజా! సాధూ! నాయనా! యెక్కడికిఁ బోయెదవు?' అని పెద్దపెట్టునఁ బలికి భూమిపైఁ బడిపోయెను. అర్జునుఁడును నట్లే తీవ్రదుఃఖాభితప్తుఁడై మాటిమాటికి నిట్టూర్పులు వుచ్చుకొనుచు 'అన్నయ్యా! యిట్లు కూడదు' అని ధర్మరాజు నోదార్చి లేవఁ దీసి పట్టుకొని మిక్కిలి దీనుఁడై యుండెను. భీమార్జున నకుల సహదేవులును, విదుర సంజయ యుయుత్సులును, కృపాచార్య ధౌమ్యాచార్యులును, దక్కంగల బ్రాహ్మణులును— అందఱు— బాష్ప కంఠులై యారాజువెంట నడిచిరి. గాంధారీదేవి కన్నులకు బట్ట గట్టుకొని, కుంతీదేవిభుజముపైఁ జేయి వైచి నడుచుచుండెను. కుంతీదేవి యామెను బట్టుకొని నడిపించుకొని పోయెను ధృతరాష్ట్రమహారాజు గాంధారిభుజముపైఁ జేయి వైచి మహా సంతోషముతో నడచెను. ద్రౌపదియు, సుభద్రయు, సన్న పిల్లతల్లి యగు నుత్తరయు, చిత్రాంగదయుఁ, దక్కం గల యితరస్త్రీలును ధృతరాష్ట్రమహారాజుకోడండ్రతోఁ గలసి యేడ్చుచు నారాజువెంట బయలుదేఱిరి. ఆయేడ్చుచున్న స్త్రీలరోదనధ్వని దుఃఖాతిరేకమున నేడ్చు లకుముకిపక్షుల రోదనధ్వనివలె నతిశయించి బయలుదేఱెను. పట్టణములో నలుప్రక్కలనుండి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య స్త్రీలందఱును ధృతరాష్ట్రమహారాజు వనవాసము వెళ్లుచున్నాఁడని గుంపులు గుంపులు గూడిరి. ఆహస్తినాపట్టణములోని ప్రజ లంద

అను దుఃఖాక్రాంతులై పోయిరి. వెనుకఁ బాండవులు కౌరవ సభలో జూద మాడి యోడి యరణ్యములకుఁ బోవునపు డెట్లుండెనో యిపు డట్లుండెను. సూర్యచంద్రులుగూడఁ జూచి యెఱుఁగని రాణివాసస్త్రీలుగూడఁ గొందఱు ధృతరాష్ట్రమహారాజు వనవాసము వెళ్లుచున్నవాఁ డనఁగానే శోకార్తలై రాజమార్గములోనికి వచ్చిరి.

ఇది పదునాఱవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము.

{గాంధారీ ధృతరాష్ట్రులతోఁడఁ గుంతీదేవి వనవాసమునకు బయలుదేఱుట.}

అనంతరము మిద్దెలమీఁదను, మేడలమీఁదను—నేలమీఁదను—స్త్రీలు—పురుషులు—అందఱు దుఃఖాక్రాంతులై క్రిక్కిఱిసియుండిరి. ఆ కూడిన జనసంఘముయొక్క కలకలధ్వని యపరిమితముగా బయలుదేఱెను. ధృతరాష్ట్రమహారాజట్లు జనసంకులమైన రాజమార్గమునఁ గంపితగాత్రుఁడగుచు, దోసిలి పట్టుకొని యతికష్టముమీఁద మెల్లగా నడిచి పోవుచుండెను. అట్లామహారాజు రాజమార్గము గడచి వర్ధమాన మను ద్వారముగుండ హస్తినాపురము దాఁటి, తన్ను సాగనంప వచ్చిన జనసంఘమును బలుమాఱు 'నిలునిలుఁ' డని చెప్పుచు వీడ్కొనెను. ధృతరాష్ట్రమహారాజుతోఁగూడ విదురుఁడును, సంజయుఁడును వనగమనము సేయ నుద్యుక్తులైరి. ధృతరాష్ట్రమహీపాలుఁడు కృపాచార్యులను నిలు మని చెప్పి, యుయుత్సునిని ధర్మరాజున కొప్పగించి వారిని వదలి

వేసెను. పురజను లందఱును నిలిచినతరువాత ధర్మరాజుతో నిఁక నిలు మని చెప్పెను. అంత ధర్మరా జంతఃపురజనముతోడ నిలువఁ దలఁచి, గాంధారిని బట్టుకొని పోవుచున్న తన తల్లి దగ్గఱకుఁ బోయి యిట్లు చెప్పెను. 'అమ్మా! యిఁక నీవు నిలువుము. నే నీ మహారాజును సాగనంపి వచ్చెదను. నీవు నీ కోడండ్రను దీసికొని నగరమునకుఁ బద. ఈ మహారాజు తపస్సు చేసికొన నిశ్చయించుకొన్నవాఁడు.' అని చెప్పఁగాఁ గన్నీళ్లు గ్రుక్కుకొనుచుఁ గుంతీదేవి గాంధారిని బట్టుకొని వెళ్లుచునే యుండెను. వెళ్లుచు నాయమ యిట్లు చెప్పెను.

నాయనా! ధర్మరాజా! పిన్నవాఁడు సహదేవుఁడున్నాఁడు. వానిపై నెప్పుడుగానీ—గసరుకొనకుము. వాఁడు నాతోడను, నీతోడను జనవు గలిగి యుండును. కుమారా! రణశూరుఁడైన కర్ణుని నెపుడేని మఱచి పోకుము. ఆ వీరుఁడు దుర్బుద్ధినగు నాచే నలనాఁడు దూరము చేయఁబడెను! నాయనా! మూర్ఖురాల నగు నా హృదయము నిజముగా నుక్కుపిండము. ఏల యన? కర్ణునిని గన్నులఁ గాంచనపుడు నూఱు వ్రయ్యలుగా వ్రీల కున్నదే! ఇట్లు, జరుగ వలసినదంత జరిగి పోయినది. ఇట్లు జరిగి పోఁగా నే నేమి చేయఁగల్గుదును? ఇంతకును నా చేసినదోషమే గొప్పది. దానిని గర్ణుఁడు బయలుపుచ్చ కుండెను. నాయనా! ఆతని నిమిత్తమై నీవు త్తమ దానములు సేయుము. నీవును—నీ తమ్ములును గర్ణుని మఱవక, ద్రౌపదికిఁ బ్రియము గలిగించుచు నుండుఁడు. కుమారా! నీవు భీమార్జున నకులులను సమాధానపఱచు చుండవలయు ను. కులభార మంతయు నీయందుఁ బడినది. నే నరణ్యములోఁ

పెద్దవా రగు న త్తమామలవంటి యీ గాంధారీ ధృతరాష్ట్రుల పాదసేవ చేసికొనుచు నిర్మలచి త్తముతోఁ దపస్సు చేసికొను చుందును.

అని చెప్పఁగా ధర్మరాజు తమ్ములతోఁగూడ దుఃఖాక్రాంత చిత్తుఁడై యేమియును బలుకఁ జాల కూరకుండెను. అట్లొక ముహూ ర్తకాలము విచారముతో నుండి చింతా-శోకములు చి త్తమును గలంపఁ దల్లితో నిట్లనియె. 'అమ్మా ! యేమి నీ యీ వ్యవసాయము ? నీ విట్లు చెప్పఁ దగవు. నీ ప్రయాణ మునకు నే ననుమతింపను. నీ వనుగ్రహింపవలె. ఇదివఱలో నీవు, విదుల తన పుత్రునికిఁ జెప్పిన పౌరుషవాక్యములు చెప్పి మ మ్మెంతయో యుత్సాహపఱచితివి. ఇట్టి నీ విప్పుడు మమ్ము విడిచిపెట్టి పోఁదగుదువా ! నీ ప్రజ్ఞాబలము నూఁతఁ జేసికొని, వాసుదేవుని సాయమున శత్రువులను బరిమార్చి, యీ రాజ్య మును సాధించితిని. అప్పటి నీ బుద్ధి యిపు డెక్కడఁ బోయి నది ? అప్పు డేదో మాకుఁ బ్రోత్సాహము గలిగించితివే ! నీ మాటలు విని, క్షత్రియధర్మమున నిలిచియున్న నన్ను విడిచి పెట్టి పోఁదగుదువా ? ఓయశస్వినీ ! మమ్మును—నీ కోడం డ్రను—నీ రాజ్యమును—వదలిపెట్టి దుర్గమారణ్యములయం దె ట్లుండఁగలవు ? అమ్మా ! యీ సమయమున నాపై నను గ్రహ ముంచుము.'

అని కన్నీళ్లు గ్రుక్కుకొనుచుఁ బలుకుచున్న కుమారుని దీనవాక్యములు వినుచుఁ గన్నీళ్లు జొటజొటఁ గాఱుచుండఁ గుంతీదేవి తన దారిని దాను వెళ్లుచునే యుండెను. అప్పుడు భీముఁ డి ట్లనియె.

'అమ్మా! కొడుకులు జయించిన సామ్రాజ్య మనుభవింపవలసిన దై యుండఁగాను—క్షాత్రధర్మము లవలంబింప వలసినవి యై యుండఁగాను—నీకీబుద్ధి యెక్కడనుండి పుట్టినది? నీవు మాచే నప్పు డే మని పృథివీక్షయముఁ జేయించితివి? ఇప్పు డే కారణమున నిది యంతయు వదలుకొని యరణ్యములకుఁ బోఁ దలఁచితివి? అరణ్యములకే పోఁదలఁచి యున్నచో నానాఁడు బాలురముగా నున్న మ మ్మేల యరణ్యములనుండి తెచ్చితివి? ఇదిగో! యీ నకుల సహదేవు లెంత దుఃఖాక్రాంతు లై యున్నారో! చూడు. అమ్మా! ప్రసన్నురాలవు గమ్ము. ఇప్పట్ల నీవు వనమునకుఁ బోవలదు. అర్జునుని బలముచే జయింపఁబడి, ధర్మరాజుచేఁ బాలింపఁబడుచున్న రాజ్యలక్ష్మి ననుభవింపుము.' అని చెప్పెను

వీ రిన్ని చెప్పుచున్నను నాయమమాత్రము సర్వప్రయత్నములు మానుకొని వనవాసము సేయ నాసక్త యై యున్నది గానఁ దత్ప్రయత్నమును మానక, వా రెంత విలపించుచున్నను వారి మాటలను వినక, పోవుచునే యుండెను. అప్పుడు ద్రౌపది విషణ్ణవదన యై సుభద్రతోఁగూడి, దుఃఖించుచు, వనవాసమునకే ప్రయత్నపడి పోవుచున్న యత్తను వెంబడించెను. కుంతీదేవి విలపించుచున్న కొడుకులవంకఁ దిరిగి తిరిగి చూచుచు వనవాసాసక్త యై తనదారిని దాను బోవుచుండెను. ఇట్లాయమ పోవుచుండఁగా ధర్మరాజాదులు భృత్యులతోడను, అంతఃపురజనముతోడను—ఆయమను

వెంబడించి పోయిరి. అంతట నాయమ కన్నీళ్లు దుడుచు కొనుచుఁ గుమారులను జూచి యిట్లు చెప్పెను.

ఇది పదునేడవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము.

**పూర్వ ముద్ధరించి, యిపు డేల విడిచిపోవు చున్నా వనిన కుమారులకుఁ గుంతి, తా నెందుల కుద్ధరించినదియుఁ జెప్పుట.**

కుంతి :—(ధర్మరాజు నుద్దేశించి) కుమారా! నీవు చెప్పినది వాస్తవమే. పూర్వము నే నెందుల కుద్ధరించితి ననఁగా మీ రందఱు దుఃఖితులై దుఃఖసముద్రములో మునిఁగిపోవుచుండఁగా నపుడు మిమ్ము నేనుద్ధరించితిని. మీరు జూదములో రాజ్యమును గోలుపోయి, జ్ఞాతులచే నవమానితులై సుఖము నుండిగూడ భ్రష్టులై యుండఁగా మిమ్ము నేనుద్ధరించితిని. పాండురాజుసంతతి యేవిధముగా నశింపకుండునా? యనియు, ఏ విధముగా మీయశస్సునకు భంగపాటు రాకుండునా? యనియుఁ దలంచి యుద్ధరించితిని. దేవేంద్రునితోఁ దులదూఁగువారు, దేవతుల్యపరాక్రములు నగు మీరు (మీ బ్రతుకుదెరువు గోరి) ఒరుల మొగము చూడ కుందురుగాక యని నే నాపని చేసితిని. కుమారా! ధర్మిష్ఠులలో నగ్రగణ్యుఁడవు, మహేంద్రసమానుఁడవు, రాజవు నగు నీవు—ఎట్లు మరల నరణ్యములపాలై దుఃఖముల నొందకుందువా? యని యుద్ధరించితిని. పదివేల యేనుఁగుల దేహదార్ఢ్యము గలవాఁడు, ప్రఖ్యాతపరాక్రముఁడు, పౌరుషశాలియు నగు భీమ

సేనుఁడు నాశము నొందరా దని యుద్ధరణము చేసితిని. భీమ సేనుని తరువాతివాఁడు, ఇంద్రసమానుఁడు—ఈ యర్జునుఁ డంత మొందకుండుఁ గాక యని యుద్ధరణ మొనర్చితిని. గురువులయెడ నమ్రభావముతో మెలంగు నీ నకుల సహదేవు లాఁకటిబాధతో నెట్లు నశింపకుందురా ? యని యుద్ధరణ మొనర్చితిని. ఈ యుత్తమాంగన, ఈ యెల ప్రాయపు ముద్దరాలు, ఈ విశాలాక్షి, ద్రౌపది—కౌరవసభలో గాసిపడిన యిల్లాలు—వృథాగాఁ జచ్చిపోవునే యని యాపని చేసితిని. (భీము నుద్దేశించి) భీమసేనా ! మీరు జూదములో నోడినా రన్న కారణమున నా దుశ్శాసనహతకుఁడు, అంటువడి మలినాంగియైయున్న దానిని, జేడఁబట్టియీడ్వ వచ్చినపు డరఁటిచెట్టువలె గడగడ వణఁకుచున్న దానిని మీ యిల్లాలిని మీ రందఱు చూచుచుండఁగనే మీ యెదుట దాసినివలె మొఱకుఁదనముతో నెప్పుడు లాగివేసెనో, యప్పుడే మన యీ వంశము పరాభూత మైన దని నేఁ దలఁచితిని. అప్పుడు మామగారు మొదలైన కౌరవు లక్కడనే కూర్చుండి యుండిరి. అప్పుడీ ద్రౌపది దైవమే తన్ను రక్షించునాథుఁ డని దైవమును బ్రార్థించుచు, కురరివలె (లకుముకిపక్షివలె) గోడాడిపోయెను. ఆ దుర్మతి, ఆ పాపాత్ముఁడు, ఆ దుశ్శాసనహతకుఁడెప్పు డీయిల్లాలిని గొప్ప పట్టి యీడ్చెనో యప్పుడే నాకు స్మృతి దప్పెను. నాయనలారా ! యి వన్నియుఁ దలఁచుకొని, యీనాఁడు, విదుల తన పుత్రునికిఁ జెప్పిన వాక్యములతో మీకుఁ దేజోవృద్ధి గలుగవలె నని యట్లుచెప్పి మి ముద్ధరించితి నని తెలిసికొనుఁడు. మఱియు—ఈ రాజవంశము నా కుమారులతోనే

యె ట్లింత యొందకుండునా ? యని మి మ్ముద్ధరించితిని. ఏ పురుషునితో (పాండురాజుతో నని భావము.) వంశము నిలిచిపోవుచున్నదో వంశనాశకుఁ డైన యా పురుషుని కొడుకులుగాని, మనుమలుగాని పుణ్యలోకములను బొందఁజాలరు.

నాయనలారా ! నాకు రాజ్యభోగము లనుభవింపవలసిన కోరికలేదు. మీ తండ్రి రాజ్యము సేయుచుండఁగా నేనపుడు విస్తారము లైన రాజ్యభోగము లనుభవించితిని. పెక్కు మహా దానము లొసఁగితిని. యథావిధిగ నీశ్వర ప్రీతి గావించితిని. నేను, నా కేదో ఫలము కావలె నని నా నిమిత్తముగా విదుల చెప్పిన పౌరుషోక్తులతో శ్రీ కృష్ణునిఁ బ్రేరేపించినదానను గాను. మీ రక్షణార్థమే యాపని చేసితిని. నాయనలారా ! కొడుకులు జయించి సంపాదించిన సామ్రాజ్యమును నే నపేక్షించుట లేదు. తపస్సు చేసికొని పుణ్యతమము లైన పతిలోకములను గాంక్షించుచున్నదానను. వనవాసు లైన యత్త మామలకు (గాంధారీ ధృతరాష్ట్రులకు) శుశ్రూషలు చేసికొనుచుఁ, దపోనిష్ఠ చే శరీరమును శోషింపఁ జేసికొనెదను. కనుక నో కుమారా ! ధర్మరాజా ! నీ వింక భీమసేనాదులను దీసికొని నిలువుము. నీబుద్ధి ధర్మమునందు నిలుచుఁ గాక. నీ మన స్సౌదార్యము వహించుఁగాక.

ఇది పదునెనిమిదవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము

**— ధృతరాష్ట్రుఁడు ప్రథమదిన ప్రయాణమున గంగాతీరము సేరుట —**

కుంతీదేవి చెప్పినమాటలు విని లజ్జితులై ధర్మరాజాదులు ద్రౌపదితోఁగూడ వెనుకకు మరలిరి. అనంతర మట్లు వనవాసము వెళ్లుచున్న కుంతీదేవిని జూచి యంతఃపురస్త్రీలు పెద్దపెట్టున నేడ్వఁగా నప్పు డొక పెద్దరోదనధ్వని బయలుదేఱెను. అంత ధర్మరాజాదులు తమ పెత్తండ్రికిఁ బ్రదక్షిణించి, తమ తల్లిని మరల్ప లేక వెనుకకు మరలిరి. అప్పుడు ధృతరాష్ట్ర మహారాజు గాంధారిని బట్టుకొని, విదురునిపైఁ జేయి వైచి యిట్లనియె. 'ఈ ధర్మజుని తల్లి కుంతీదేవి యింటికి మరలి వెళ్లుట మంచిది. ధర్మరా జేమి చెప్పెనో యది సత్యమే నుఁడీ ! అధికఫలవంతమై మహత్తరమైన పుత్రుల యింతటి యైశ్వర్యమును విడిచి, కన్న కొడుకులను వదలి, మూర్ఖురాలివలె నే యిల్లాలు దుర్గమారణ్యములకుఁ బోవును ? రాజ్యములోనే (పట్టణములోనే) యుండి యీయమ తపస్సు చేసికొనవచ్చును. మహాదానము లీయవచ్చును. ఇది యంతయు నీయమకు సాధ్యమే; కాన నిప్పు డీయమ నా మాట వినుఁ గాక. దేవీ ! గాంధారీ ! యీ కోడలు (కుంతీదేవి) చేసిన శుశ్రూషలచే నేను సంతుష్టుఁడ నైతిని. కావున నో ధర్మజ్ఞురాలా ! నీ వీయమకు "నిలువు" మని నొక్కి చెప్పుము.' అని చెప్ప, గాంధారి కుంతీదేవికి మహారాజు చెప్పిన వాక్యములను జెప్పి, తాను గొంత విశేషముగాఁ జెప్పవలసినది చెప్పెను. కాని వనవాసమునకే బుద్ధిని స్థిరపఱచుకొని యున్న ధర్మపరు

రాలును, సతీకులతిలకమును నగు కుంతీదేవిని దత్ప్రయత్నము నుండి మరల్ప లేక పోయెను. అంతట, కౌరవ (పాండవ) స్త్రీలు కుంతీదేవియప్పటి పరిస్థితిని, వనగమన వ్యవసాయ మును దెలిసికొని—, ధర్మరాజాదులు మరలుట చూచి గొల్లున నేడ్వసాగిరి. అనంతరము ధర్మరాజాదులును—, అంతఃపురస్త్రీలును—అందఱును మరలఁగనే యప్పుడు మహా ప్రజ్ఞాఢ్యుఁడైన ధృతరాష్ట్రమహారాజు వనమునకు బయలు దేఱెను. పాండవులును దీనాతిదీనులై దుఃఖశోకపరాయణు లై స్త్రీజనముతోడ వాహనములమీఁదఁ బురము ప్రవే శించిరి. అప్పు డాహస్తినాపట్టణము, స్త్రీలలోఁ గాని, బాలురలోఁ గాని, వృద్ధులలోఁగాని యెట్టి యుత్సాహమును, ఎట్టి యానందమును లేక కేవల నిరుత్సాహమై నిరానందమై యుత్సవము గడచినతరువాత నున్నట్లు లుండెను. కుంతీదేవి విడిచిపెట్టి పోఁగాఁ బాండవు లందఱును దల్లి వదలిన బిడ్డల వలె దీనులై నిరుత్సాహులై మిక్కిలి దుఃఖార్తులై యుండిరి.

అట ధృతరాష్ట్రమహారా జా పగలు చాలదూరము పోయి, సాయంతనమునకు గంగాతీరము చేరి యట నిలిచెను. అచ్చట వేదపారగులైన బ్రాహ్మణోత్తములచే విధ్యుక్తముగ వేల్వఁ బడిన యగ్నిహోత్రము లక్కడక్కడఁ బ్రజ్వరిల్లుచుండెను. ఆవృద్ధరాజును—అక్కడ నగ్నిహోత్రములఁ బ్రజ్వరిల్లఁజేసి యగ్న్యుపాసన గావించి, విధిప్రకారము హోమము చేసి, సంధ్యావందన సూర్యోపస్థానాది కృత్యములు నిర్వర్తించెను. విదురుఁడును, సంజయుఁడును గుశలతో నమ్మహారాజునకుఁ బడుక యేర్పఱచిరి. ఆ సమీపములోనే గాంధారీదేవికిని

నేర్పఱచిరి. గాంధారికి దగ్గఱదాపులో సాధువ్రతనిష్ఠాపరురాలైన కుంతీదేవి కుశలపైఁ బరుండెను. వారు చెప్పెడి మాటలను వినునిమిత్తమై విదురాదులును ఆ దాపుననే పరుండిరి. వెంటవచ్చిన యాజకబ్రాహ్మణులును, భృత్యజనులును వారి వారి కుద్దేశించిన ప్రదేశములయందుఁ బరుండిరి. ఆ రాత్రి వారికి బ్రాహ్మణోత్తములు చదువు వేదపాఠముల తోను — ప్రజ్వరిల్లుచున్న యగ్నులతోను — బ్రాహ్మ ముహూర్తమువలెఁ (వేకువజామువలెఁ) జాలఁ బ్రీతివర్ధకమై యుండెను.

అనంతర మారాత్రి గడచుటయు వా రందఱును యథావిధిగఁ బ్రాతఃకాలాహ్నిక క్రియలను నిర్వర్తించుకొని, హోమములు గావించి, యథాప్రకారము ప్రయాణము సాగించిరి. వా రుపవాసపరాయణులై యుత్తరాభిముఖు లగుచు గమ్యస్థానమును నిరీక్షించుచుఁ బోవుచుండిరి. వారు మొట్టమొదటఁ బ్రయాణమైనప్పుడు పౌరజానపదులతోఁ జెప్పి దుఃఖించుటచేతను, వారితో సంభాషించుటచేతను ఆనాఁటి ప్రయాణము మాత్రము దుర్భరదుఃఖావిలమై యుండెను.

ఇది పందొమ్మిదవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము

— ధృతరాష్ట్రుఁడు కురుక్షేత్రముఁ జేరి తపస్సు చేసికొనుట —

అనంతరము ధృతరాష్ట్రమహారాజు విదురునను మతమున నతిపావనమును, బుణ్యజనోచితము నగు గంగాతీరమున నొకచో నిలిచెను. అచ్చట వనవాసులై యున్న బ్రాహ్మణ

క్షత్రియ వైశ్య శూద్రులు పెక్కుమంది వచ్చి యమ్మహారాజు నాదరించి గౌరవించిరి. వారిచేఁ బరివృతుఁ డయి ధృతరాష్ట్ర మహారాజు వారికిఁ గొన్ని కథలు చెప్పి, వారిని సంతోష పఱచి, సపరివారముగా వారి కందఱకును దాను మరల గౌర వము చేసి పూజించి పంపెను. అటుతరువాత సాయంకాల మున నమ్మహారాజు గంగానదికిఁ బోయి యథావిధిగ స్నాన సంధ్యాద్యనుష్ఠానములు దీర్చుకొనెను. యశస్వినియైన గాంధా రియు నియతకృత్యములు నిర్వర్తించెను. విదురాదులును, దక్కుంగల వా రందఱును వేర్వేఱ స్నాన మాచరించి, సర్వ క్రియలు నిర్వర్తించిరి. పిమ్మటఁ గుంతీదేవి కృశీభూతుఁడై యున్న యావృద్ధరాజునకును, గాంధారీదేవికిని గంగాతీర్థమును దెచ్చి యిచ్చెను. యాజకు లగ్నివేదికచుట్టు పరిస్తరణములు (దర్భలు) పఱచిరి. అప్పుడు సత్యప్రతిజ్ఞుఁడైన యా మహారా జగ్నిని వేల్చెను.

పిమ్మట నమ్మహారా జనుచరసమేతముగా భాగీరథీతీరము నుండి కురుక్షేత్రమునకుఁ బోయి యట నియమవంతుఁడై నియతేంద్రియుఁడై యాశ్రమప్రదేశముఁ జొచ్చి, ప్రాజ్ఞుఁ డగు శతయూపుఁ డను రాజర్షిసన్నిధి కరిగెను. ఆ రాజర్షి కేకయదేశము నేలిన మహారాజు. కొడుకునకు రాజ్య మప్ప గించి వనము ప్రవేశించినవాఁడు. ఆ రాజర్షితోఁగూడ ధృత రాష్ట్రమహారాజు వ్యాసాశ్రమమునకుఁ బోయెను. అట నక్కురుకులోద్వహుని ననురూపప్రకారమునఁ బూజించిరి. అచ్చో నమ్మహారాజు దీక్షఁ బూని శతయూపరాజర్షియాశ్ర మములో నివాస మేర్పఱచుకొనెను. వ్యాసమహర్షి యాజ్ఞాను

సారము మహామతియైన శతయూపరాజర్షి యమ్మహారాజునకు వానప్రస్థాశ్రమవిధు లన్నియు నెఱిఁగించెను. ఈ ప్రకారముగా ధృతరాష్ట్రమహారా జుదారమనస్కుఁడై తాను దపశ్చర్యకుఁ గడంగి, తనవెంట వచ్చినవారి నందఱనుగూడఁ దపశ్చర్యకు దించెను. అవ్విధముగా గాంధారీదేవియు వల్కలాజినధారిణియై కుంతీదేవితోడ సమానవ్రతచారిణియై తపస్సు చేసికొనుచుండెను. అందఱును మనస్సుచేతను—, వాక్కులచేతను—, చేష్టలచేతను—దృష్టులచేతను సమస్తేంద్రియములను నిరోధించి తీవ్రతపము నాచరించుచుండిరి.

ధృతరాష్ట్రమహారాజు కేవలము శుష్కించి చర్మశల్యమాత్రావశిష్టుఁడై జేడలు దాల్చి, వల్కలాజినములు ధరించి, మోహపాశములు వీడి, మహాయోగిచందమునఁ దీవ్ర తపమాచరించుచుండెను. ధర్మవిదగ్రగణ్యుఁడైన విదురుఁడు సంజయునిఁగూడి యాత్మనిరోధము గావించి తపస్సు చేసికొనుచుఁ గృశీభూతుఁడై వల్కలాజినధారియై గాంధారీధృతరాష్ట్రుల కుపచారములు సేయుచుండెను.

ఇది యిరువదియవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము

నారదాదిమునులు ధృతరాష్ట్రునిఁ జూడ వచ్చుట. నారదుఁడు ధృతరాష్ట్రునకుఁ దత్తపోవనమహిమ నెఱింగించుట

ధృతరాష్ట్రమహారాజు శతయూపాశ్రమమునఁ దపస్సు చేసికొనుచుండఁగా మునికులశ్రేష్ఠులును, దపోగరిష్ఠులు నగు

నారదుఁడును, పర్వతుఁడును, దేవలుఁడును, శిష్యసహితముగా వేదవ్యాసుఁడును, ప్రాజ్ఞులగు మఱికొందఱు సిద్ధులును, పరమ ధార్మికుఁడు, వృద్ధుఁడు నగు శతయూపరాజర్షియు నా రాజర్షిని జూడ నేతెంచిరి. వా రందఱకును యథావిధిగాఁ గుంతీదేవి పూజచేసెను. ఆయమ చేసిన పరిచర్యకు వా రందఱును మిక్కిలి సంతోషించిరి. అక్కడ న మ్మహర్షు లందఱును ధృతరాష్ట్రమహారాజును సంతోషపెట్టువారై ధర్మప్రతిపాదకము లైన కథలు చెప్పిరి. ఒకానొక కథ చెప్పుచుండఁగా మధ్యలో సర్వమును బ్రత్యక్షముగాఁ జూచి వచ్చెడి నారదమహర్షి యీ కథ చెప్పెను.

పూర్వము శతయూపునితాత సహస్రచిత్యుఁ డనురాజుండెను. అతఁడు బ్రహ్మాయంతటివాఁడు, అకుతోభయుఁడు. (అనఁగా స్వధర్మనిర్వహణముచే నెట్టి లోపము లేనందున నే విధమైన భయము లేనివాఁడనుట.) ఆతఁడు పరమధార్మికుఁడైన తన పెద్ద కుమారునకు రాజ్యము గట్టి, తా నీ తపోవనముఁ బ్రవేశించెను. ప్రవేశించి తీవ్రమైన తపస్సుచేసి, తపస్సిద్ధిఁ బొంది యింద్రలోకముఁ జేరెను. నే నింద్రునిదగ్గఱకుఁ దఱచు వచ్చిపోవుచు నాతని ననేకపర్యాయము లింద్రభవనములోఁ జూచితిని. ఆతఁడు తపస్సుచే నిర్దగ్ధకల్మషుఁ డయ్యెను. ఇవ్వనప్రభావ మట్టిది.

మఱియు భగదత్తుని తాత శైలాలయుఁ డనురాజీ తపోవనములోఁ దపస్సు చేసి తత్తపోబలమున నింద్రలోకముఁ జేరెను. అట్లే దేవేంద్రతుల్యుఁ డగు పృషధ్రుఁ డను రాజును—నిటఁ దపస్సు చేసి తత్తపఃఫలముతో నిటనుండి

యింద్రలోకముఁ జేరుకొనెను. మఱియు మాంధాతృమహా రాజుకుమారుఁడును—నదీకులతిలకమైన నర్మదను వివాహ మాడినవాఁడును నగు పురుకుత్సమహారాజుగూడ నీతపోవన మునఁ దపస్సు చేసి గొప్పసిద్ధిని బొంది యింద్రలోకమును బడసెను. మఱియుఁ బరమధర్మాత్ముఁ డగు శశలోముఁ డను భూపాలుఁ డీతపోవనమునందు లెస్స తపస్సు గావించి తత్ప్ర భావమున స్వర్గము నొందెను.

ధృతరాష్ట్రమహారాజా! నీవును వ్యాసభగవాను నను గ్రహమున నివ్వనమునఁ జేరితివి. కావున నుత్తమమును, దుష్ప్రాపము నగు సిద్ధిని బడయఁగలవు. రాజోత్తమా! నీవును దపస్సు ముగిసినతరువాత సిద్ధిని బడసి, యిచ్చోఁ దప మొన రించి సిద్ధి నొందిన యీ మహాత్ము లందఱును బొందిన సద్గ తినే గాంధారీదేవితోడఁ బొందఁగలవు. మహారాజా! పాండు మహారా జింద్రుని సన్నిధిలో నుండి నిన్నెప్పుడును దలఁచు కొనుచుండును. అతఁడు నీకు సర్వదా శ్రేయస్సు గూర్పఁ గలఁడు. రాజేంద్రా! నీకోడలును—, ధర్మరాజును గన్న తల్లియు నగు కుంతీదేవిగూడ మీ దంపతులకు శుశ్రూష లొనరించి తన భర్తతోడి సాలోక్యమును బడయఁగలదు. అట్లు పతిసాలోక్యమును బొందుట సతికి సనాతనమైన ధర్మము గదా! రాజా! మే మీ విషయము దివ్యదృష్టితోఁ జూచి చెప్పుచున్నారము. విదురుఁడు మహాత్ముఁ డగు ధర్మరాజులో నైక్యమొందును. (ఉభయులును యమధర్మరాజాంశసంభూ తులు గనుక;) సంజయుఁడు విదురునిపోక దలంచుకొనుచు నిట నుండి స్వర్గము నొందఁ గలఁడు.

అని నారదమహర్షి చెప్పఁగా మహాత్ముఁడగు ధృతరాష్ట్ర మహారాజు విని గాంధారీసహితముగా మిక్కిలి యానందించి విజ్ఞుఁడు గాన నమ్మునివాక్యములను ప్రశంసించి పూజించెను. అనంతర మచట బ్రాహ్మణసంఘము వారందఱును విశేషముగా నమ్మహామునిని బూజించిరి. అప్పు డాధృతరాష్ట్రునకుఁ గలిగిన ప్రీతితో నా బ్రాహ్మణు లందఱును మఱీమఱి సంతోషించినవారైరి.

ఇది యిరువది యొకటవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము

{ నారదమహర్షి శతయూపునకు ధృతరాష్ట్రుని భవిష్యద్వృత్తాంతము నెఱింగించుట }

నారదమహర్షి చెప్పిన యా వాక్యమును బ్రాహ్మణోత్తము లందఱును ప్రశంసించిరి. శతయూపరాజర్షి నారదునితో నిట్లనియె. మహాత్మా! భగవానులచే (మీచే) నీ ధృతరాష్ట్ర మహారాజునకుఁ గల శ్రద్ధ మఱింత పెంపకము చేయఁబడెను. ఇతని కొక్కనికే గాక యిక్కడ నున్న వీరందఱకును, నాకును నట్లే యయ్యెను. మహాత్మా! యీ ధృతరాష్ట్రమహారాజును గుఱించి తమతో నొకవిషయము మనవి చేసికొనవలె నని కుతూహల మున్నది. మనవిచేసికొనియెదను, చిత్తగింపుఁడు. తాము సర్వ వృత్తాంతములును నెఱింగిన తత్త్వవేత్తలరు. దివ్యదృష్టితోఁ జిత్తగించెడివారు. మానవుల కర్మగతులు నానావిధములు గదా!

'దేవర్షిసత్తమా! నరపాలుర కింద్రలోకప్రాప్తి గలుగు నని సెల విచ్చితిరి. కాని యీ ధృతరాష్ట్రమహారాజునకుఁ గలిగెడి లోకము లేవో సెల విచ్చినవారు గారు. ఈ మహా రాజు పొందెడి స్థాన మేదో, ఈయన యెప్పు డెట్టి పరిణామము నొందువాఁడుగా నుండునో తమవలన వినవలె నని కుతూహ లము పొడముచున్నది. యథార్థమును సెల వీయఁ గోరె దను.' అని యా రాజర్షి యడుగ దివ్యదృష్టియుఁ, దపస్సంప త్తియుఁ గల నారదమహర్షి సభామధ్యమున నెల్లవారల హృద యములకును దగులునట్లు లిట్లు చెప్పెను.

ఓ రాజర్షీ! యొకప్పుడు నేను దైవికముగా నింద్రలోకము నకు వెళ్లితిని. అక్కడఁ బాండుమహారాజును జూచితిని. అప్పుడు 'ధృతరాష్ట్రమహారాజు ఘోరతపస్సు చేయుచున్నాఁ' డని యక్కడ నీతని ప్రశంస వచ్చెను. అప్పు డింద్రుఁడు తానుగా నిట్లు చెప్పెను. నేను వింటిని. ఏమన ?:—

ఈరాజున కిఁక మూఁడు సంవత్సరము లాయుర్దాయము గలదు. తర్వాత నీతఁడు గాంధారితోడఁ గుబేరుని మందిరముఁ జేరి యక్కడఁ గుబేరునిచే సత్కృతుఁ డగు చుండును. వేద వ్యాసమహర్షికిఁ బుత్రుఁడును, మహాభాగ్యశాలియుఁ, దప స్సుచేఁ బాపమును బోఁగొట్టుకొనినవాఁడును నగు నీ ధృత రాష్ట్రమహారాజు వ్యాసభగవానుని తపఃప్రభావముచేఁ గామ గమనమైన విమానముతో దేవలోకములను, గంధర్వలోక ములను, రాక్షసలోకములను దన యిచ్చవచ్చినట్లు సంచరింపఁ గలఁడు. ఈ విషయము దేవతలకేనియుఁ జెప్పఁగూడని రహస్య మగును. అయినను మీకుఁ జెప్పితిని. మీ రందఱును

వేదశాస్త్రసంపన్నులు, తపోగ్నిచేఁ బాపమును దగ్ధముచేసి కొన్న నిర్మలాత్ములు నగుటచే మీకుఁ జెప్పితిని.

అని నారదమహర్షి చెప్ప, నమ్మని చెప్పిన మధురవాక్యములను విని యక్కడ నున్న వా రందఱును, శతయూప రాజర్షియు—మిక్కిలి సంతసించిరి. ఇవ్విధముగాఁ గథలు చెప్పి ధృతరాష్ట్రమహారాజును సంతోషపెట్టి యావచ్చిన మహనీయు లందఱును గామగమనముతో నెవరియిచ్ఛవచ్చి నట్లు వారు వెళ్లి పోయిరి.

ఇది యిరువది రెండవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము

{ ప్రజలును, పాండవులును వనవాసము సేయు ధృతరాష్ట్రాదులనుగుఱించి పరితపించుట }

జనమేజయా! ధృతరాష్ట్రమహారాజు వనమునకు వెళ్లి పోయిన తరువాతఁ బాండవు లాయనను దలంచుకొని మిక్కిలి దుఃఖాక్రాంతు లైరి. అట్లే పురజను లందఱును నమ్మహారాజును దలంచుకొని శోకించుచుండిరి. ఆ పట్టణమునందలి బ్రాహ్మణులు ధృతరాష్ట్రునిగుఱించి కథలుగా నిట్లు చెప్పఁ కొన సాగిరి. 'ఆ వృద్ధరా జెట్లు నిర్జనవనములో నివసించు చున్నవాఁడో? మహాభాగ్యశాలిని యైన గాంధారియుఁ, గుంతియు నె ట్లుండఁ గలుగుచున్నవారో! ఆ వృద్ధరాజు కేవలము సుఖార్హుఁడు! అంధుఁడు! అట్టివాఁ డా మహారణ్యమునందు సుఖ మనునది లేక యేమేమి యవస్థలఁ బడుచున్న వాఁడో! కుంతీదేవి చేసినపని యెంత దుష్కర మైనది! కన్న

కొడుకులను గాదని, వదలిపెట్టి, రాజ్యభోగములను బరిత్యజించి, యరణ్యములకుఁ బోవనే యభిలషించెనుగదా! అన్నగారికి శుశ్రూషలు సేయుచు, నయ్యరణ్యమున దృఢమనస్కుఁడైన విదురుఁడే మే మవస్థలపాలగుచున్నవాఁడో! బుద్ధిశాలి యగు సంజయుఁడు ప్రభువుగారియుప్పు పులును దిన్నందులకుఁ గృతజ్ఞుఁడై యీ యరణ్యములో నేమి యవస్థలఁ బడుచున్నవాఁడో!' అని యనేకకథలు చెప్పుకొనుచుండిరి. ఈప్రకారముగా నాపురములోని జను లాబాలవృద్ధముగఁ జింతాక్రాంతులై శోకోపహతు లగుచు నక్కడక్కడ నొండొరులు కలిసికొనుచు ధృతరాష్ట్రాదులనుగుఱించిన విషయములను జెప్పుకొనుచుండిరి.

పాండవు లందఱును శోకాక్రాంతులై వృద్ధురాలగు తమ తల్లిని, వృద్ధుఁడును హతపుత్త్రుఁడు నగు తమపెత్తండ్రిని, మహాభాగ్యశాలిని యై యున్న గాంధారిని, మహాబుద్ధిశాలియైన విదురునిఁ దలంచుకొని శోచించుచుఁ బెద్దకాలము పట్టణములో నివసింపరైరి. అరణ్యములకుఁ బోయిన వారిని గుఱించి చింతించుచున్న వీరి కప్పుడు రాజ్యమునందుఁగాని, రమణులయందుఁ గాని, వేదపాఠములయందుఁగాని యేమాత్రమును బ్రీతి కలుగ దయ్యెను. ఆ వృద్ధభూపతిని—, మహాఘోరమైన యీ జ్ఞాతివధను—మాటిమాటికిఁ దలంచుకొనుచు వారు మిక్కిలి నిర్వేదమును బొందినవారైరి. రణరంగమున జరిగిన యభిమన్యుకుమారుని యన్యాయపుఁ జావును, యుద్ధమున వెనుకంజవేసి యెఱుఁగని పరాక్రమశాలి యగు కర్ణుని మరణమును, ద్రౌపదికుమారులగు నుప

పాండవుల దుర్మరణమును, దక్కంగల మిత్రులవధయును దలంచుకొని యా పాండవవీరులు మానసికోత్సాహము బొత్తిగా లేనివారై దుఃఖితాత్ములైరి. భూమి యంతయు వీరాధివీరులను, రత్నసంపదను గోల్పోయెనే యని వారు నిరంతరచింతాకులితులై చిత్తశాంతి యనునది లేకుండిరి. హతపుత్రయైన ద్రౌపదియు, సుభద్రయుఁ బుత్రశోకాగ్ని సంతప్తలై సంతోష మనునది యెఱుఁగక కుమిలి కూలారి పోవుచుండిరి. జనమేజయా! మీ తాతలు (పాండవులు) మీ తండ్రియగు పరీక్షిత్తును జూచుకొని పోనున్న ప్రాణములను బట్టుకొని యున్నవారు.

ఇది యిరువది మూఁడవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము

{ధర్మరాజు ధృతరాష్ట్రాదులను జూడఁ గురు క్షేత్రమునకు బయలుదేరుట}

కన్నతల్లి నానందపఱచు నుత్తమకుమారులైన పాండవులు వనవాసము పోయిన తమ తల్లినిఁ దలఁచుకొనుచు మిక్కిలి దుఃఖితులైరి. ఇంతకు మున్ను నిరంతరము రాజకార్యాసక్తులై యుండెడి పాండవులు తల్లి యెడఁబాసి పోయినది మొదలుగా నా దుఃఖముతోఁ బట్టణములోఁ జేయవలసిన యెట్టి రాజకార్యమును జేయుచున్నవారు గారైరి. వారు దుఃఖసముద్రములో మునిఁగిపోయినవారువలెఁ గాన్పించుచు దేనిని గుఱించి గూడ నానందించినవారు గారైరి. పలుకరించినను మనస్కరించి బదులు పలుకరైరి. వారందఱును వీరాధి

వీరులు! దురాధర్షులు (పరులకుఁ జెనకరానివారు.) గాంభీర్యము నందు సముద్రునిఁ బోలినవారు. ఇట్టివారు శోకముచే విజ్ఞానమును గోలుపోయి, కేవలము మతిపోయినవారివలె నుండిరి. ఇట్లుండి తమ తల్లిని దలంచుకొని యూరక యిట్లు చింతించుచుండిరి. 'పెద్దది మా యమ్మ కృశించి యెట్లున్నదో! వృద్ధదంపతు లెట్లున్నవారో! హతపుత్త్రుఁడును, నిరాశ్రయుఁడు నగు నా ధృతరాష్ట్రమహారాజు భార్యతోడ నొంటరిగాఁ గ్రూరమృగశరణ్యమైన యయ్యరణ్యమునం దెట్లు నివసింపఁ గలుగుచున్నవాఁడో! బంధుజనుల నందఱను బోఁగొట్టుకొని పొక్కుచున్న యీ గాంధారీదేవి యీ నిర్జనారణ్యములో నంధుఁడును, శతవృద్ధును నగు భర్త నెట్లు సేవించుచున్నదో!' అని యిట్లనుకొనుచుండఁగా వారికి ధృతరాష్ట్రాదులను జూడవలె ననుకోరికతో నక్కడికిఁ బోవలె నని యుత్సాహ మంకురించెను. అప్పుడు సహదేవుఁడు నమస్కరించి ధర్మరాజుతో నిట్లనియె. 'అన్నయ్యా! ఆశ్చర్యము!! అమ్మను జూడవలె నని నీకు మనసు గలిగినట్లు తోఁచుచున్నది. నాకీ యభిప్రాయ మెన్నఁడో కలిగియుండెను; కాని పెద్దవాఁడ వని జంకి నీతో 'తొందరగాఁ బోద' మని చెప్పఁజాలకుంటిని. ఇప్పటి కది తటస్థించినది. ఇఁక దైవయోగముచే అమ్మను జూడఁగలను. అరణ్యములో నుండి, జడలు దాల్చి, తపస్సు చేసికొనుచుఁ, దాపసవేషముఁ బూని యున్న వృద్ధురాలిని—, రాణివాసమునఁ బెరిఁగి, యత్యంతసుఖ మనుభవించి, యీ నాఁడు దర్భలను, ఱెల్లును బఱచుకొని పరుండి, యవి గ్రుచ్చుకొన నత్యంతపరిశ్రాంత యై మిక్కిలి దుఃఖితురాలై యున్న

మన యమ్మను—ఎప్పుడు చూడఁగల్గుదును! రాజేంద్రా! మానవులగతు లొక తీరైనవి కావు గదా! చూడు! రాజ కుమారియైన మనయమ్మ యరణ్యములలో నిడుమలఁ బడు చున్నదే.!

అని చెప్పుచున్న సహదేవుని వాక్యములు విని తరుణీ లలామ యగు ద్రౌపది ధర్మరాజును బహుమానించి, నమస్క రించి యిట్లనియె: 'దేవా! మా యత్త కుంతీదేవి బ్రతికి యుండెనేని నే నెప్పుడు చూడఁగల్గుదును! నేను బ్రతికి యుండఁగా నా కెప్పు డట్టిప్రీతి గలుగును? నీకుఁ గలిగిన యీ బుద్ధి నిలుకడగా నుండెడుఁగాక. నీ చిత్తము ధర్మము నందే యెల్లప్పుడు రమించుఁగాక. నీవిప్పుడు మా కందఱకును శ్రేయస్సు గూర్పనున్నాఁడవు. ఈ వధూజనము (తాను) కుంతీ గాంధారీ ధృతరాష్ట్రులను జూడవలె నని మునిగాళ్లపై నున్న దానినిఁగా దెలిసికొనుము.'

అని ద్రౌపది చెప్ప విని ధర్మరాజు సేనాధ్యక్షుల నందఱను బిలిపించి యిట్లు చెప్పెను. 'సేనాపతులారా! మీరు రథ ములు, ఏనుఁగులు విస్తారముగా సన్నాహపఱచి సేనలను గద లింపుఁడు. నేను వనవాసము సేయుచున్న ధృతరాష్ట్రమహా రాజును జూడఁబోయెదను.' అని వారికిఁ జెప్పి తదనంతర మంతఃపురపరిపాలకులతో నిట్లు చెప్పెను.

'ఓయీ! అన్నివిధములైన వాహనములును, వేల కొలఁదిగాఁ బల్లకీలును, బండ్లును బయలుదేఱవలయును. అంగళ్లు, కోశము (బొక్కసము), కోశాధికారులు, శిల్పులు, నా వెంటఁ గురుక్షేత్రమునకు బయలుదేఱవలయును. ఇంకను

బురజనులలో నెవరైన మహారాజును జూడవలె నని యపేక్ష పడుదు రేని, యట్టివారు నిరభ్యంతరముగను సురక్షితముగను బయలుదేఱి రా నగును. వంటలవారు, వంట యింటి యధికారులు—వంటలకు వలయు సాధనసామగ్రిని దీసికొని భక్ష్యభోజ్యములను బండ్ల కెత్తించుకొని బండ్లతో బయలుదేఱి రావలయును. రేపు ప్రయాణ మని యిప్పుడ చాటింపవలయును. ఆలస్య మే మాత్రమును—గూడదు. మార్గమునందుఁ గూడ నిప్పుడే నానావిధములైన నివేశములు నిర్మింపఁబడవలయును.'

అని యాజ్ఞాపించి ధర్మరాజు తమ్ములతోఁ గూడ స్త్రీ వృద్ధ పురస్సరముగా బయలుదేఱెను. అట్లు బయలుదేఱి వెంట వచ్చినవారి నందఱను సురక్షితముగాఁ గాపాడుచు నూరివెలుపల నైదుదినములుమాత్ర ముండి, పిమ్మట వనమునకుఁ బ్రయాణము సాగించెను.

ఇది యిరువది నాలవ యధ్యాయము

---

ఆశ్రమవాసపర్వము

ధర్మరాజాదులు కురుక్షేత్రమునఁ బ్రవేశించుట

అనంతరము ధర్మరాజు లోకపాలురకు దీటయిన యర్జున ప్రభృతులగు వీరులచే నభిరక్షితమగు సేన నాజ్ఞాపించెను. వెంటనే 'సిద్ధము, సిద్ధము' అనియు, '(గుఱ్ఱములను) కట్టండి, కట్టండి' అనియు గుఱ్ఱపురౌతు లొండొరులకు హెచ్చరికలు చేసికొనిరి. అప్పు డా ధ్వని యొక్క పెద్ద కోలాహలముగా బయలుదేఱెను. వెంటనే కొందఱు బండ్లు మొదలైన యానము

లెక్కి బయలుదేఱిరి. కొందఱు మహావేగవంతములైన గుఱ్ఱములనెక్కి పయనము సాగించిరి. కొంతమంది జాజ్వల్యమానాగ్నిసంకాశము లగు బంగారురథము లెక్కి బయలుదేఱిరి. మఱి కొంతమంది యేనుఁగులమీఁదను, ఒంటెలమీఁదను బ్రయాణమైరి. పులిగోళ్లవంటి యీఁటెలు పట్టుకొని కొందఱు కాల్బంటులును, పౌరజానపదులును నానావిధయానములపై నెక్కి ధృతరాష్ట్రమహారాజును జూడవలె నను కుతూహలముతో ధర్మరాజువెంట బయలుదేఱిరి. కృపాచార్యుఁడు ధర్మరాజు నాజ్ఞప్రకారము సేనానాయకత్వము వహించి, సేనను దీసికొని యాశ్రమమునకు బయలుదేఱెను.

అనంతరము ధర్మరాజు బ్రాహ్మణజనపరివేష్టితుఁడై సూత వంది మాగధులు గుంపులుగాఁ జేరి యనేకవిధములఁ బొగడుచుండఁగను, తలపై శ్వేతచ్ఛత్రమును బట్టుకొని యుండఁగను గొప్ప రథసముదాయముతో బయలుదేఱెను. పర్వతములఁ బోని యేనుఁగులపై యంత్రములను, ఆయుధములను నమర్చుకొని భీమకర్ముఁడైన భీమసేనుఁడాగజసముదాయముతో బయలుదేఱెను. శీఘ్రగాము లగు నకుల సహదేవు లిరువురును గవచములు దొడిగి, ధ్వజము లెత్తి, యశ్వములపై బయలుదేఱిరి. మహాతేజస్సంపన్నుఁడును, మంచి నిగ్రహశక్తి గలవాఁడును నగు నర్జునుఁడును—శ్వేతాశ్వములను బూన్చిన సూర్యసంకాశ మగు దివ్యరథము నధిష్ఠించి ధర్మరాజువెంబడి బయలుదేఱెను. ద్రౌపది మొదలుగాఁ గల స్త్రీ లందలము లెక్కి, యంతఃపురరక్షకులచే సంరక్షిత లగుచు, దారిపొడుగునను నపరిమిత మగు ధనమును దానరూప

కముగఁ గొల్ల వెట్టుచు బయలుదేఱిరి. అట్లు బయలుదేఱిన సమయమున నా పాండవసైన్యము రథగజాశ్వపరిపూర్ణ మై వేణు వీణాది వాద్యఘోష ప్రతినాదితమై మిక్కిలియు శోభాయమానముగాఁ బ్రకాశించుచుండెను.

అట్లు బయలుదేఱి ధర్మరాజు మార్గమధ్యమున నక్కడక్కడ రమణీయములైన నదీతీరములయందును, సరోవరతీరములయందును విడియుచుఁ గ్రమముగాఁ బ్రయాణము సాగించెను. మహాతేజస్కుఁ డైన యుయుత్సుఁడును, బురోహితుఁ డగు ధౌమ్యాచార్యుఁడును ధర్మజుని యాజ్ఞమేరకుఁ బురరక్షకులుగా హస్తినాపురములోనే యుండిరి. ధర్మరాజట్లు క్రమముగాఁ బ్రయాణము సాగించి పరమపావని యైన యమునానదిని దాఁటి కురుక్షేత్రమును సమీపించి, దూరమునుండి శతయూపాశ్రమమును, ధృతరాష్ట్రాశ్రమమును గాంచెను. అనంతర మా వచ్చినవా రందఱును మహాసంతోషముతో, చుట్టుపట్ల మాఱుమ్రోఁగున ట్లఱచుచు మహావేగముతో నవ్వనముఁ బ్రవేశించిరి.

ఇది యిరువది యైదవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము

### ధర్మరాజాదులు ధృతరాష్ట్రుని దర్శించుట

అనంతరము పాండవులు దూరముననే వాహనములు దిగి వినయానతులై పాదచారు లగుచు ధృతరాష్ట్రునాశ్రమమున కభిముఖముగాఁ బోయిరి. అప్పుడు వారివెంట వచ్చిన యుద్ధభటులును, పౌరజానపదులును, రాణివాసపుస్త్రీలును—

అందఱును బాదచారులుగానే వారివెంట నడిచిరి. పాండవు లట్లు పోయి జనశూన్యమై, మృగగణాకీర్ణమై కదళీవనశోభితమై యున్న ధృతరాష్ట్రునాశ్రమములోనికిఁ బోయిరి. అనంతర మక్కడ నియతవ్రతులై యున్న తాపసులు, పాండవులు వచ్చి రని వారలను జూడవలెనను కుతూహలముతో వారి దగ్గఱకు వచ్చిరి. ధర్మరాజు బాష్పకంఠుఁడై 'కౌరవ వంశోద్ధారకుఁడు మా పెత్తండ్రి యెక్కడ?' నని వారి నడిగెను. 'స్నానము నిమిత్తము—, పుష్పముల కొఱకును—, అభిషేక జలార్థమును—యమునానదికి వెళ్లి యున్నాఁడు మహాప్రభూ!' అని వారు చెప్పిరి. అప్పుడు పాండవు లా తాపసులు చెప్పిన మార్గమునఁ బాదచారు లగుచు నతిశీఘ్రముగాఁ బోయి, యనతిదూరములోనే వారి నందఱను జూచి పెత్తండ్రిని జూడవలె నను నభిలాషతో మిక్కిలి వేగముగా నడిచిరి. సహదేవుఁ డన్ననో యక్కడనుండి యమ్మదగ్గఱకుఁ దొందరగాఁ బరుగెత్తుకొని పోయెను. పోయి యామెపాదములకు నమస్కరించుచు మందస్వరముతో మెల్లగా దుఃఖించెను. ఆమెయుఁ గన్నులనిండ నీరు గ్రుక్కుకొనుచుఁ దనముద్దుకుమారుఁడు వచ్చె నని యాతనిని జూచి, చేతులు గ్రుచ్చి యాలింగనము చేసికొని, లేవఁ దీసి 'సహదేవుఁడు వచ్చినాఁడు' అని గాంధారికిఁ జెప్పెను. అనంతరము కుంతి ధర్మజ భీమార్జున నకులులను జూచి త్వరపడుచు, ఆసంగతి గాంధారీధృతరాష్ట్రుల కెఱిఁగించెను. ధర్మరాజాదులు వచ్చి చూచునప్పటికిఁ గుంతి హతపుత్రులై యున్న గాంధారీధృతరాష్ట్రులకు ముందు నడుచుచు, వారలను జేతఁ బట్టుకొని పిలుచుకొని పోవుచుం

డెను. అట్లు పిలుచుకొని పోవుచున్న యామెనుజూచి, వారామె పాదములపొంతఁ బడిరి. తరువాత గాంధారీధృతరాష్ట్రుల పాదములముందు నేలపైఁ బడిరి. మహామతిమంతుఁడును, మేధావియు నగు నావృద్ధరాజు కంఠస్వరమును, కరస్పర్శమును బట్టి వారి నందఱను గుర్తించి, శోకించుచున్న వారల నూఱడించెను. అంతట, వారు దుఃఖ మాఁపుకొని తమతల్లిని, పెత్తల్లిని, పెత్తండ్రిని యథావిధిగఁ బూజించిరి. అందఱకును గావలసిన జలమును గలశములతో వారు స్వయముగఁ దెచ్చిరి. కుమారులు దుఃఖసముద్రములో మునిఁగి పోవుచుండఁగాఁ గుంతీదేవి వారల నూరార్చి యుద్ధరించెను. తల్లిచే నూరార్పు నొందిన తరువాతఁ బాండవులును—అంతఃపురజనులును—పౌర జానపదులును—ధృతరాష్ట్రమహారాజును సందర్శించిరి. అప్పుడు యుధిష్ఠిరమహారాజు వారి వారి నందఱను నామగోత్రములతో ధృతరాష్ట్రమహారాజున కెఱుకపఱచెను. ఆ మ్మహారాజావచ్చినవారి నందఱను సత్కరించి, వారందఱ చేతనుబరివేష్టితుఁడై యానందబాష్పములు విడుచుచు నప్పుడు తాను వెనుకటివలె హస్తినాపురములోఁ దనమందిరమునఁ నున్నట్లుగానే తలంచెను. ద్రౌపదీ ప్రభృతు లగు కోడండ్రు వచ్చి నమస్కరింప నమ్మహారాజును—, గాంధారీదేవియుఁ—, గుంతీదేవియు వారి నందఱ నభినందించిరి. తదనంతరము ధృతరాష్ట్రుఁడు సిద్ధ చారణ సంసేవితమైన తన యాశ్రమమున కేతెంచెను. అప్పు డా చూడ వచ్చిన జనసంఘములచే

నయ్యాశ్రమము తారాగణములచే నాకసమువలెఁ బ్రకాశించుచుండెను.

ఇది యిరువది యాఱవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము

— సంజయుఁడు తాపసులకు ధర్మరాజాదుల నెఱింగించుట —

ధర్మరాజు తామర రేకులవలె సోయగమైన సోగకన్నులు గల తమ్ములతోఁ గూడి ధృతరాష్ట్రునాశ్రమమున నివసించెను. వారలను జూడ నానా దేశములనుండి యేతెంచిన మహానుభావు లగు మునీశ్వరులు 'వీరిలో ధర్మరా జెవరు? భీమార్జును లెవరు? కవలలు (నకుల సహదేవులు) ఎవరు? యశస్విని యైన ద్రౌపది యెవరు? తెలియఁ గోరుచున్నా' మని యడిగిరి. అప్పుడు వారలకు సంజయుఁడు వారి వారి నామధేయములను జెప్పి వారల నెఱిఁగించెను.

తాపసోత్తములారా! ఇదిగో మిసిమిబంగరు చాయ గలిగి, కొంచెము సన్నపాటిగా నుండి, సింహరాజువలె గంభీరదర్శనుఁడై, దీర్ఘనాసికయు, విశాలములై సోగలై యెఱుపుడాలు గలిగి యున్న కన్నులును గల యీతఁడు పాండవజ్యేష్ఠుఁడు, ధర్మరాజు!

ఈతఁడో మత్తగజేంద్రగామి, కాఁకలు దీఱిన కడాని బంగరు మేని చాయ గలిగి, విశాలములైన పెద్ద భుజశిరస్సులుగలిగి, పృథుదీర్ఘబాహుఁడై యున్నవాఁడు భీమసేనుఁడు!

ఈతని ప్రక్క నున్నవాఁడు, నల్లనిచాయవాఁడు, యువకుఁడు, గజరాజగంభీరుఁడు, సింహోన్నతాంసుఁడు, గజఖేలగామి, పద్మాయతాక్షుఁడు ! అర్జునుఁడు !

అదిగో ఆ కుంతీసమీపమున నున్న-, యింద్రోపేంద్రులం బోలియున్న—వా రిరువురు కవలలు ! (నకుల సహదేవులు.) ఇంత భూలోకములోను—ఎవ్వారికి రూపమునందును—, బలమునందును—, శీలమునందును—సరిసమానులు లే రని చెప్పుదురో ! అట్టిపురుషోత్తములు వీరే !

ఇదిగో ! ఈ పద్మపత్రాయతాక్షి ! కొంచెము మధ్యవయస్సు వచ్చి రా నట్లున్నదే ! నల్లకలువ చాయ గలిగి, పురదేవతయో ! మూర్తిమతి యైన లక్ష్మీదేవియో యనఁ గాన్పించుచున్నదే ! ఈయమ ద్రౌపది !

ఈయమ ప్రక్కనే బంగరుమేనిచాయ మీఁటి, శరీరధారిణి యైన పార్వతీదేవివలె నున్నదే ! ఆమె కృష్ణుని సోదరి ! సుభద్ర ! సత్యసంధురాలు !

ఇదిగో ! స్వర్ణదేహచ్ఛాయ గల యీయమ ! అర్జునుని భార్య ! నాగకన్య ! ఉలూపి ! అదిగో ! ఆ విప్పపూదండ వేసికొని యున్నదే ! ఆ యమ రాచకన్నియ ! పాండ్యరాజు కూఁతురు ! అర్జునుని భార్య !

ఇదిగో ! విచ్చిన కలువపూదండవలె నున్న యీయమ కృష్ణునితో నిరంతరస్పర్ధఁ బూను శల్యుని చెల్లెలు ! భీమసేనుని భార్య !

సంపెఁగపూదండవోలెఁ బచ్చగా నున్న యీయమ మగధరాజగు జరాసంధుని కూఁతురు ! సహదేవుని భార్య !

అదిగో! ఆ యిందీవరశ్యామశరీర! వేఱొకతె నకులుని మీఁదుగఁ గనిపించుచున్నదే సమీపవృక్షమున కల్లుకొనిన తీవియవలె! అక్కమలాయతాక్షి నకులుని భార్య!

ఇదిగో! ఈ సువర్ణగాత్రి! పిల్లవానిని దగ్గఱఁ దీసికొని యున్నదే! ఈమె పద్మవ్యూహమున ద్రోణాదులందఱు తాము సరథులుగా నుండి, విరథుఁడుగా నున్న యేవీరునిఁ జంపిరో! ఆ వీరుఁడగు నభిమన్యుని భార్య! ఉత్తర! విరాటరాజు కూఁతురు!

ఇదిగో! ఈ సీమంతిను లున్నారే తెల్లపై ఁటలు ధరించి, వీరందఱు నీ కురువృద్ధుని కోడండ్రు! నరవీరులచేఁ బుత్రులను—, భర్తలను—బోఁగొట్టుకొన్నవారు! నూర్వురు.

తాపసోత్తములారా! పెద్దలు మీ రడిగితిరి గానఁ జక్కని బుద్ధివృత్తి గలవా రగుటచే మీకు ముఖ్యముగాఁ దెలియవలసినవారినిఁ దెలియఁజెప్పితిని. మీచే నడుగఁబడినవా రందఱును సువిశుద్ధ సత్వలైన రాజపత్నులు! మీ రందఱుగూడఁ దపోబలగరిష్ఠులరు, శాంతి శమదమాది సద్గుణ సంపన్నులరు! సత్కులసంభూతులరు గదా!

అని సంజయుఁడు చెప్ప నా వచ్చిన తాపసోత్తము లందఱును సంతోషించి వెళ్లిపోయిరి. అనంతరము ధృతరాష్ట్ర మహారా జెన్నివిషయములనుగుఱించి పాండవులను గుశల మడిగెను. యుద్ధవీరు లగు నా వచ్చిన వా రందఱును, అది యాశ్రమ మని తెలిసికొని, వాహనములను వదలి కూర్చున్న తరువాతను—, స్త్రీలు, వృద్ధులు, బాలురు—అందఱును—

జక్కఁగాఁ గూర్చున్న తరువాతను—ధృతరాష్ట్రమహారాజు వారివారికిఁ దగినట్టుగా నందఱను గుశలము లడిగెను.

ఇది యిరువది యేడవ యధ్యాయము.

---

ఆశ్రమవాసపర్వము

{ ధృతరాష్ట్రి ధర్మనందను లాండ్రొరుల కుశల ప్రశ్నము లడిగికొనుట. విదురుఁడు ధర్మ రాజు శరీరములో నైక్య మగుట }

ధృతరాష్ట్రుఁడు:—నాయనా! యుధిష్ఠిరా! నీవును, నీతమ్ములును, నీపౌరులును, జానపదులును—అందఱును గుశలమా? ఇంకను నిన్నాశ్రయించుకొని జీవించువా రెవ రెవరున్నారో వా రందఱును గుశలము కదా! నీ మంత్రులు, నీ భృత్యులు, నీ గురువులు నెల్లవారును నీ దేశములో నిరాతంకముగ నివసించుచున్నవారు గదా! కుమారా! నీవు పురాతనకాలీనమై, పూర్వరాజర్షి సేవితమైన నడవడిక నవలంబించి నడచుకొనుచున్నావు గదా! న్యాయము తప్పక నీకోశమును (బొక్కసమును) నిండించుచున్నావు గదా! శత్రుమిత్రోదాసీనులయెడ వారివారికిఁ దగినట్లు మెలఁగుచున్నావు గదా! బ్రాహ్మణుల కగ్రహారము లొసఁగి యథార్హముగ వారిని జూచుచున్నావు గదా! నీ శీలముచే నీ పౌరులు, నీ భృత్యులు, నీవారే గాదు నీశత్రువులుగూడ సంతోషించుచున్నవారా? రాజేంద్రా! శ్రద్ధావంతుఁడ వై పితరులను, దేవతలను నుద్దేశించి యాగము లొనరించుచున్నావా? భారతా! అతిథుల కన్నపానము లొసఁగి పూజించుచున్నాఁ

డవా? నీరాజ్యములో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుగూడఁ గుటుంబవృద్ధి గలిగి, నీతిమార్గప్రవర్తకులై స్వధర్మనిరతులై యున్నవారు గదా! నీ పరిపాలనలో స్త్రీలుగాని, బాలురుగాని, వృద్ధులుగాని తమ కిది కొఱంత యని శోచించుటయు, ఇది కావలె నని యొకరిని యాచించుటయు నేదియు లేదుగదా! నీ మందిరమున సౌభాగ్యవతులు లెస్స గౌరవింపఁబడుచున్నవారు గదా! మహారాజా! యీ రాజర్షి వంశము నేఁడు నిన్ను రాజుఁగాఁ బడసి కీర్తివిషయములో నేమియుఁ దగ్గిపోవదు గదా!

అని యిట్లు కుశలప్రశ్నము చేసిన యమ్మహారాజునకు న్యాయవేత్తయు, నేర్పరియు నగు ధర్మరాజు కుశలవార్త లెఱిఁగించి యిట్లనియె. 'మహారాజా! నీ తపస్సు నానాఁటఁ బెంపొందుచున్నది గదా! మిక్కిలి శ్రమము గలుగుట లేదు గదా! ఈ మాయమ్మ శ్రమ మనుకొనక నీకు శుశ్రూషలొనరింపఁ గల్గుచున్నది గదా! ఇట్లొనరించిననాఁడే గదా యీ యమ వనవాసము సేయుచున్నందులకు సాఫల్యము! ఈ మా పెత్తల్లి చలిచేతను, గాడ్పులచేతను, అరణ్యసంచారముచేతను గృశించి, ఘోరతప మాచరించుచు శోచింపదు గదా! ఇంతియ గాక మహావీర్యశాలులు, క్షత్రధర్మ పరాయణులు నగు హతులైన తన కొడుకుల నెల్లప్పుడు తలంచుకొని మమ్మును బాపాచరణులనుగా నపోహపడదు గదా! రాజేంద్రా! విదురుఁ డెక్కడ? ఇక్కడ మాకుఁగనఁబడఁడే? సంజయుఁడు కుశలియేనా? ఇతఁడు నిలుకడ గలిగి తపము

సేయుచున్నవాఁడా ?' అని యడుగ ధృతరాష్ట్రమహారా జిట్లనియె.

కుమారా! విదురుఁడు కుశల మున్నవాఁడు. ఘోరతప శ్చర్య నూనినవాఁడు. వాయుభక్షణమే గాని మతేమియు నాహారము లేదు. చాలఁ గృశించి శల్యామాత్రావశిష్టుఁడై యున్నవాఁడు. అతఁ డీశూన్యారణ్యములో నెప్పుడో యొకప్పు డింకలి బ్రాహ్మణులకుఁ గాన్పించుచుండును.

అని యిట్లు ధృతరాష్ట్రుఁడు చెప్పుచుండఁగా దూరమునఁ గేవలము కృశీభూతుఁడై, జేడలు దాల్చి, యొంటినిండ మలము పూసికొని, దుమ్ముతో నిండి, గుండ్రాయి నోట నిడుకొని దిగంబరుఁడుగా విదురుఁడు పొడకట్టెను. వీఁడు గో! ధర్మాత్ముఁడగు విదురుఁడు. జనమును జూచి తిరిగి పోవు చున్నాఁ డు అని ధృతరాష్ట్రుఁడు చెప్పుచుండఁగనే పొడకట్టినట్లు పొడ కట్టి, యందున్న జనసంఘమును గాంచి, గిరుక్కున వెనుకకుఁ దిరిగి పోవుచుండెను. అప్పుడు,ఆశ్రమమునకు రావలె ననివచ్చి, జనసంఘ ముండుటఁ జూచి, తిరిగి పోవుచున్న యాతనిని గాంచి ధర్మరాజు తానొక్కఁడే యాతనివెంటఁ బరుగెత్తెను. అట నటఁ గనఁబడి కనఁబడక యరణ్యములోఁ బ్రవేశించుచున్న యావిదురుని వెంటఁబడి ధర్మరాజు 'ఓహో! విదురా!! నేనునీకుఁ బ్రియతముఁడ నగు ధర్మనందనుఁడను' అని పెద్దపెట్టునఁ గేక లిడుచుఁబట్టువట్టిపరువెత్త సాగెను.మహాజ్ఞానియైనయవ్విదురుఁ డవ్వనాంతరమున నొకయేకాంతస్థలమునం దొకానొక చెట్టు నానుకొని నిలువఁబడెను. మహాప్రజ్ఞాశాలి యైన యుధిష్ఠి రుఁడు పరువెత్తుకొనుచు విదురుఁ డున్నచోటికిఁ బోయి

యక్కడఁ గేవల మాకారమును బట్టి యూహించుకొనఁ దగి నంతగ మిక్కిలి కృశించి యున్న యావిజ్ఞానమూర్తిని విదురుని గుర్తించి 'నేను యుధిష్ఠిరుఁడ' నని పలికి యాతని యెదుట నిలువఁబడెను. విదురుఁడును సంజ్ఞతో బదులు చెప్పి, తదనంతర మాతనివైపు ఱెప్ప వాల్పక యట్టె చూచెను. చూచి చూచి తనదృష్టి నాతనిదృష్టితోఁ గలిపి యోగనిష్ఠుఁడై తనయవయవముల నాతనియవయవముల లోను—, దనప్రాణముల నాతనిప్రాణములలోను—, దన యింద్రియముల నాతనియింద్రియములలోను — జేర్చి, యోగబలమున నిజతేజముతోఁ బ్రజ్వరిల్లుచు నాతని శరీరములోఁ బ్రవేశించెను. వెంటనే యాతనిశరీరము నిశ్చేతనమయి పోయెను. అప్పుడు ధర్మరాజు, వృక్షము నానుకొని యున్న విదురుని శరీరము నిర్జీవమైన దని కనుఁగొనెను. అప్పుడు తనలో నేదో యెన్నో మడుంగులశక్తి వచ్చి చేరిన ట్లాతఁడు తలంచెను. అప్పుడు మహాతేజోరాశి యగు ధర్మరాజు, వ్యాసభగవానుఁడు మున్ను చెప్పినట్లు తానును విదురుఁడును నొకే ధర్మాంశసంభూతు లను తనపూర్వవృత్తాంతమును, ముం దీవిధమున జరుగు నని (ఉభయులు కలిసిపోవుదురని) చెప్పిన భవిష్యద్వృత్తాంతమును, నట్లు కాఁగల యోగధర్మమును యథార్థము లగుట తలపోసెను. అంతట ధర్మవేత్త యగు ధర్మనందనుఁ డక్కడ విదురునికళేబరమున కగ్నిసంస్కారము చేయవలె నని తలంచెను. ఇంతలో నాకాశమునుండి యొకదివ్యవాణి 'ఓహో! ధర్మరాజా! నీ వీ విదురుని కళేబరమును నీమనసులో ననుకొన్నట్లు లిక్కడ దహింపఁ

దగదు. ఇతఁడు సన్న్యసించినవాఁడు. యతిదేహమున కగ్ని సంస్కారము చేయరా దని సనాతనధర్మము. అగ్ని సంస్కారము లేకున్న నీతని కేగతులు గలుగునో యని శోచింప నక్కఱ లేదు. ఇతఁడు సన్న్యసించినవాఁడు గాన నీతనికి సూర్యలోకప్రాప్తి కలుగఁ గలదు' అని వినిపించెను. ఆదివ్యవాణిని విని ధర్మరా జటనుండి మరలి వచ్చి ధృతరాష్ట్రున కావృత్తాంత మంతయు నెఱిఁగించెను. ఆవార్త విన్నతరువాత దివ్యతేజోవిరాజితుఁ డగు నాధృతరాష్ట్ర మహారాజును—, అం దున్నజను లందఱును—; భీమసేనాదులును—మిక్కిలి యాశ్చర్యపడిరి. అంతట ధృతరాష్ట్రమహారాజు ధర్మరాజును జూచి సంప్రీతితో 'నాయనా! యిదిగో నాయొసఁగెడి యుదకమును, గందమూలములను, ఫలములను బరిగ్రహింపుము. రాజా! లోకములోఁ బురుషుఁ డేయాహార మారగించునో యాతని యింటికి వచ్చిన యతిథియు నట్టియాహారము నే యారగింపవలయు నని గదా ధర్మము!' అని చెప్పెను. ధర్మరాజట్లే యని చెప్పి, యమ్మహారా జొసఁగిన కందమూలఫలములను దమ్ములతోడ భుజించెను. అట్లు వారు ఫల మూల జలాశనులై యచ్చటఁ జెట్లక్రిందఁ బరుండి యారాత్రి నివసించిరి.

ఇది యిరువది యెనిమిదవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము

{ ధర్మరాజు మున్యాశ్రమములను జూచుట.
వ్యాసుఁడు ధృతరాష్ట్రునికడ కేతెంచుట. }

అనంతరము ధృతరాష్ట్రాశ్రమములో శయనించిన పుణ్యాత్ములగు నా ధర్మరాజాదుల కా రాత్రి నక్షత్రములు కళకళలాడుచుండ సుప్రసన్నమై కుశలముగాఁ గడచిపోయెను. ఆ రాత్రి వారలకు ధర్మార్థప్రతిపాదకములైన కొన్ని కథలు విచిత్ర పదప్రయోగములతోడను—, వివిధశ్రుతి మేళనములతోడను—నడచెను. ఆ రాత్రి పాండవు లమూల్యములైన శయనము లుండఁగా వాని నన్నిటిని విడిచి, తమ తల్లి చుట్టును నేలపైఁ బరుండి నిద్రపోయిరి. ఆ రాత్రి మహామనస్కుఁడైన ధృతరాష్ట్రమహారా జేయాహార మారగించెనో, నరవీరులైన పాండవులుగూడ నదే యాహార మారగించి నివసించిరి.

తెల్లవాఱఁగనే ధర్మరాజు తమ్ములతోఁగూడఁ బ్రాతరాహ్నికమును దీర్చుకొని, యచ్చటి మున్యాశ్రమములను జూడఁ దలఁచి, ధృతరాష్ట్రు ననుజ్ఞ వడసి, యంతఃపురజనులును—, భృత్యపరివారజనమును—దోడ రాఁ బురోహితపురస్సరముగాఁ బోయి మనముదీఱ నానందముగా సందర్శించెను. అట నగ్నికుండములు వెలుఁగుచుండెను. అయ్యగ్నికుండములయొద్దఁ గృతస్నానులైన మునీశ్వరులు హోమములు చేయుచుండిరి. అవ్వేదికలచుట్టును వానేయ (కైవడిముస్తె)పుష్పములచే నలంకారము చేయఁబడియుండెను. అగ్నికుండములనుండి ధూమోద్గమములు బయలుదేఱుచుఁ జూడ శోంపుగా నుండెను. ముని

జనులు చుట్టుఁ గూర్చుండియుండఁగా న య్యగ్నివేదికలు సాక్షాత్తు మూర్తీభవించిన బ్రహ్మతేజమువలెఁ గన్పట్టు చుండెను. అయ్యాశ్రమతలమున నటనట బెదరక నిలిచియున్న లేడికదుపులును, నిర్భయము లై హాయిగాఁ బాటలు వాడు చున్న పక్షులగుంపులును, మనోహరముగా నుండెను. ఒకచో నెమిళ్ల కేకలు—, వేఱొకచోఁ గాకులకూఁతలు—, ఇంకొకచో శ్రవణపేయములైన కోవెలల కుఁవూఁ కుఁవూ రావములును—, మఱియొక్కచో బ్రాహ్మణుల వేదపాఠధ్వనులును—, వేఱొక్కచో ఫలమూలాదులు దీసికొనివచ్చు పెద్దలును— ఇట్లాయాశ్రమతలము విన నింపై, చూడ సొంపై యొప్పారుచుండెను.

అయ్యాశ్రమసందర్శనము చేసినతరువాత యుధిష్ఠిర మహారాజు తాపసులకొఱకని తెచ్చియున్న బంగారుకలశములును, రాగిచెంబులును, కృష్ణాజినములును, జిత్రకంబళములును, స్రుక్స్రువములును, కమండలువులును, బంచపాత్రలును, వంటపాత్రలును, వివిధలోహములతోఁ జేయింపఁబడిన పెద్ద పెద్ద గిన్నెలును, జిన్న చిన్న గిన్నెలును, అన్నిటిని మునులకు సమర్పించెను. ఇంతియ గాక యెవ రెవ రే దేది కోరుదురో,యెంతెంత కోరుదురో,యింకను వారి కేదైనఁ గావలసినది యుండెనేనియు నా ద్రవ్యము నంతయు ధర్మాత్ముఁడైన య మ్మహారా జయ్యాశ్రమముచుట్టును దిరిగి వారివారికి సమర్పించి మరల ధృతరాష్ట్రునాశ్రమమునకు వచ్చెను.

అప్పటికి ధృతరాష్ట్రమహారా జాహ్నికక్రియలు నిర్వర్తించుకొని గాంధారితోడ నానందముగఁ గూర్చుండి

యుండెను. ఆ సమీపముననే కుంతీదేవి శిష్టాచారసమన్వితయై శిష్యునివలె గాంధారీధృతరాష్ట్రులకు నమస్కరించుచుండెను. అప్పుడు ధర్మాత్ముఁడైన యుధిష్ఠిరుఁడు వారలను సందర్శించి, తనపేరు చెప్పి ధృతరాష్ట్రునకు నమస్కరించి, యాతఁడు కూర్చుండు మని చెప్ప దర్భాసనముపైఁ గూర్చుండెను. భీమ సేనాదులును ధృతరాష్ట్రునకు నమస్కరించి తదనుజ్ఞవడసి కూర్చుండిరి. వారందఱును చుట్టుఁ గూర్చుండి యుండఁగా నప్పు డా ధృతరాష్ట్రమహారాజు దేవతాపరివేష్టితుఁడైన బృహస్పతివోలె బ్రహ్మతేజోవిరాజితుఁడై ప్రకాశించెను.

వారంద ఱట్లు కూర్చుండి యుండఁగాఁ గురుక్షేత్రనివాసులైన శతయూపాదిమహర్షులు వారినిఁ జూడ నేతెంచిరి. వ్యాసభగవానుఁడును దేవర్షిగణసేవితుఁ డగుచు శిష్యజన సమేతముగా నేతెంచెను. అప్పు డ క్కురుకులోద్వహుఁ డగు ధృతరాష్ట్రుఁడును, గుంతీకుమారుఁడగు ధర్మరాజును—, భీమ సేనాదులును—వారికిఁ బ్రత్యుత్థానముచేసి నమస్కరించిరి. అనంతరము వ్యాసభగవానుఁడు శతయూపాదిమహర్షుల తోడ ధృతరాష్ట్రుని దగ్గఱకు వచ్చి, యాయనను గూర్చుండ నియమించి, తనకై వేసియున్న కృష్ణాజినకుశోత్తర మైన యుత్తమాసనముపైఁ గూర్చుండి, యందఱను "గూర్చుండుఁ" డని చెప్పెను. తదనుజ్ఞ గొని యత్తాపసోత్తము లెల్లరును నెక్కడివా రక్కడఁ గూర్చుండిరి.

ఇది యిరువది తొమ్మిదవ యధ్యాయము.

---

## ఆశ్రమవాసపర్వము

### — వ్యాసుఁడు ధృతరాష్ట్రునిం గుశలప్రశ్నాదు లడుగుట —

మహాత్ములగు పాండవులు కూర్చున్న యనంతరము వ్యాసమహర్షి ధృతరాష్ట్రమహారాజును బిలిచి, యిట్లని ప్రశ్నించెను. 'ధృతరాష్ట్రమహారాజా! నీ తపము చక్కఁగ సాగుచున్నదా! నీ మనసు వనవాసవిషయములోఁ బ్రీతిపడుచున్నది గదా! పుత్రవినాశజనిత మైన శోక మేమియు నీ హృదయమునఁ దాఁకదు గదా! సర్వవిషయక జ్ఞానములును నీకు సుప్రసన్నములై స్ఫురించుచున్నవి గదా! బుద్ధి నిలుకడ చేసికొని యారణ్యకవిధినిఁ జక్కఁగ నిర్వర్తించుచున్నాఁడవు గదా! నీ భార్య గాంధారి పుత్రశోకముచేఁ దిరస్కృత యగుట లేదుగదా! గాంధారి మహాప్రాజ్ఞురాలు, బుద్ధిమతి; ధర్మార్థదర్శిని. ఆగమాపాయతత్త్వజ్ఞ. ఇట్టి యాయమ శోచింపదు గదా! రాజేంద్రా! యే దృఢచిత్తురాలు కన్న కొడుకులను సయితము వదలివేసి గురుశుశ్రూషాపరాయణయై వచ్చెనో, ఆ కుంతీదేవి యభిమానపడక నీకు శుశ్రూషలు సేయుచున్నది గదా! నీవు ధర్మరాజును జూచి యభినందించితివా? భీమార్జున నకుల సహదేవులనుగూడఁ జూచి యూఱడించితివా? వీరినిఁజూచి సంతోషపడుచున్నావు గదా! నీమనసు నిర్మలమే గదా! జ్ఞానము గలుగుచుండఁగా శుద్ధభావుఁడ వగుచుంటివా? భారతా! నిర్వైరత్వము, సత్యము, అక్రోధము అను నీ మూఁడును సమస్త భూతములయందును నుండఁదగిన యుత్తమధర్మములు. వనవాసము చేయుటలో నీ కెట్టి మోహమును—గలుగుట లేదుగదా! వన్యాహారము నార

గించుట గాని, లేకున్న నుపవాస ముండఁగలుగుట గాని యివి నీ స్వాధీనములో నున్నవి గదా! రాజేంద్రా! తెలియును గదా మహాత్ముఁడైన విదురుఁడు పోయిన పోకడగూడ! అతఁడెట్లు జనించెనో యట్లే యమునిలో నైక్యమొందెను. యమధర్మరాజు మాండవ్యమహర్షి శాపమువలన విదురుఁడుగాఁ బుట్టెను. అయ్యమధర్మరాజు మహామేధాసంపన్నుఁడు, మహాయోగి, మహాత్ముఁడు, మహాప్రశస్తమనస్కుఁడు. దేవతలలో బృహస్పతి గాని, రాక్షసులలో శుక్రుఁడు గాని య మ్మహాపురుషునంతటి బుద్ధిసంపన్నులు గారు. అంతటి సనాతన మహాపురుషుఁడు, మాండవ్యమహర్షి తాను బహుచిరకాలమునుండి యార్జించి పెట్టుకొనియున్న తపమును వినియోగించి శపించుటంబట్టి యాతనిచేఁ బరాభూతుఁ డయ్యెను. అట్లు పూర్వము పరాభూతుఁడైన యా యమధర్మరాజు బ్రహ్మదేవుని నియోగానుసారము నావలన మీ తండ్రియగు విచిత్రవీర్యుని కళత్రమునం దుద్భవించెను. కనుక మహారాజా! నీ తమ్ముఁడు విదురుఁడు పురాణపూరుషుఁ డగు దేవదేవుఁడు. ఏ మహామహునిని బండితులు తమ మనసులలో నిలుపుకొని ధ్యానముచేసి యద్దాన 'ధర్మస్వరూపుఁ' డని తెలిసికొనిరో, ఏ పురాణపురుషుఁడు సత్య దాన తపస్సులచేతను, శమ దమములచేతను, అహింసచేతను, సంవర్ధితుఁ డగునో, అమితబుద్ధిప్రకాశము గల యే ప్రాజ్ఞునిచే యోగబలముతోఁ గురురాజగు యుధిష్ఠిరుఁడు 'ధర్ముఁ' డని యుద్భవించెనో, అట్టి పురాణపురుషుఁడే నీ తమ్ముఁ డగు విదురుఁడు. ఆ ధర్ముఁడు పృథివ్యప్తేజో వాయ్వాకాశము లనెడి పంచభూతములవలె

నిహ పరలోకములయం దంతట నున్నవాఁడు. మఱియుసర్వ వ్యాపియై చరాచరప్రపంచమునం దంతటను నిండి, నిర్ముక్త కల్మషులును, సిద్ధులు నగు దేవాదిదేవతలచే దర్శింపఁబడుచు నున్నవాఁడు. ఏ ధర్ముఁ డిట్టివాఁడో యీ ధర్ముఁడే విదురుఁడు. ఆ విదురుఁడే పాండునందనుఁ డగు ధర్మరాజు. అట్టి యీ ధర్మ రాజు నీకు భృత్యునివలె నీకడఁ జూడఁబడుచున్నాఁడు. మహా ప్రజ్ఞాఢ్యుఁడును, మహాత్ముఁడు నగు నీ తమ్ముఁడు విదురుఁడు మహాయోగబలముతో నీ ధర్మజునిపై దృష్టిఁ బఱపి యీ తనిలోఁ బ్రవేశించెను.

ఓ భరతర్షభా! యచిరకాలములోనే నీకుఁ గూడ నేను దివ్యశ్రేయమును గూర్ప నున్నాఁడను. కుమారా! యిప్పుడు నేను నీసంశయములను దీర్చునిమిత్తమై వచ్చితి నని తెలిసి కొనుము. ఇంతకు మున్నే మహర్షులును జేసి యుండని మహా ద్భుతకరమైన తపఃప్రభావమును నేను మీకుఁ జూపెట్టు చున్నాను. కనుక, రాజేంద్రా! నావలన నీ వేమి కావలె నని కోరుదువో చెప్పుము. నావలన దర్శన స్పర్శన శ్రవణములలో నేమైనను గావలె నని యపేక్షింతువేని నేను నీకు సర్వమును సమకూర్చెదను. చెప్పుము.

ఇది ముప్పదియవ యధ్యాయము.

ఆశ్రమవాసపర్వము సమాప్తము.

---

## పుత్రదర్శన పర్వము

గాంధారి, ధృతరాష్ట్రునకు భారతరణహతు
లైన పుత్రాదులను జూపు మని వ్యాసు
లవారి నడుగుట

జనమేజయమహారాజునకు వైశంపాయన మహాముని యిట్లనియె. బ్రహ్మణ్యా! రాజశ్రేష్ఠుఁ డగు ధృతరాష్ట్రమహారాజు భార్యా సమేతముగాఁ గుంతీదేవితోఁ గూడ వనవాసమున కరుగుటయు, ధర్మజ్ఞుఁ డైన విదురుఁడు ధర్మరాజులో నైక్య మొందుటయుఁ, బాండుపుత్రు లందఱును ధృతరాష్ట్రునాశ్రమములో నివసించి యుండుటయుఁ గాఁగా దివ్య తేజోవిరాజితుఁడగు వ్యాసమహర్షి యత్యాశ్చర్యకరమైన తపఃప్రభావమును జూపుదు నని చెప్పెనే! అది యేమో నాకుఁ జెప్పుము. మఱియుఁ, గురురాజగు ధృతరాష్ట్రుఁ డెంతకాలము కుదురుపాటుతో వనవాసము చేసెనో, యుధిష్ఠిరమహారాజు సపరివారముగ నెంతకాల మాశ్రమమండలమున నుండెనో, మహాత్ములగు పాండవు లంతఃపురస్త్రీలతోడను, సైనికులతోడను నెట్టియాహారము దీసికొనుచు నట నుండిరో తెలుపవలసిన దని యడుగ వైశంపాయనమహర్షి యిట్లు చెప్పెను.

జనమేజయమహారాజా! ధర్మరాజు, వనవాసము సేయుచున్న ధృతరాష్ట్రమహారాజును జూడ సైన్యముతోడను, సోదరులతోడను బోయెను గదా! వారు పోయిన మొదటి దినమున వారికి జలము, కందమూలములు, ఫలములు వీనితో భోజనకృత్యము నడిచెను. తరువాత వారు ధృతరాష్ట్రమహారాజుచే ననుజ్ఞాతులై యవ్వనమున వివిధములైన యన్నపాన

ములను భుజించిరి, శయ్యలపైఁ బవ్వళించిరి. అట్లు వా రంతఃపురజనులతోడను, సైన్యములతోడను నొక్కమాస మట హాయిగా నివసించిరి. అటుతరువాత నీకు నే నిదివఱలోఁ జెప్పినట్లుగా నక్కడికి వ్యాసమహర్షి యేతెంచెను. వ్యాస మహర్షి వచ్చిన యనంతరము వారి కందఱకును ధృతరాష్ట్రుని సన్నిధిలో ననేకకథలతోఁ గాలము గడచిపోయెను. మహా తపస్కులగు నారదుఁడు, పర్వతుఁడు, దేవలుఁడు,విశ్వావసుఁడు తుంబురుఁడు, చిత్రసేనుఁడు మొదలుగాఁ గల మహామునులు కొందఱు వ్యాసమహర్షి వెంట నేతెంచిరి. ఆవచ్చిన వారందఱ కును కురురాజగు యుధిష్ఠిరుఁడు ధృతరాష్ట్రునాజ్ఞతో యథా న్యాయముగఁ బూజ చేసెను. యుధిష్ఠిరునివలనఁ బూజఁగొని వారందఱును బవిత్రములైన నెమిలియీఁకల యుత్తమాస నములందుఁ గూర్చుండిరి. అందఱును గూర్చున్నతరువాత మహాప్రజ్ఞాధనుఁ డగు ధృతరాష్ట్రమహారాజు పాండుపుత్ర పరివృతుఁడై గూర్చుండెను. అనంతరము గాంధారియుఁ, గుంతియు, ద్రౌపదియు, సుభద్రయుఁ, దక్కుంగల కౌరవస్త్రీ లును వీరందఱును వెంట వచ్చిన స్త్రీలతోఁగూడఁ గూర్చుం డిరి. అందఱు కూర్చున్నయనంతరము వారికి శ్రేష్ఠములు, దివ్యములు నగు పురాణరాజర్షులయు, దేవతలయు, అసురు లయుఁ గథ లనేకములు నడిచెను. ఇట్లు కథలు ముగిసిన తరు వాత నుత్తమప్రవక్తయు, మహాతేజస్వియు, వేదవిద్వరిష్ఠుఁడు నగు వ్యాసభగవానుఁడు సంతోషించినవాఁడై ప్రజ్ఞాచక్షు ష్కుఁ డగు ధృతరాష్ట్రమహారాజుతో మరల నిట్లు చెప్పెను.

రాజేంద్రా! పుత్రశోకదందహ్యమానమానసు లగు నీ యొక్కయు, గాంధారియొక్కయుఁ, గుంతీ ద్రౌపదుల యొక్కయు హృదయములం దేదుఃఖము గలదో యది నాకు విదిత మైనది. కృష్ణుని సహోదరి యగు సుభద్ర జగదేక వీరుఁడగు కుమారునిచావు దలంచుకొని తద్దుఃఖముతోఁ గుమిలి కృశించి పోవు చున్నసంగతిగూడ నాకు విదితమే. రాజా! యిప్పుడు మీ రంద ఱిచ్చటఁ గూడుదు రని విని, మీయందఱకుఁ గల సంశయములను దొలఁగించు నిమిత్తమై నే నిచటికి వచ్చితిని. ఇదిగో! ఈదేవగంధర్వులు, మహర్షులు—మీ రందఱును జిర కాల సమార్జిత మగు నాతపఃప్రభావమును జూతురు గాక. ఏదీ? నీయభిలాష యేమి? ఏమి యిమ్మందువు? నీకు వర మొసఁగుటకు సంసిద్ధుఁడనై యున్నవాఁడను. చూడు నా తపోబలము!

అని యిట్లు మహాప్రతిభాశాలి యగు వ్యాసభగవానుఁడు చెప్ప నారాజేంద్రుఁ డొక్కముహూర్తకాల మాలోచిం చిన ట్లాలోచించి యి ట్లనియె.

మహాత్మా! నేను ధన్యుఁడ నైతిని. అనుగ్రహింపఁ బడి తిని. నాజన్మము సఫల మయ్యెను. సాధుసత్తములగు మీతో నిప్పుడు కలిసి యుండఁ గంటిని. తపోధనులారా! సాక్షా ద్బ్రహ్మకల్పులగు మీతోఁ గలిసియుండఁ గలుగుటచే నీ శుభ కాలమునందు నా కేవ్వో యుత్తమగతులు గలుగ నున్న వని తెలిసికొనుచున్నాను. మీ దర్శనమువలననే నేను బూతుఁడ నైతిని. నిస్సంశయము. ఇఁక నాకుఁ బరలోకమునం దెట్టి భయమును—లేదు. కాని, యనుకొనినపు డెల్ల నా హృద

యము ఆ దుర్బుద్ధి, ఆమందుఁడు నా కొడుకు చేసిన దుర్నయ ములచే మిక్కిలి పరితపించి పోవుచున్నది. ఆ పాపాత్ముఁ డేపాపము నెఱుఁగని పాండవుల నన్యాయముగా వంచించెను. పుడమి నంతయు గజాశ్వభటసమేతముగా నాశనము చేసి వేసెను. మహాత్ములు, నానా దేశాధీశ్వరులునగు రాజు లెందఱో నాకొడుకునిమిత్తమై వచ్చి మృత్యువువాతఁ బడి పోయిరి. ఆ జరిగిన యుద్ధములో నెందఱు శూరులు! ఆత్మప్రియులైన తలిదండ్రులను, దారపుత్రులను, గడకుఁ బ్రాణములను గూడఁ బరిత్యజించి యమపురికిఁ జేరిరి! మిత్త్రుల నిమిత్తమై కొందఱు హతులైరి! నాకొడుకులు, నామనుమలు — అందఱు నాశనమై పోయిరి! మహాత్మా! వారందఱ గతి యేమి? బ్రహ్మణ్యా! మహాబలుఁడగు భీష్మునిని, శతవృద్ధు, బ్రాహ్మణోత్తముఁడు నగు ద్రోణాచార్యులను జంపించి నా హృదయము మిక్కిలి పరితపించి పోవుచున్నది. పాపిష్ఠుఁడు, మంచి చెడ్డ లెఱుఁగని మూఢుఁడు నగు నాకొడుకు ధరణీసామ్రాజ్యమున కాసించి పండువంటి వంశమును బాడు చేసెను. నాయనా! నానిమిత్తముగా నెంద ఱెంపఱు శూరులు మనః ప్రియులైన దారపుత్రులను, నానాభోగములను, * ఇష్టాపూర్తములను వదలుకొని యమపురి కరిగిరి! ఇది యంతయుఁ దలఁచుకొని రాత్రింబవళ్లును నేను గుమిలి పోవుచున్న వాఁడను. ఇట్లు దుఃఖశోకోపహతుఁడ నగుచు నే నెంతమాత్రమును

---

* యజ్ఞాది కర్మము లిష్టములు. దేవాలయ కూప వనప్రతిష్ఠాదులు పూర్తములు.

మనశ్శాంతి లేకున్నవాఁడను. తండ్రీ ! యీచింతతో నాకు శాంతి యనునది బొత్తిగా దొరకకున్నది.

అని యిట్లారాజర్షి పరిపరివిధములఁ బరిదేవించుచుండ నామాటలు వినుచున్న గాంధారికిఁ గొంచెము మఱపు దగిలిన శోకము మరలఁ గ్రొత్తవాఱెను. అట్లే కుంతికిని, ద్రౌపదికిని, సుభద్రకును, ధృతరాష్ట్రుని కోడండ్రకును నూతనముగా శోక ముప్పతిల్లెను. అప్పుడు కన్నుల కడ్డుగట్టుకొని పతిధర్మము నవలంబించుచున్న గాంధారి, పుత్రశోకము పొంగి పొరలుచుండఁ జేతులు జోడించుకొని మామయగు వ్యాసమహర్షితో నిట్లు చెప్పికొనెను. 'మహానుభావా ! నీకుమారుఁడు (ధృతరాష్ట్రుఁడు) లోకాంతర వాసులైన కొడుకులను జూడ నాసించుచున్నవాఁడని నీ వాయన మనసును నీదివ్యతపఃప్రభావముతో నెఱింగితివి. హతులైన సుతులను దలఁచుకొని దుఃఖించుచున్న యీ రాజున కిప్పటికిఁ బదునాఱు సంవత్సరములు గడిచిపోయినవి. శాంతి దొరక లేదు. మహాత్మా ! పుత్రశోక సమావిష్టుఁడై యెప్పుడును—నిట్టూర్పులు వుచ్చుచు, నీ మహారాజేచ్ఛోటను బడుక గుదిరి పరుండక పరితపించు చున్నవాఁడు. మహానుభావా ! నీవు తపోబలముతో సమస్తములైన లోకాంతరములనేని సృజింప సమర్థుఁడవు. ఇట్టి నీవు లోకాంతరగతులై యున్న యీరాజుతనూజుల నీయనకుఁ జూపఁజాలకుందువా ? ఇదిగో యీకృష్ణ ! ద్రౌపది ! కొడుకులను, బంధువులను బోఁగొట్టుకొని మిక్కిలి శోకించుచున్నది. ఈ యమ నా కందఱు కోడండ్రకంటెను మిక్కిలి ప్రియురాలు. ఇదిగో యీయమ కృష్ణుని చెల్లెలు! భద్రభాషిణి! సుభద్ర!

కొడుకుచావు దలంచుకొని శోకాగ్నిసంతప్త యగుచున్నది. ఇదిగో యీయమ భూరిశ్రవసుని భార్య. పరమసమ్మతురాలు! ఈయమ భర్తను గోల్పోయిన దుఃఖముతో మిక్కిలి పరితపించి పోవుచున్నది. కురువంశోద్వహుఁడును బ్రజ్ఞాశాలియు నగు బాహ్లికుఁ డీయమ మునిమామ. ఈయమమామ యగు సోమదత్తుఁడు తన తండ్రియగు బాహ్లికునితోఁగూడ భారత యుద్ధములో హతుఁ డయ్యె నని యీయమ మిక్కిలి శోచించుచున్నది. శ్రీమంతుఁడగు నీ యీ కుమారుడగు ధృతరాష్ట్రుని కొడుకులు భారతరణములో హతులైనవారున్నారే నూర్వురు! వారిభార్యలే వీరు. అందఱును బోఁగొట్టుకొని దుఃఖశోకములతో మునిఁగి పోయియున్నవారు. వీరిని జూచిన నీరాజునకును, నాకును గడుపు తఱుగుకొని పోవుచున్నది, వీ రాహారమును మానివేసి తీవ్రమైన వ్రతదీక్షతో న న్నుపాసించుచున్నవారు. ఇంకను, ఎవ రెవరు మహాశూరులు, మహాత్ములు, మహారథులునైన మా మామగారు సోమదత్తాదు లుండిరో! మహాత్మా! వారిగతి యేమి? భగవానుఁడా! నీయనుగ్రహమున నీకుమారుఁడును — నీకోడలును — శోకముఁ బాసి కాలము గడపుదురు గాక.

అని యిట్లు గాంధారి చెప్పుచుండఁగా వ్రత నియమములచేఁ గృశానన యై యున్న కుంతి సూర్య భగవానునివలన రహస్యముగా నుదయించిన యాకుమారుని (కర్ణునిని) స్మరించుకొనెను. దూరశ్రవణ దూర దర్శనములు గలిగి వరదుఁడైన యా వ్యాసభగవానుఁడు, కర్ణుని దలంచుకొని దుఃఖాక్రాంతురాలైన కుంతీదేవిని జూచి 'మహాభాగా! నీమనసులో

నేమి గలదో దానిని జెప్పు' మని యడిగెను. అంతఁ గుంతి మామయగు వ్యాసునకు శిరము వంచి నమస్కరించి యప్పుడు తన పూర్వగాథను వివరించుచు సిగ్గుతో నిట్లు చెప్పెను.

ఇది ముప్పది యొకటవ యధ్యాయము.

---

## పుత్త్రదర్శనపర్వము

**— కుంతి వేదవ్యాసునకుఁ గర్ణుని జన్మవృత్తాంత మెఱిఁగించుట —**

కుంతి:—భగవానుఁడా! నాకు నీవు మామవు. నా దైవమునకు దైవమవు. నా దేవాతిదేవుఁడవు. నా చెప్పెడి యథార్థమును వినుము. తపోధనుఁడును, కోపశీలుఁడును, బ్రాహ్మణుఁడు నగు దుర్వాసోమహర్షి యొకప్పుడు మా తండ్రిగారి యింటికి భోజనార్థియై భిక్షకేతెంచెను. అప్పుడు నే నమ్మహామునిని శౌచముచేతను, బరిశుద్ధమనస్కతచేతను నపరాధములు పొసఁగకుండ సేవించి తృప్తిపఱచితిని. కోపింపఁదగిన యవకాశము లెన్నియున్నను, ఆయన నాపై నెప్పుడు గానీ కోపించినవాఁడు గాఁడు. అమ్మహాముని సంతోషించి కృతకృత్యుఁడై నాకు వరము లొసఁగెను. 'అవశ్యముగా నీవు గ్రహింపఁదగు' నని యాయన నాకుఁ జెప్పెను. ఆయనయంత నొక్కి చెప్పినతరువాతఁ గాదన్నచో నేమి శపించునో యను భయముతో నేను సరే యని బదులు చెప్పితిని. అట్లయిన నిట్లగుఁ గాక యని యమ్ముని మరల నిట్లు చెప్పెను. 'కళ్యాణీ! శుభదర్శనా! నీవు ధర్మదేవతకుఁ దల్లివి కాఁగల్గుదువు. నీవే దేవతల నావాహించెదవో యా దేవతలు నీ యధీనములో నుండఁగలరు.' అని చెప్పి యా బ్రాహ్మణముని యంతర్హితుఁ

డయ్యెను. అంతట నాకు మహాశ్చర్య మయ్యెను. ఆ మున్ని చెప్పి పోయినవిషయము నాకు సర్వావస్థలయందును స్మృతి పథమునఁ దగులుచు మఱపునకు రాకుండెను.

అంతట నే నొకనాఁడు మేడపై నుండి సూర్యుఁడుదయించు చుండఁగాఁ జూచి యా ఋషి చెప్పిన మంత్రమును స్మరించి, యద్దానఁ గలుగఁ బోయెడి దోషమును గుర్తెఱుఁగక బాల భావముతో నుంటిని. అంతట సూర్యభగవానుఁడు నా దగ్గ ఱకు వచ్చెను. అప్పు డా సహస్రాంశుఁడు తన దేహమును రెండుభాగములుచేసి యొక యర్ధాంశము నాకాశమున నిలిపి, తక్కిన యర్ధాంశముతో భూలోకమునకు నా దగ్గఱకువచ్చెను. అప్పుడు నేను గడగడ వడఁక సాగితిని. 'నీ కేమి వరము కావల యునో కోరుకో'మ్మని యద్దేవుండు పలికెను. 'ఏమి వలదు. పొండు' అని నేను దలయొగ్గి నమస్కరించి ప్రార్థించితిని. అంతట నయ్యుష్ణకరుఁడు 'నన్నూరక యాహ్వానించినందులకు సహింపను. నిన్నును, నీకు వర మిచ్చిన బ్రాహ్మణమునిని దహించి వేసెద' నని పలికెను. అప్పుడు నేను వృథాగా నిరప రాధి యైన బ్రాహ్మణముని నేల శాపోపహతునిఁ జేయవలె? నని య మ్మునిని శాపమువలన రక్షించు దాననై 'అట్లయిన దేవా! నీవంటి కుమారుఁడు కలుగవలయు' నని కోరితిని. అనంతర మా భానుమంతుఁడు నన్ను మోహపఱచి తన తేజ ముతో నాలో నావేశించి 'నీకుఁ గుమారుఁడు కలుగఁ గలఁ' డని చెప్పి దివమున కరిగెను.

అనంతరము నేను మా తండ్రిగారి యంతర్భవనములో నీ రహస్యమును బయటఁ బడనీయకుండఁ జిత్తమును గాపాడు

కొనుచు రహస్యముగాఁ గర్ణునిఁ గని యా శిశువును నీళ్లలో వదలివేసితిని. బ్రహ్మణ్యమూర్తీ! అ మ్మహర్షి చెప్పినట్లుగా నా సూర్యభగవానుని యనుగ్రహముననే మరల నేను గన్య నైతిని. అలనాఁడు వదలిపెట్టఁబడిన కుమారుఁడు మరల నాకుఁ దెలియఁబడినను గూడ నేను మూఢురాల నై తెలియ నట్లే యుపేక్షించి యుంటిని. మహాత్మా! నిజముగా మీ మన సునకుఁ దోఁచినట్లుగాఁ గర్ణుని విషయములో నా చేసిన యీ ద్రోహము నన్ను దహించి వేయుచున్నది. భగవానుఁడా! పాపమో పుణ్యమో నీ కంతయు వివరించి చెప్పితిని. నే నిప్పు డా కుమారునిఁ జూడఁగోరుచున్నాను. ఈ కోఱిక దీర్చువు గాక. ఈ మహారాజు (ధృతరాష్ట్రుని) హృదయములో నెట్టి కోర్కి యున్నదని నీకుఁ దెలియఁబడెనో యా కోర్కి యిప్పుడే యీయన పొందుఁగాక. అని చెప్పఁగా వేదవిద్వరిష్ఠుఁడగు వ్యాసమహర్షి యి ట్లనియె. 'కుంతీ! నీవు చెప్పిన దంతయు బా గున్నది. ఇది యిట్లు కాఁదగియే యుండి నైనది. ఇందు నీ తప్పేమియు లేదు. నీవు కన్యాత్వమును బొందినదాన వైతివి. దేవత లైశ్వర్యసంపన్ను లగుటచే నొరులదేహములలోఁ బ్రవేశింపఁగల్గుదురు. సంకల్పము, సంభాషణము, సందర్శ నము, సంస్పర్శనము, సంఘర్షణము అను నీ యైదువిధముల చేతను దేవతలు సంతానమును గల్గింతురు. దైవధర్మముచే మానుషధర్మ మెప్పటికిని దూష్యము కాఁజాల దని తెలి యుము. ఇఁక నీ మనోవ్యాకులత తొలఁగుఁ గాక. బలవంతు లకు సర్వమును హితమే యగును. బలవంతులకు సర్వమును

భవిత్రమే యగును. బలవంతులకు సర్వమును ధర్మమే యగును. బలవంతులకు సర్వమును స్వీయముగనే యుండును.

ఇది ముప్పదిరెండవ యధ్యాయము.

---

## పుత్రదర్శన పర్వము

{ వ్యాసమహర్షి గాంధారితో భారతరణమృతులైన వారినిఁ జూపెద నని చెప్పుట }

వ్యాసమహర్షి గాంధారితో:—కళ్యాణీ! గాంధారీ! నీవు నీకుమారులను, సోదరులను, ఇంకను స్వకీయులైనవారి నందఱను జూడఁగలవు. వా రందఱును భార్యా సహితులై కూడి యుండఁగా, రాత్రి నిద్రపోయి లేచిరా యన్నట్లు చూడఁగలవు. కుంతి కర్ణునిని జూడఁ గలదు. సుభద్ర యభిమన్యునిని, ద్రౌపది తన యైదుగురు కుమారులను, దన తండ్రులను, సోదరులను జూడఁ గలరు. ధృతరాష్ట్రమహారాజును—, నీవును, గుంతియు హెచ్చరింపకమున్నే మీకుఁ జనిపోయిన వారినిఁ జూపవలె ననెడి సంకల్పము నామనసులో నుండెను. మీ రా చనిపోయినవారినిగుఱించి శోచింపఁ దగదు. వా రందఱును మహాత్ములు, పురుషశ్రేష్ఠులు. వారు క్షత్రధర్మపరాయణులై యావిధముగా యుద్ధములో హతులైరి. అది దేవతలు తలపెట్టిన కార్యము. అది యట్లు కాఁదగినదైనది. దేవతలు, గంధర్వులు, అప్సరసలు, పిశాచులు, గుహ్యకులు, రాక్షసులు, పుణ్యజనులు, (ఒకజాతి రాక్షసులు) సిద్ధులు, దేవర్షులు వీ రందఱును దమతమయంశములతో భూలోకమునలో నయ్యైవారుగా నవతరించిరి. అట్లవతరించిన దేవతలు, రాక్ష

నులు, దేవర్షులుమున్నగువా రందఱును దమవచ్చిన కార్యము నెఱవేర్చుకొనియావలఁ గురుక్షేత్రయుద్ధములో నిధనము నొందిరి.

కల్యాణీ! వారిలో ధృతరాష్ట్రుఁ డను గంధర్వరాజు నీ భర్త యగు ధృతరాష్ట్రమహారాజుగా భూలోకమున నవతరించెను. మరుద్గణాధిపతి యైన యచ్యుతుఁడు పాండురాజుగా జనించెను. యమధర్మరాజు యుధిష్ఠిరుఁడుగను, విదురుఁడుగను నవతరించెను. కలిపురుషుఁడు దుర్యోధనుఁడుగాఁ బుట్టెను. ద్వాపరపురుషుఁడు శకుని యయ్యెను. రాక్షసులు దుశ్శాసనాదులుగాఁ బుట్టిరి. వాయుదేవుఁడు మహాబలిష్ఠుఁడును, శత్రుసంహారకుఁడు నగు భీమసేనుఁడుగా జన్మించెను. ఆదిమునులైన నరనారాయణులలో నరుఁ డర్జునుఁడుగాను, నారాయణుఁడు కృష్ణుఁడుగాను నవతరించిరి. అశ్వి దేవతలు నకుల సహదేవు లైరి. సూర్యుఁడు లోకప్రకాశమున కర్థాంగము నుంచి తక్కిన యర్థభాగముతోఁ గుంతీదేవియందు సంఘర్షణ జననము నొంది కర్ణుఁడుగాఁ బుట్టెను. అర్జునునితోఁ బగ సాధించుటకై పుట్టిన కర్ణునిని సూర్యునిఁగా భావింపుము. చంద్రుఁడు, ఆర్వురు మహారథులచే హతుఁడైన పాండవ మధ్యముని కుమారుఁ డగు నభిమన్యుఁడుగా నుద్భవించెను. ఆచంద్రుఁడు తాను రెండంశములుగా నయి యొకయంశముతో నభిమన్యుఁడుగాఁ బుట్టినవాఁడు. అగ్నిదేవుఁ డగ్నిహోత్రము నుండి ద్రౌపదితోఁ గూడ నావిర్భవించిన ధృష్టద్యుమ్నుఁడుగా నయ్యెను. రాక్షసుఁడు శిఖండి యయ్యెను. బృహస్పతి ద్రోణాచార్యుఁడుగను, రుద్రుఁ డశ్వత్థామగను, అష్టవసు

వులు భీష్మునిఁడుగను నుదయించిరి. మహాభాగురాలా! యీ ప్రకారముగా నీ యీ దేవత లందఱును, మనుష్యజన్మము లెత్తి లోకోద్ధారకములైన తమ చేయవలసిన శుభకార్యముల నొనరించి, యవి తీఱఁగనే మరల స్వర్గమున కరిగిరి. ఈ చచ్చిన వా రందఱును బరలోకములో నే గతి నున్నవారో యను భయముచే మీ మీ హృదయములలోఁ జిరకాల ముగా నుండి యున్న దుఃఖమును నే నిప్పుడు తొలఁగించి వేసెదను. మీ రందఱును గంగానదికిఁ బదుఁడు. అక్కడ మీరు భారతరణములో మృతులైనవారి నందఱను జూడఁ గలరు.

అని చెప్పిన యా వ్యాసమహర్షి వాక్యములు విని యక్క డివా రందఱును గొప్ప సింహనాదములు సేయుచు గంగానది కరిగిరి. ధృతరాష్ట్రమహారాజును-దన్నుఁ జూడ వచ్చిన పాండు కుమారులతోడను, మంత్రులతోడను, మునీశ్వరులతోడను, గంధర్వులతోడను గంగానది కభిముఖముగా నరిగెను. సము ద్రము పొంగి వచ్చుచున్నట్లు బయలుదేఱిన యా జనసంఘ మంతయుఁ గ్రమక్రమముగా గంగానదిని జేరి వారివారి యిష్టానుసారముగా వారివారి సౌఖ్యమున కనుకూలముగా నివాసముల నేర్పఱచుకొనిరి. ధృతరాష్ట్రమహారాజును — స్త్రీలు, వృద్ధులు తనముందు నడువఁ బాండునందనులతోడ ను, బరిజనులతోడను గూడి యొక యుచితప్రదేశమున నివ సించెను. మృతులైనవారినిఁ జూడవలె నను కుతూహలముతో నెప్పుడు రాత్రి యగునా? యని ప్రతీక్షించుచున్న వారి కందఱకును ఆపగటిపూఁట యొక సంవత్సరమువలెఁ గడచి

పోయెను. అనంతరము సూర్యాస్తమయము కాఁగా వారంద ఱును స్నానముచేసి సాయాహ్నిక కృత్యములను సమా చరించిరి.

ఇది ముప్పది మూఁడవ యధ్యాయము.

---

## పుత్త్రదర్శనపర్వము

**{ వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణ నిహతులైనవారినిఁ జూపుట }**

అనంతరము రాత్రి యగుటయు నచ్చటికి వచ్చి యున్న వారందఱును సాయంకాలాహ్నిక కృత్యములను నెఱవేర్చు కొని తరువాత వ్యాసమహాముని కడకు వచ్చిరి. ధర్మాత్ముఁ డగు ధృతరాష్ట్రుఁడును—శుచియై నిశ్చలచిత్తుఁ డగుచుఁ బాండవులతోడను, ఋషులతోడను వచ్చి కూర్చుండెను. గాంధారీ ప్రముఖ నారీమణు లందఱును వచ్చి కూర్చుండిరి. పౌర జానపదులును వచ్చి వారివారి వయోనుక్రమము నను సరించి కూర్చుండిరి. అంతట బ్రహ్మతేజోవిరాజితుఁడగు వ్యాసమహాముని పవిత్రమైన గంగాజలములోనికి దిగి భారత యుద్ధములోఁ గురుపాండవయోధులలో నేమి, నానాదేశాధి పతులలో నేమి యెవ రెవరు గతించి యుండిరో యమ్మహా భాగుల నందఱ నాహ్వానించెను. ఈ చూడవచ్చిన వారంద ఱును వారిరాకకై మిక్కిలి ప్రతీక్షించుచుండిరి. అమ్మహర్షి యాహ్వానింపఁగనే తదాజ్ఞానుసారము బయలుదేఱిన కురు పాండవసేనల కోలాహలధ్వని నీటిమీఁద బయలుదేఱెను. అంతట నన్నదీజలమునుండి భీష్మ ద్రోణ పురస్సరముగా సైన్య

ములతోఁడ రాజు లందఱును వేలకొలఁదిగా బయలుదేఱిరి. విరాట ద్రుపద మహారాజు లిరువురును బుత్త్రులతోఁడను, సైనికులతోఁడను లేచి వచ్చిరి. ద్రౌపదేయు లేవురును, అభిమన్యుఁడును, ఘటోత్కచుఁడును, కర్ణ శకుని దుర్యోధనులును, దుశ్శాసన ప్రభృతులగు తక్కంగల ధార్తరాష్ట్రులును, జలసంధ జరాసంధ భగదత్త భూరిశ్రవశ్శల శల్యులును, వృషసేనుఁడును, నతని తమ్ముఁడును, దుర్యోధనుని కుమారుఁ డగు లక్ష్మణుఁడును, ధృష్టద్యుమ్నుఁడును, నతని కొడుకును, శిఖండిపుత్త్రు లందఱును, ధృష్టకేతువు, నతని సోదరులును, అచలుఁడు, వృషకుఁడు, అలాయుధుఁ డను రాక్షసుఁడు, బాహ్లీక సోమదత్త చేకితానులు, వీరును—, వీరుగాక యింకను జాలమంది యున్నవారు గాని వారందఱను బ్రత్యేకించి చెప్ప వీలు గాదు గాన వా రందఱును—దివ్యశరీరులై జలమునుండి లేచి వచ్చిరి. ఇదివఱలో నే వీరుని కే వేషము, ఏ ధ్వజము, ఏ వాహనము, ఏ కవచము, ఏ యాయుధము-ఉండెనో యిప్పుడు నా వీరుఁ డయ్యైవానితోఁడనే కాన్పించెను. అందఱును దివ్యమాల్యాంబరధరులై దివ్యకుండల భూషణులై దివ్యాప్సరోజనపరివృతులై నిర్వైరులై నిరహంకారులై విగతక్రోధులై విసృష్టమత్సరులై గంధర్వ లోకచెంపఁ గీర్తింప, వందిబృందము వే ఱొకదండఁ బొగడుచుండ నబ్భాగీరథీ జలమునుండి యుత్థితులై వచ్చిరి. అప్పుడు సత్యవతీతనూజుఁ డగు వ్యాసభగవానుఁడు సంతోషించి తన తపఃప్రభావముచే ధృతరాష్ట్రమహారాజునకు దివ్యదృష్టిం బ్రసాదించెను. అంతట వ్యాసానుగ్రహమున దివ్యదృష్టిని బొందిన ధృత

రాష్ట్రమహారాజును—, దివ్యజ్ఞానసంపన్నయు, యశస్వినియు నగు గాంధారీదేవియు—భారతరణములో నిహతులైన కొడుకులను, దక్కుంగలవారి నందఱను గనులారఁ జూచిరి. ఆ వచ్చిన జను లందఱును నాశ్చర్యచకితులై యచింత్యమును, గగ్గురపాటు గలిగించునదియు నగు నయ్యద్భుత సన్నివేశమును తెప్పార్పక చూచిరి. ఆ వేడుకను జూడ నాత్రపడియుఁ, జూచి యానందించియు, నాశ్చర్యపడుచున్న యా స్త్రీ పురుషుల సన్నివేశము చిత్తరువులో వ్రాయఁబడిన చిత్రమువలెఁ జూడ నొప్పారెను. ధృతరాష్ట్రుఁడును వ్యాసభగవానునిచేఁ బ్రసాదితమైన దివ్యదృష్టితో నావచ్చినవారి నందఱను జూచి మిక్కిలి యానందించెను.

ఇది ముప్పది నాలవ యధ్యాయము.

---

## పుత్రదర్శనపర్వము

—{ వ్యాసునిచే రావింపఁబడిన రణమృతు లంతర్హితు లగుట
వ్యాసుఁడు కౌరవస్త్రీలను బతిసాలోక్యము నొందించుట }—

అనంతర మప్పురుషశ్రేష్ఠులు(వ్యాసునిచేఁగనఁబఱుపఁబడినవారును, జూడవచ్చినవారును.) అందఱును విగతక్రోధులై వినష్టమత్సరులై వినిర్గతకల్మషులై కేవల మతిసాత్త్వికులగు బ్రహ్మర్షుల చందమున నొప్పారి యొండొరులు సమావేశమైరి. అందఱును దేవలోకములో నున్న దేవతల చందమున మహానంద భరితులై యుండిరి. తల్లిదండ్రులతోఁ బుత్త్రులును, భర్తలతో భార్యలును, నన్నదమ్ములతో నన్నదమ్ములును, మిత్త్రులతో మిత్త్రులును గలసి సమావేశమైరి. పాండవు

లన్ననో మేటివిలుకాఁడగు కర్ణునిని, అభిమన్యుని, ద్రౌపదే యులను మహాసంతోషముతోఁ గలసికొనిరి. తర్వాత వారు కర్ణునితోఁ గూడి మిక్కిలి యానందభరితులై సుహృద్భావ ముతో మెలంగిరి. వ్యాసమహాముని యనుగ్రహమున నాక్ష త్రియయోధు లెల్లరును బరస్పరము క్రోధభావము లేమియు లేక ద్వేష ముడిగి చివరకుఁ గేవల సుహృద్భావముతో నుండి పోయిరి. ఈ ప్రకారముగాఁ గురుకులోద్భవులగు కౌరవులును, బాండవులును, దదితరులగు క్షత్రియు లందఱును గురు పుత్ర బంధుజనులతోడం గూడి మహాసంతోష భరితాంతఃకరణు లగుచు నారాత్రి యంతయును విహరించి యా సంతోష ముతోఁ దమ్ము స్వర్గలోకవాసులగు దేవతలనుగాఁ దలంచిరి. పరస్పరము కూడిన యా సమావేశములో నయోధ్యాధవీరులకు శోకము గాని, ప్రాణభయము గాని, పాపభీతి గాని, యను రాగము లేకపోవుట గాని, యపకీర్తి గాని లేదు. అచట సమావేశమైన రాజకాంతలు తమ తండ్రులతోడను, సోద రులతోడను, భర్తలతోడను, బుత్రులతోడను గలసికొని పర మానందము నొంది దుఃఖమును బూర్తిగా వదలిపెట్టిరి. ఆ సమావేశమునకు వచ్చినవారిలోఁ దమతమ కర్మానుసారముగా దేవలోకము నొందినవారు, బ్రహ్మలోకగతులు, వరుణలోక ప్రాప్తులు, గోలోకాశ్రితులు, సూర్యలోకవాసులు, యక్ష రాక్షస పిశాచ లోకములను బొందినవారు, ఉత్తర కురుదేశ వాసులు, ఇంకను గర్మవిశేషములచే విచిత్రగతుల నొందిన వా రెవ రెవ రున్నారో వారందఱును దమ తమకుఁ దగిన యట్టి వయోరూప వేషములతో నచటి కేతెంచిరి. ఈ

ప్రకారముగా సర్వీరులును, సక్కాంతాజనులును నొండొ రులను బిలుచుకొనుచు, నొకరి నొక రాలింగనముచేసికొనుచు నా రాత్రి యంతయును వినోదముగా విహరించి యనంతరము తాము వచ్చినట్లు వెళ్లిపోయిరి. అంతట వ్యాసమహర్షి వారి నందఱను బంపివేసెను. చూచుచున్నవారు చూచుచుండఁగనే యా వచ్చిన వా రందఱును నొక్కక్షణములో నంతర్హితులై పోయిరి. ఆ మహాత్మ్ము లందఱును బావనమైన గంగానదిలో స్నానము చేసి రథ ధ్వజములతోఁ గూడఁ దమ దమ స్థాన ముల కరిగిరి. కొందఱు దేవలోకమునకుఁ బోయిరి. కొందఱు బ్రహ్మలోకమునకుఁ జనిరి. కొందఱు వరుణలోకమున కరిగిరి. కొందఱు కుబేరలోకమున కేఁగిరి. కొందఱు సూర్యలోకమును జేరిరి. కొందఱు రక్షః పిశాచ లోకములకుఁ బోయిరి. మఱి కొంద ఱుత్తరకురుదేశములకుఁ జేరుకొనిరి. విచిత్రగతుల నొందిన యొక కొందఱు తా మేలోకములలో నుండి దేవతల తోడ నేతెంచి యుండిరో వారు మరల నా యా తను తమ స్థానములకు సపరివారముగను, సవాహనముగను వెడలి పోయిరి.

వా రందఱును వెళ్లిపోయిన తరువాత ధర్మశీలుఁడును, మహా తేజస్వియు, కురువంశహితకారియు నగు వ్యాసమహర్షి గంగాజలములలోనుండి విగతభర్తృక లై యున్న యయ్యు త్తమక్షత్రియ కాంతల నందఱను బిలిచి 'మీలో నెవ రెవరు పతిసాలోక్యము నపేక్షింతురో వారు వారు హెచ్చరిక గలిగి శీఘ్రముగా గంగాజలములలో స్నానము చేయుఁడు.' అని చెప్పెను. అమ్మౌని చెప్పిన వాక్యములు విని శ్రద్ధాభక్తులు

గలవారై యవ్వారాంగనలు మామ యగు ధృతరాష్ట్రు నను మతిం గైకొని గంగాజలములలోనికి దిగి స్నానము చేసిరి. వెంటనే యా సాధ్వీమణు లందఱును మనుష్యశరీరములను వీడి తమ భర్తలతోఁ గలిసికొని వెళ్లిపోయిరి. ఈ ప్రకారము క్రమముగా శీలవతులును, బతివ్రతలు నగు నాక్షత్రియాంగన లందఱును గంగాస్నానముచేసి మానుషదేహములు విడిచి తమభర్త లెట్లో యట్లు దివ్యశరీరధారిణు లై దివ్యమాల్యాంబరధరలై శీలగుణసంపన్నలై విగతశ్రమలై విమానములమీఁద భర్తృసాలోక్యమును బొందిరి. ఆ సమావేశకాలమున నెవ రెవరి కే యే కోర్కు లుండెనో, వరదుఁడును, ధర్మవత్సలుఁడు నగు వ్యాసభగవానుఁడు వారివారి కాయా కోర్కులను దీర్చివేసెను. నరులయు, దేవతలయుఁ బునస్సమాగమ మగు నని విని వచ్చిన నానాదేశవాసులగు జను లందఱునుగూడ మిక్కిలి సంతోషించిరి. పరమానంద భరితులైరి. అమ్మహాద్భుత ప్రదర్శనమును జూచి పౌరవు లందఱును భయముగాని, యితరసంకల్పములు గాని యేమియు లేక విగతకల్మషు లై యుండిరి.

ప్రియజనులతోడం గూడిన యీ భారతవీరసమాగమమును వినిన నరుఁ డిహ పరలోకములయం దెల్లప్పుడు నిష్టభోగముల నొందును. ఆతని కిష్టబాంధవ సమాగమ మగును. ఆయాసముగాని, అనారోగ్యముగానీ యుండఁబోదు. మఱియు దీనిని విజ్ఞులగువారికి వినిపించిన ధర్మవిదుత్తముఁ డిహలోకమునఁ గీర్తిని, బరలోకమున నుత్తమగతిని బొందును. స్వాధ్యాయనిరతులు, తపఃపరాయణులు, సదాచార సంపన్నులు, జితేం

క్రియులు, దాన నిర్ధూతకల్మషులు, ఋజువర్తనులు, బాహ్యాభ్యంతర శౌచము గలవారు, శాంతులు, అహింసాపరులు, అనృతదూరులు, ఆస్తికులు, శ్రద్ధాళువులు, ఉత్సాహవంతులు నగు మానవు లీ యద్భుత మైన సమాగమపర్వమును విన్నచోఁ దప్పక సద్గతి నొందుదురు. ఇయ్యద్భుత సమాగమము నెల్లప్పుడును వినుచుండువారల కీ సమావేశ మైనవారు మరలమరల దర్శన మొసఁగుచు, మరల మరల సంస్తూయమాను లగుచు మాటిమాటి కభయ మొసఁగుచు నుందురు.

ఇది ముప్పది యైదవ యధ్యాయము.

---

## పుత్రదర్శన పర్వము

(వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జచ్చిన వారు మరల నవే దేహములతోఁ గనఁ బడెడి విషయమును గుఱించి యాత్మ తత్త్వము నెఱిఁగించుట)

అని వైశంపాయన మహాముని చెప్ప విజ్ఞుఁ డగు జనమేజయమహారాజు తన పితామహు లందఱ రాకపోకలను గుఱించి విని సంతోషించి గతించినవా రందఱును వచ్చినందులకు మహానందభరితుఁడై 'దేహములు వదలి పోయినవారు మరల నవే దేహములతోఁ గనఁబడుటయె' ట్లని యడుగ వ్యాసశిష్యుఁడును, వివేకశూరుఁడు నగు వైశంపాయనుఁడు గంభీరార్థగుంభనముగా నారాజేంద్రున కి ట్లని చెప్పెను.

జనమేజయమహారాజా ! సర్వులకును (కర్మము లొనరించు దేవాసుర మనుష్యుల కందఱకును) దమ చేసికొనిన కర్మ

ములు ఫలము నీయక నశింపవు. శరీరములు కర్మజములు, అనఁగాఁ గర్మమువలనఁ బుట్టినవి. ఆకారములుగూడ నట్టి వియే. మహాభూతములు (అనఁగా హృదయాకాశస్థిత పిత్రా దులు.) నిత్యములు. మహాభూతములు సమస్తభూతాధిపతి యైన యీశ్వరుని నాశ్రయించి యుండునవి గాన నిత్యము లైనవి. (అనఁగా మనదేహములకంటె శాశ్వతములు గానఁ దదపేక్షతో నిత్యము లనుట.) అట్టిమహాభూతముల నిత్యశరీ రముల కనిత్యశరీరముతోడి తాదాత్మ్యసంబంధము సంసార దశయందుఁ గలుగుచున్నది. కర్మక్షయము కాఁగానే యనిత్య శరీరములు నశించినను వానితోడి సంబంధముతో నిత్యశరీర ములు మాత్రము నశింపవు. కావునఁ గర్మజములైన దేహ ములు నశించినప్పటికిని గర్మజములు గాని హృదయాకాశస్థ పిత్రాదిదేహములు నశింపవు; గావున గతించినవారు మరలఁ దద్రూపముతోడనే కనఁబడుట కవకాశము గలుగుచున్నది. నివృత్తిరూపమైన కర్మాచరణమువలన ఆత్మ (జీవుఁడు) నిత్యుఁ డగుచున్నాఁడు. అట్టి కర్మమువలని ఫలప్రాప్తియు శ్రేష్ఠ మగుచున్నది. అనఁగా నివృత్తిరూపకర్మాచరణమువలన మోక్షఫలము గలుగుచున్న దని భావము. ప్రవృత్తిరూప కర్మాచరణమువలన జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించు చున్నాఁడు. అట్టి కర్మసంబంధము గలిగినను క్షేత్రజ్ఞుఁడు (జీవుఁడు) తత్కర్మ ఫలభూతము లైన సుఖదుఃఖాదులచే నెట్టివికారమును బొందఁడు. ఆత్మ (అనఁగా క్షేత్రజ్ఞుఁడు.) దర్పణాదులయందుఁ బ్రతిబింబముచందమున సమస్తభూత దేహములయందును నంతర్యామియై యుండును. దర్పణాదుల

యందలి మలినత్వాది ధర్మములు ప్రతిబింబములయందుఁ గానవచ్చినట్లు క్షేత్ర (శరీర) ధర్మములు క్షేత్రజ్ఞునియందు (జీవునియందు) ఉన్నట్లుగాఁ దోఁచును. దర్పణాదులు నశించి నప్పుడు తత్ప్రతిఫలితమైన ప్రతిబింబము నశించినను, ఆ ప్రతి బింబమునకు మూలభూత మైన బింబమునకు నాశము లేనట్లు క్షేత్రములు (శరీరములు) నశించినను క్షేత్రజ్ఞునకు నాశము లేదు. ఆ దేహారంభకమగు ప్రారబ్ధకర్మ మెంతవఱకు నశింప కుండునో, యంతవఱ కా దేహము నిలిచియుండును. ఆ దేహా రంభక మైన ప్రారబ్ధకర్మము నశింపఁగనే క్షేత్రజ్ఞుఁడు (జీవుఁడు) సంచితకర్మమునుండి మఱియొక దేహారంభక మైన ప్రారబ్ధకర్మముతో మఱియొక దేహము నొందుచున్నాఁడు.

భిన్నభిన్నములైన ప్రాణేంద్రియాదు లన్నియు నొకటియై దేహ మగుచున్నది. అట్టి దేహ తాదాత్మ్యముతో దేహమే తా ననియు, దేహనాశముతోఁ దానును నశించువాఁడే యనియు నిట్టి భావము లజ్ఞులైనవారి కుదయించుచున్నవి. విజ్ఞునకన్ననో! దేహేంద్రియాదులకంటెఁ దాను విలక్షణుఁడ ననియు, నిత్యుఁడ ననియు నిట్టి భావములు గలుగుచున్నవి. అనఁగా నజ్ఞులదృష్టి కనిత్యము లని తోఁచినవి విజ్ఞులదృష్టికి నిత్యములుగాఁ దోఁచు నని భావము. అశ్వమారణమును గుఱించి చెప్పిన యశ్వమేధ శ్రుతినిబట్టి శరీరధారుల ప్రాణేం ద్రియాదులు సదా లోకాంతరగతములై యుండు నని స్పష్ట మగుచున్నది. కాన జీవుఁ డుపాధిపరిచ్ఛిన్నుఁడు కాఁడనియు, ఉపాధిపరిచ్ఛిన్నుఁ డని భావించుట యవిద్యాదోష మనియుఁ దాత్పర్యము.

రాజేంద్రా! నీకు సమ్మత మయ్యేనేని నే నొక హిత మును జెప్పుచున్నాను. దేవయానము లనెడి మార్గము లున్న వని యజ్ఞములయందు వినుచుందుము గదా! (అనఁగా నీకు జ్ఞానమున కధికారము చాలదు గనుక నీవు సగుణోపాసనచేసి తన్మూలమునఁ బొందఁదగిన దేవయానమార్గము నాశ్రయింపు మని సూచన.) రాజేంద్రా! నీవు యజ్ఞము లొనరించినపుడు దేవతలు ప్రియమిత్రు లగుదురు. దేవతలు ప్రియమిత్రు లైనచోఁ బ్రాణములను దత్తల్లోకములఁ బొందించుటలో వారు మహాసమర్థు లగుదురు. కావున యజ్ఞము లొనరించిన వారి ప్రాణేంద్రియవర్గమే నిత్య మగును గాని యట్లొనరిం పని వారి ప్రాణేంద్రియవర్గము నిత్యము కాఁజాలదు.

ఈ ప్రకారము పాంచభౌతిక మైన దేహవర్గము, (ఆత్మ) ప్రాణవర్గము నిత్యములు కాఁగా, ఆ దేహవర్గ ప్రాణవర్గములను సాక్షియై చూచుచున్న జీవుఁడును నిత్యుఁడే యగుచున్నాఁడు. ఇట్లు దేహేంద్రియాదులు నిత్యములుః కాఁగా జీవునకు నానా దేహములతోడి సంబంధము కలదని తలఁచుట మూఢత యన వలెను. అట్లు తలఁచువాఁడు మూఢు డగును. ఆ మూఢ త్వముతో వాఁడు పిత్రాదివియోగము తటస్థించినపుడు మిక్కిలి శోచించుచున్నాఁడు. అట్లు భావించి శోచించువాఁడు నా యభి ప్రాయముఃలో నేమియుఁ దెలియని యజ్ఞుఁడగు బాలుఁడనియే. పిత్రాదివియోగము దుఃఖకర మని భావించువాఁడు మున్ముం దుగనే యట్టివారితో సంబంధము వీడుకొనవలెను. నిస్సంగ ముగా నుండినచో నెట్టి సంబంధమును నుండఁబోదు. అట్లుం డినచో వియోగమువలనఁ గలిగెడి దుఃఖ మేమాత్రము

నంటఁబోదు. ఇట్టి జ్ఞాననిష్ఠ కలవారు కొందఱును, లేనివారు కొందఱును నుందురు. ఇట్టి జ్ఞాననిష్ఠను బొందనివాఁడు నిత్యానిత్యవస్తువిచారము చక్కఁగాఁ జేయక, తనకుఁ దెలిసినంతలో దేహేంద్రియసంఘాతము నిత్యమనియు, ఆ దేహేంద్రియసంఘాతమే తాననియుఁ దలఁచి, తత్తాదాత్మ్యాభిమానముతో జనన మరణ ప్రవాహరూప సంసారమును దరింప లేక పడిపోవుచున్నాఁడు. జ్ఞాననిష్ఠ గలవాఁడన్ననో! దేహేంద్రియము లనిత్యము లని, సగుణబ్రహ్మోపాసన చేసి, తన్మూలమున నిర్గుణబ్రహ్మజ్ఞానము నొంది, తదనంతరము మూలాజ్ఞానమునుండి విముక్తుఁడై తరించుచున్నాఁడు. అట్లు తరించినవాఁడు ముక్తుఁడు. అట్టి ముక్తుఁడు మొదట నదర్శనమునుండి (ప్రత్యక్చైతన్యమునుండి) వచ్చి, మరల నదేయదర్శనమును (ఆ ప్రత్యక్చైతన్యమునే) పొందినవాఁ డగుచున్నాఁడు. ముక్తుఁడును, బ్రత్యక్చైతన్యమువలె నింద్రియాగోచరుఁడు గాన నే నతనిని దెలియలేకున్నాను. అతఁడును (నిరవయవబ్రహ్మ మయ్యెఁగానఁ దెలిసికొనెడి యవయవములైన మనఃప్రభృతీంద్రియములు లేకపోవుటచే) నన్నుఁ దెలిసికొనలేఁ డయ్యెను. నేనును నతనివలె నగుటకు నా కంతటి వైరాగ్యము సిద్ధింపలేదు. మానవుఁడు స్వాయత్తుఁడు గాక మనోవాక్కాయములలో దేనిదేనిచేత నే యే కర్మము లాచరించునో, యా యా కర్మఫలము నయ్యావానిచేతనే యనుభవించును. మనస్సుతోఁ జేసినకర్మమునకు మనస్సుతోనే యా

కర్మఫలము ననుభవించును. శరీరముతోఁ జేసిన కర్మమునకు శరీరముతోనే యా కర్మఫలము ననుభవించును.

ఇది ముప్పది యాఱవ యధ్యాయము.

---

## పుత్రదర్శన పర్వము

వ్యాసుఁడు జనమేజయునకుఁ బరీక్షిన్మహారాజును రావించి చూపుట

వైశంపాయనుఁడు జనమేజయునితో:—

ధృతరాష్ట్రమహారాజు (పుట్టంధుఁ డగుటచే) మొదటఁ దన పుత్రులను జూడఁజాలక పోయెను. తరువాత వ్యాసమహర్షి యనుగ్రహమునఁ దనపుత్రుల నందఱను జూడఁ గల్గెను. సకల రాజధర్మములను నెఱిఁగెను. బ్రహ్మజ్ఞానము వడయఁ గల్గెను. బుద్ధిస్థైర్యము నొందెను.

ధృతరాష్ట్రుఁడును, మహాప్రాజ్ఞుఁడైన విదురుఁడును సిద్ధిఁ బొందిరి. వీరిలో విదురుఁడు తపోబలముతో సిద్ధిఁ బొందెను. ధృతరాష్ట్రుఁడు తపోధనుఁడైన వ్యాసమహర్షిని బొంది సిద్ధిఁ బొందెను.

అని చెప్ప జనమేజయమహారాజు 'మునీంద్రా! వ్యాస భగవాను లిందఱ కిన్ని వరము లొసఁగుచున్నవాఁడు గదా! నాకును మాతండ్రిని ఆ వయో రూప వేషములతోఁ జూపె నేని యప్పుడు నీ మాట నమ్మెదను. అట్లు చేసెనేని నాకుఁ బ్రియము చేసిన ట్లగును. నేనును గృతకృత్యుఁడ నగుదును.

కనుక ఋషిసార్వభౌముఁ డగు వ్యాసమహర్షి యనుగ్రహ మున నాకోర్కి ఫలించుఁగాక.

అని యారాజు పలుకుచుండఁగనే తపఃప్రతాప సంపన్నుఁ డును, ధీశాలియు నగు వ్యాసమహర్షి ప్రసన్నుఁడై స్వర్గము నుండి పరీక్షిన్మహారాజును రావించెను. నిజరూపవయోధర్మ ములతో వచ్చిన తండ్రిని బరీక్షిన్మహారాజును జనమేజయుఁ డు చూచెను. ఆతర్వాత మహాత్ముఁడగు శమీక మహర్షియు, ఆయన కుమారుఁడగు శృంగియు, హతులై పోయియున్న తన తండ్రిమంత్రులును రాఁగా వారి నందఱను జూచెను. పిమ్మటఁ బరమసంతుష్టుఁ డై (తాను సర్పయాగదీక్షితుఁ డై యున్న వాఁడు గాన) తండ్రి కవభృథ స్నానము చేయించి, తానును నవభృథస్నానము చేసెను. అనంతరము తనయొద్దకు వచ్చి యున్న 'యాయావర'కులోత్పన్నుఁడును, జరత్కారుమహర్షి కుమారుఁడు నగు ఆస్తీకుఁ డను బ్రాహ్మణోత్తమునిఁ జూచి యిట్లు చెప్పెను. 'ఆస్తీకా! యీయజ్ఞ మనేకాద్భుతప్రదర్శన ములతో వెలయుచున్న దని నాయభిప్రాయము. చూడు. ఇదిగో మాతండ్రి, నాశోకమును బోఁగొట్టెడి మాతండ్రి ప్రత్యక్షముగ వచ్చి యున్నవాఁడు.' అనవుడు ఆస్తీకుఁ డిట్లనియె. కురుకులోత్తమా ! తపోనిధియుఁ, బురాణమహర్షియు నగు వేదవ్యాసమహర్షి యెవ్వానియజ్ఞమున నున్నవాఁడో యట్టివాని కిహ పరలోకములు రెండును నరచేతిలో నున్నవి. పాండుకులోద్ధారకా ! నీవలన విచిత్రమైన కథ వింటిని. నీచేసిన యాగమున సర్పము లన్నియు మీతండ్రిని జూడఁ బోయినవి. (అనఁగాఁ జచ్చి పోయిన వనుట) అందులోఁ దక్షకుఁ డొక్కఁడు

మాత్రము నీసత్యసంధతవలన ముక్తుఁ డయ్యెను. ఋషు లందఱును బూజితు లైరి. మహాత్ముఁడ వనిపించుకొంటివి. పాపనాశక మైన యీ యితిహాసమును విని విస్తృతమైన ధర్మము నార్జించితివి. మహాజన సందర్శనమువలన నీహృదయ గ్రంథి పటాపంచ లయ్యెను. ఎవ్వారు ధర్మస్థాపకులో, యెవ్వారు సద్వృత్తులో, యెవ్వారు సదభిలాషులో, యెవ్వారు దర్శనమాత్రముచేత సర్వపాపములనుండి విముక్తులను జేయుదురో యట్టి పుణ్యపురుషులకు నమస్కారము చేయవలయును.

అని వైశంపాయనమహర్షి చెప్ప విని ధర్మజ్ఞుఁడైన జనమేజయమహారాజమాన్మనిచంద్రుని మఱీమఱి బహుమానించి, పూజించి ధృతరాష్ట్రుని వనవాసకథావృత్తాంత శేషమును వినిపింపు మని యడిగెను.

ఇది ముప్పది యేడవ యధ్యాయము.

---

## పుత్రదర్శన పర్వము

{వ్యాసుని ప్రేరణమున ధృతరాష్ట్రుఁ డంప ధర్మ రాజాదులు హస్తినాపురమునకు మరలివచ్చుట}

జనమేజయుఁడు వైశంపాయనమహర్షితో 'ధృతరాష్ట్ర మహారాజు పుత్రులను, పౌత్రులను, ఇతరసంబంధులను జూచి తరువాత నేమి చేసెను? ధర్మరాజుగూడ నేమి చేసెను?' అని యడుగ వైశంపాయనమహర్షి యిట్లు చెప్పెను.

రాజేంద్రా! రాజర్షి యైన ధృతరాష్ట్రమహారాజు మృతులైన పుత్రాదులను మరలఁ జూచుట యను నియ్యద్భుత

సన్నివేశమును జూచి, శోక మడిగి, గంగాతీరమునుండి మరల నాశ్రమమునకు వచ్చెను. చూడ వచ్చిన యితర జనులును, మహర్షులును ధృతరాష్ట్రుననుమతి తీసికొని తమయిచ్ఛ వచ్చినట్లు వెళ్లిపోయిరి. మహాత్ములైన పాండవు లన్ననో పత్నీ సమేతులై యెక్కువ విస్తారము గాని సైనికులతోఁ గూడి ధృతరాష్ట్ర మహారాజువెంట నాశ్రమమున కేతెంచిరి. ధృత రాష్ట్రమహారా జాశ్రమము చేరినతర్వాత దివ్యజ్ఞానియు, లోకపూజితుఁడు నగు వేదవ్యాసమహర్షి ధృతరాష్ట్రుని దగ్గ ఱకు వచ్చి యిట్లు చెప్పెను.

ధృతరాష్ట్రా! మహాబాహూ! కౌరవనందనా! జ్ఞాన వృద్ధులును, బుణ్యకర్ములు నైన మహర్షుల కథలను విన్నావు. సత్కులసంభూతులును, వేదవేదాంగవేత్తలును, ధర్మజ్ఞులును, ప్రవక్తలు నగు పురాణ పురుషుల కథలను వినియున్నావు. కావున నీవు నీ మనసును శోకవశము గానీకుము. దైవకృతము నకుఁ బ్రాజ్ఞుఁ డెప్పుడును వ్యసనపడఁడు. దివ్యజ్ఞానసంపన్నుఁ డైన నారదమహర్షివలన దేవరహస్యములను వినియున్నావు. భారతరణమున నిహతులైన పుత్ర మిత్త్రాదు లెల్లరును శస్త్ర పూతమైన సద్గతిని (వీరస్వర్గమును) బొంది యున్నారు. నీవు చూచి యుంటివిగదా! నీ కుమారులను! వా రావిధము గానే నిరంతరము కామవిహారులై యుందురు. బుద్ధిమంతుఁ డగు ధర్మరాజు—తమ్ములు, మిత్రులు, భార్య వీరలతోఁ గూడి ని న్ననుసరించుచున్న వాఁడు. ఇతని నిఁకఁ బంపివేయుము. ఇతఁడు తన రాజ్యమున కరుగుఁగాక. ఇట్లని నీ వాజ్ఞ చేసి చెప్పుము. వా రిక్కడ తపోవనమునకు వచ్చి యొక మాసము

నకుఁ బైఁగా నయినది. రాజ్యమును మహాజాగ్రత్తగా నిరంతరము రక్షించుకోవలసి యుండును. రాజ్య మనఁగాఁ బెక్కుమంది శత్రువులు గలదిగా నుండును సుమా !'

అని బహుదీర్ఘాలోచనపరుఁ డగు వ్యాసమహాముని చెప్ప, ధృతరాష్ట్రమహారాజు యుధిష్ఠిరునిఁ బిలిచి నెమ్మదిగా నిట్లు చెప్పెను.

అజ్ఞాతశత్రూ ! నీకు శుభ మగును. నీవు, నీ తమ్ములతోఁ గూడి నా చెప్పెడి మాట వినుము. నాయనా ! నీ యొనరించిన యాదరాతిశయమున మ మ్మంటియున్న పుత్త్రశోకము మ మ్మెక్కుడు బాధించినది గాదు. నీవు నాకు వలసిన ప్రియముల నన్నిఁటిని సమకూర్చుచుఁ, బరిపాలకుఁడ వై న న్నొక కంటఁ గనిపెట్టి యుండుటచే నీ మూలమున నేను, దొల్లి హస్తినాపురమున నున్నట్లుగ నే యిక్కడను మహానందము ననుభవించుచున్నాను. నీ వలన నేను బుత్త్రులను గన్న ఫలమును గంటిని. కావున నీయందు నా కెక్కుడు ప్రీతి. నీపై నాకుఁ గోపము లేదు. ఇఁక నీవు పురమున కరుగుము. ఆలస్యము చేయవలదు. నీ విక్కడ నుండుటనుబట్టి నా తపము సరిగా సాగుట లేదు. తపోనియుక్త మైన యీ శరీరమును నిన్నుఁ జూచి మరల ధారణ చేసితిని. ఇదిగో యీ నీ తల్లు లిరువురు రాలిన పండుటాకులుమాత్ర మాహారముగాఁ గొనుచు నాతోపాటు సమానవ్రత మూని యున్నవారు. కనుక వీ రింక నెంతోకాలము జీవింపఁజాలరు. వ్యాసభగవానుని తపఃప్రభావముచేతను, మీ రిచటికి వచ్చుటనుబట్టియు లోకాంతరగతు లైన దుర్యోధనాదులను జూచి చిరకాలమునకు నా జీవితము

నకు సాఫల్యము గంటిని. ఇఁక నే నతితీవ్రతపశ్చర్యకుఁ గడం గెదను. నా కనుజ్ఞ యిమ్ము. ఇప్పుడు కీర్తియుఁ, గులమును, మా కొనఁగవలసిన పిండదానమును—ఇవి యన్నియు నీపై నాధారపడియున్నవి. రేపుగాని నేఁడు గాని నీవు బయలు దేఱుము. ఎంతమాత్రము—ఆలసింప వలదు. భరతర్షభా! నీ వనేకపర్యాయములు రాజనీతిని విని యున్నావు గదా! ఇంతకంటె నేఁ జెప్పవలసిన దేమున్నది? ఇంతవఱకుఁ జెప్పినదే చాలును.

అని చెప్పిన ధృతరాష్ట్రమహారాజునకు ధర్మరాజిట్లనియె. 'ధర్మజ్ఞా! నిరపరాధుఁడనైన నన్ను నీవు వదలివేయఁజనదు. నా తమ్ములు, నా యనుచరులు వీ రందఱును యథేష్టముగాఁ బోనీ. నేను మాత్ర మిక్కడనే నిలిచి యుండి నియతవ్రతుఁ డనై నీకును, మా తల్లులకును సేవచేసికొను చుందును.' అని చెప్పుచున్న ధర్మరాజును జూచి గాంధారి యిట్లు చెప్పెను. "కుమారా! ఇట్లు గాదు. విను. కురుకులము నీ యధీనములో నున్నది. మీ పెత్తండ్రికిని, నాకును వేయవలసిన పిండము నీ చేతిలో నున్నది. కనుక నిఁక నీవు వెళ్లక తప్పదు. ఇంత మాత్రముతోనే చాలును. మే మందఱము పూజితుల మైతిమి. పితృవాక్యమును బరిపాలించి మీ పెదతండ్రి చెప్పి నట్లు చేయుము.' అని గాంధారి చెప్ప స్నేహమున నుప్పతిల్లి వెల్లి విరిసిన కన్నీళ్లను దుడుచుకొనుచు ధర్మరాజు తనతల్లిని జూచి యిట్లనియె. 'అమ్మా! మహారాజును—, గాంధారియు నన్ను వదలి వేసినవారు. నిన్ను విడిచి పోవుటకు నామన సొప్ప కున్నది. ఇఁక దుఃఖితుఁడనై నే నెట్లు పోఁగల్గుదును? ఓ ధర్మ

చారిణీ! నీకుఁ దపోవిఘ్నము సేయుటకు నే నెంతమాత్ర మును నుత్సహింపను. తపస్సుకంటె నుత్కృష్టమైనది మఱే మున్నది? తపస్సుచే మహద్వస్తువు నొందవచ్చును. అమ్మా! నాకును మునుపటివలె రాజ్యమునం దంత యిచ్ఛ లేదు. ఎన్ని విధములచేఁ జూచినను నా మనస్సు తపస్సునందే యను రక్తమైయున్నయది. ఇప్పు డీ భూమి యంతయు నాకంటికి శూన్యముగాఁ దోఁచుచున్నది. ఏమాత్రమును నాకుఁ బ్రియ ముగాఁ దోఁచుట లేదు. మన బంధువర్గ మంతయు నశించి పోయెను. మనబలము వెనుకటివలెలేదు. పాంచాలు రందఱు నూరు పేరు లేకుండ నాశనమై పోయినారు. కాకున్న నేఁడు వారి కులమున నాఁడుపిల్లలు మాత్రము మిగిలియుందురు. అట్లుగాక వారి వంశాంకుర మొకపిల్లవాఁడేమైన నున్నాఁ డేమోయని గాలించి పాలించి చూచినను నెవ్వఁడును గాన రాలేదు. రణరంగములో ద్రోణాచార్యునిచే వారందఱును భస్మమైపోయిరి. ద్రోణాచార్యులచేఁ జావక మిగిలి యున్నవా రుండఁగా వారి నయ్యాచార్యపుత్త్రుఁ డశ్వత్థామ నిశీథసమ యమున నూరుపేరు లేకుండ హతమార్చెను. చేదిరాజులు, మత్స్యరాజు లన్ననో నాఁ డెన్నఁడో చూచినదే గాని నేఁడు కానఁబడరు. ఇఁక మిగిలియున్న దొక యాదవసంఘము మాత్రమే. ఇఁక వారిని జూచుకొని ధర్మసంపాదనమునకై యుండఁ దలఁచుచున్నాను. అర్థసంపాదనకుఁ గాదు. అమ్మా! మ మ్మందఱను జల్లనిచూపులతోఁ జూడుము. ఇఁక నీదర్శ నము మాకు దుర్లభము. ఇఁక మా పెత్తండ్రిగారు తీవ్రతప శ్చర్యకుఁ బూనుదురఁట.

అని చెప్పుచుండఁగా విని మహాబాహుఁడైన సహదేవుఁడు బాష్పాకులితనేత్రుఁడై యన్నయగు యుధిష్ఠిరున కిట్లనియె. 'అన్నయ్యా! నేను మన యమ్మను విడిచివచ్చుట కుత్సహింపను. నీవు త్వరగా వెళ్లుము. నే నిట నుండి తపస్సు చేసికొనుచుందును. ఇక్కడనే తపస్సు చేసికొనుచు నీ కళేబరమును శోషింపఁ జేయుదును. నేను మన పెత్తండ్రిగారికిని, మన తల్లు లిరువురకును బాదసేవచేయుచుండ ననురక్తుఁడనై యున్నవాఁడను.' అని చెప్పుచుండఁగాఁ గుంతి యాతనిని గాఁగిటఁ గ్రుచ్చి 'నాయనా! కుమారా! వెళ్లు. నీ విటు చెప్పకు. నామాట విను. మీకు వేదములు శుభదాయకములగును. పుత్రులారా! మీ రింక స్వస్థచిత్తులరు గండు. ఇట్లే మీ రుండినకొలఁదిని మా తపస్సున కాటంకము గలుగును. నేను మీ స్నేహపాశముచే బద్ధురాలనై యుత్తమతపమునుండి పతిత నగుదును. కనుక నాయనా! సహదేవా! నీ విక్కడ నుండవలదు. పొమ్ము. మా తండ్రీ! ఋఁక మేము జీవించునదిగూడ నెంతోకాలము లేదు. అతి స్వల్పకాలమే." అని యీ ప్రకారముగాఁ గుంతి యనేకవిధములఁజెప్పి, సహదేవునియొక్కయు, ధర్మరాజుయొక్కయు మనస్సును జలింపకుండఁ జేసివేసెను. అంతట నయ్యుధిష్ఠిరాదులు తలిదండ్రుల వలన సెలవు గైకొనుటకై ప్రార్థించిరి. ధర్మరాజు, తండ్రీ! నీచే మే మభినందితుల మైతిమి. పురమున కరుగ ననుజ్ఞాతులమైతిమి. మా కల్మషము లన్నియుఁ దొలంగెను. ఇఁక మేము కుశలముగాఁ బురమునకుఁ బోయివత్తుము. అని చెప్ప నా రాజర్షియు నాతనిని జయాశీర్వాదములతోఁ

బూజించి పోయి రమ్మని యనుజ్ఞ యొసఁగి పిమ్మట బలవదగ్రేసరుఁడైన భీమసేను నూఱడంబలికెను. వీర్యశాలియు, మేధావియు నగు నబ్భీమసేనుఁడును లెస్స నాతని వీడ్కోలు వడసెను. అనంతరము ధృతరాష్ట్రుఁ డర్జున నకుల సహదేవులను గౌఁగిటఁ జేర్చి, గ్రుచ్చి, యభినందించి, పోయిరా ననుజ్ఞ యొసఁగెను. పిమ్మట న య్యుధిష్ఠిరాదులు గాంధారివలన ననుజ్ఞ వడసి, యామెకు నమస్కరించి, తమతల్లి తమ్ము శిరము మూర్కొని, యాలింగనము చేసికొని, పోయి రండని చెప్ప ధృతరాష్ట్రునకుఁ బ్రదక్షిణనమస్కారము చేసిరి. వారా ప్రదక్షిణము సేయునపుడు పాలుత్రాగు పిల్లలను బాలు త్రాగకుండ నివారించినపుడు వారు మాటిమాటికిఁ జూచుచున్నట్లు మరల మరలఁ జూచుచుఁ జుట్టు తిరిగిరి. ద్రౌపది మొదలుగాఁ గల కౌరవస్త్రీ లందఱును న్యాయప్రకారము మామగారియెడ నడుచుకొనవలసిన మర్యాదతో నడుచుకొని, యిద్దఱత్తల చేతను గౌఁగిటఁ జేర్పఁబడి యభినందితలై, కర్తవ్య ముపదేశింపఁబడి, యనుజ్ఞగొని, భర్తలతోఁగూడ బయలుదేఱిరి.

అంతట 'సిద్ధపఱుపుఁ' డనురథాశ్వచోదకుల కంఠనాదము లుప్పతిల్లెను. ఒంటెల యఱపులు, గుఱ్ఱముల సకిలింతలు బయలుదేఱెను. అనంతరము యుధిష్ఠిరమహారాజు భార్యా బంధు జన సమేతముగా సైన్యముతోడ హస్తినాపురమునకుఁ దిరిగి వచ్చెను.

ఇది ముప్పది యెనిమిదవ యధ్యాయము.

పుత్రదర్శన పర్వము సమాప్తము.

---

## నారదాగమనపర్వము

{ నారదుఁడు ధృతరాష్ట్రాదుల మరణవార్త ధర్మరాజున కెఱిఁగించుట. }

పాండవులు ధృతరాష్ట్రు నాశ్రమమునుండి తిరిగి హస్తినాపురమునకు వచ్చిన తరువాత నొకప్పుడు దేవర్షియైన నారదుఁడు స్వేచ్ఛగా వారికడ కేతెంచెను. కౌరవేంద్రుఁ డగు యుధిష్ఠిరమహారా జమ్మహాముని కెదురు వోయి, పూజించి, పిలుచుకొనివచ్చి, సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి, య మ్మహాత్ముఁడు సేదఁ దేఱినంత మృదుమధుర వాక్యములతో నాతని కిట్లనియె. 'మహానుభావా! యెంతకాలమునకు భగవానుని దర్శన భాగ్యము! తమకుఁ గుశలమే గదా! శుభాగమనమే గదా! మునిచంద్రులచే నే యే దేశములు చూడఁబడెనో! న న్నేమి చేయు మందురు? నా కేమి సెలవు? చెప్పుఁడు. బ్రహ్మణ్యా! నీవు బ్రాహ్మణోత్తముఁడవు. అగుటచే మాకు మిక్కిలి ప్రియాతిథివి.' అన విని నారదమహర్షి యిట్లనియె. 'నృపాలా! నా రాకకు వేఱు కారణ మేమున్నది? నిన్నుఁ జూచి చాలకాల మైనది గనుక నిన్నుఁ జూడవలయుననియే తపోవనమునుండి యిచటికి వచ్చితిని. నేను పెక్కు తీర్థములను జూచితిని. గంగానదినిగూడ దర్శించితిని.' అని చెప్పెను. అంతట యుధిష్ఠిరుఁడు 'మునీంద్రా! గంగాతీరనివాసులైన కొందఱు, మహాత్ముఁడగు ధృతరాష్ట్రుఁడు తీవ్రతపము నొనరించుచున్నాఁ డని చెప్పుచున్నారు. మీ రటకుఁ బోయినపు డక్కురుకుల దీపకుఁడు కనఁబడెనా? కుశలమున నున్నవాఁడు గదా! గాంధారియు, మాతల్లి కుంతియు, సూతపుత్రుఁడగు

సంజయుఁడును నిపు డెట్లున్నవారు? మా తండ్రి యెట్లున్న వాఁడు? మహాత్మా! తా మాయనను జూచి యుండినఁ జెప్పఁడు. వినఁ గుతూహలపడియెదను.' అని యడుగ నారదుఁ డిట్లనియె. 'మహారాజా! సావధానచిత్తుఁడవై వినుము. నేను బోయినపు డా తపోవనములో నేను విన్నదియుఁ, జూచి నదియు నున్న దున్నట్లుగా జరిగినది చెప్పెదను. వినుము. కురునందనా! మీ రందఱు న త్తపోవనమునుండి మరలి వచ్చిన తరువాత మీ తండ్రి కుంతీ గాంధారీ సమేతుఁడై సూతపుత్రుఁడైన సంజయునితోఁ గూడి, యాజకు లగ్ని హోత్రములు దీసికొని వెంట రాఁ గురుక్షేత్రమునుండి గంగా ద్వారమున కరిగెను. అక్కడఁ దపోధనుఁడైన మీ తండ్రి మహాతీవ్రమైన తపస్సునకుఁ బూని నోటినిండ గుండ్రాయి నుంచు కొని, కేవల వాయుభక్షణుఁడై మౌనవ్రతుఁడై తప మొన రించెను. అట్లు దుష్కరమగు తప మొనరించుచుండ నందలి మును లందఱును వచ్చి య త్తపోనిధిని బూజించుచుండిరి. ఆతఁడు చర్మము, ఎముకలు మాత్రము శేషించి యాఱు మాసము లుండెను. గాంధారి జలమును మాత్రమే యాహా రముగాఁ గొనుచుండెను. కుంతియు నెల కొక్కమాఱు భుజిం చుచు మాసోపవాసదీక్ష సలిపెను. సంజయుఁ డాఱుదినముల కొకమాఱు భుజించుచుండెను. అవ్వనమం దగ్నిహోత్ర ములు దెచ్చిన యాజకులు ధృతరాష్ట్రమహారా జెదుట నుండి నపుడును, లేనపుడును యథావిధిగ నగ్నిహోత్రములను వ్రేల్చుచుండిరి. అ మ్మహారాజును—నొకచో నివాస మని లేకుండ వనమం దంతటను దిరుగుచుండెను. మీ తల్లు లిరువు

రును, సంజయుఁడును నాయనవెంటఁ బోవుచుండిరి. హెచ్చు తగ్గు ప్రదేశములలో సంజయుఁ డాతనిని మెలమెల్లగాఁ దీసి కొని పోవుచుండెను. పూజ్యురాలగు గాంధారికిఁ (కన్నులకు గుడ్డ కట్టుకొన్నది గనుక) గుంతీదేవి కన్నయ్యెను.

ఇట్లుండ నొకప్పు డమ్మహారాజు గంగానదిలో స్నానము చేసి తిరిగి యాశ్రమమునకు వెళ్లుచుండెను. అప్పు డొక పెను గాలి బయలు దేఱెను. అంతలో నొక గొప్ప దావాగ్ని యుప్పతిల్లి వనము నలువైపుల ముట్టుకొని దహింపసాగెను. లేళ్లకదుపులు, ఏనుఁగు గుంపులు, పాముల పటలములు ఒక ప్రక్కఁ గాలి, పరువులు వాఱి నీటి మడువులలోఁ బడుచుం డెను. ఒక్కక్షణములో వనమంతయు భస్మావశేష మయ్యెను. ఇట్లు మహత్తరమైన దుఃఖము ప్రాప్తింపఁగాఁ జాలకాల మునుండి నిరాహారుఁడై యుండుటచే సత్తువ తఱిఁగి కదల లేకున్న మీతండ్రియు, మిక్కిలి శుష్కించి యున్న మీ తల్లులును నందుండి తప్పించుకొని పోఁజాలక పోయిరి. జయ శీలురలో నగ్రగణ్యుఁ డగు నారాజేంద్రుఁ డంత కంత కాకాలుచిచ్చు డగ్గఱుట యెఱిఁగి సంజయునితో నిట్లనియె. 'సంజయా! నీవు పొమ్ము. అగ్నిభయము లేని చోటికి కెక్కడి కేనియుఁ బొమ్ము. మే మీ యగ్నిలోఁ బడి యుత్తమగతి నందు దుము'. అని చెప్ప విని మిక్కిలి కళవళపాటు నొంది సంజయుఁ డాతని కుచితోక్తుల నిట్లనియె. 'మహారాజా! వృథాగా మీ రిట నగ్నిపాలై మరణించుట యుచితము గాదు. ఈదావాగ్ని నుండి మిమ్ముఁ దప్పించుటకు నా కేమియు నుపాయము దోఁచుటలేదు. ఇప్పు డనంతరకరణీయ మేమో యది నాకుఁ

జెప్పుము’ అని తహతహఁ జెందుచుండ నా రాజన్యుఁ డాతని కిట్లు చెప్పెను ‘సంజయా! బుద్ధి పూర్వకముగా నిల్లు విడిచి వచ్చిన మాకీమరణ మప్రియము గాదు. తాపసుల కగ్నియో, జలమో, వాయువో మరణహేతువులు కావలయును. అట్టి మరణమే వారికిఁ బ్రశస్తము. కనుక నీవు పొమ్ము. ఆలసింప కుము’ అని చెప్పి తనమనస్సును గుదురుపఱచుకొని తూర్పు ముఖముగాఁ గూర్చుండెను. గాంధారియుఁ, గుంతియు నట్లే కూర్చుండిరి. వారినిశ్చయమును గాంచి సంజయుఁడు వారికిఁ బ్రదక్షిణము చేసి బుద్ధిశాలి యగుట నమ్మహారాజుతో “మహారాజా! ఆత్మానుసంధానము చేసి కొ” మ్మని చెప్పెను. వ్యాసమహాముని యనుగ్రహమున నుద్భవించి గొప్పప్రాజ్ఞత సంపాదించుకొనిన వాఁడు గావున నారాజర్షి సంజయుఁడు చెప్పినట్లు చేసెను. వెంటనే యింద్రియనిరోధము గావించి, కట్టెవలె నయిపోయెను. అంతట నమ్మహారాజును—గాంధారియు—మాతల్లి పృథయు దావాగ్నిచే నలముకొనఁబడిరి. ప్రాజ్ఞశ్రేష్ఠుఁ డగు సంజయుఁడు మాత్ర మా కాఱుచిచ్చు నుండి తప్పించుకొని గంగాతీరముఁ జేరి, యట మునీశ్వరులు తన్నుఁ బరివేష్టింప వారి కీవిషయము చెప్పి, వారిదగ్గఱ సెలవు దీసికొని హిమవత్పర్వతమునకు వెళ్లిపోయెను. గంగాతీరము నందు సంజయుఁ డీసమాచారము మునులతోఁ జెప్పునపుడు నే నాతనిని జూచితిని. ధర్మరాజా! యీప్రకారముగా మహా మనస్కుఁ డగు నక్కురురాజును—, మాతల్లులు కుంతీ గాంధారులును నిధనము నొందిరి. నే నట స్వేచ్ఛగాఁ దిరుగుచు నారాజేంద్రునియు, నద్దేవేరులయుఁ గళేబరములను జూచితిని.

అంతట నత్తపోవనమందలి తపోధను లెల్లరు నేతెంచి యారాజేంద్రుని నిష్ఠను విని, యాతని కగుగతులను గుఱించి యేమాత్రమును వగవరైరి. రాజేంద్రా! యీ వృత్తాంత మంతయు నే నక్కడ వింటిని. ఆ రాజన్యుఁడును, నద్దేవేరు లును గాఱుచిచ్చునఁ బడి కాలి పోయిరే యని నీ వేమియు శోకింపఁ జనదు. అగ్నిసంయోగమునంజేసి వారు దేవ లోకము నధిగమించిరి.

నారదమహర్షి యెఱింగించిన ధృతరాష్ట్రుని మరణవార్త విన్నతరువాతఁ బాండవు లందఱకును దుర్భరమైన శోక ముప్ప తిల్లెను. అంతఃపురములో నాఁడువారి యార్తనాద మట్టి పెద్ద దయ్యెను. ధృతరాష్ట్ర మహారాజునకుఁ దటస్థించిన గతిని విని పౌరులు గొల్లున విలపింప సాగిరి. ధర్మరాజు పట్టరాని దుఃఖముతో 'అయ్యో! యెంత దుర్గతి గలిగినది!' అని యాక్రోశించుచుఁ, గన్నతల్లిని దలఁచుకొని, చేతులు పైకెత్తి, వా విడిచి పెద్దపెట్టున వాపోవ సాగెను. భీమసేనాదు లగు తక్కటి సోదరులును దుఃఖసంతప్తులై తమతల్లిని దలఁచుకొ నుచు, ఆమెగుణగణములను వర్ణించుచుఁ బసవి పసవి యేడ్వ సాగిరి. కుంతీదేవికిఁ గలిగిన యాదుర్గతిని వినఁగనే యంతఃపు రాంగనలలో హాహాకారము మిన్ను ముట్టెను. కన్నకొడుకుల నందఱను బోఁగొట్టుకొని, వృద్ధుఁడై కడకుఁ గార్చిచ్చునఁ బడి కాలిపోయిన యా ధృతరాష్ట్రుని గుఱించియు, ధృతరాష్ట్రు నికిఁ బట్టిన దశయే పట్టి దుఃఖభాగిని యై యున్న గాంధారిని గుఱించియు వా రందఱును దుఃఖింపవలసినంత దుఃఖించిరి. ఇంచుమించు చొక ముహూర్తము కావచ్చును. అప్పటి కా

యేడ్పురొద కొంచెము తగ్గఁగనే యుధిష్ఠిరుఁ డెట్లో ధైర్యము తెచ్చుకొని కన్నీళ్లు నాఁపికొనుచు ని ట్లనియె.

ఇది ముప్పది తొమ్మిదవ యధ్యాయము.

---

నారదాగమనపర్వము

{ ధృతరాష్ట్రాదుల మరణమునకు ధర్మరాజాదులు విలపించుట }

ఉగ్రతప మొనరించుచు మహాత్ముఁ డనిపించుకొనిన మా పెత్తండ్రి యాత్మబంధువులము మే ముండఁగా నెంత దిక్కు మాలిన చావు చచ్చెను! నారదమునీంద్రా! మానవుల కర్మగతి యెప్పటి కేమో తెలియరాదుగదా! చూడు. మా పెత్తండ్రి యీ విధముగాఁ గాలుచిచ్చుకోఁ బడి కాలిపోయెను! సిరులతోఁ దులఁదూఁగు నూఱుగురు కొడుకులే! పదివేల యేనుఁగుల బలము గల బాహుశాలియే! అట్టి మహారాజా? దావాగ్నిపాలయి దగ్ధుఁ డగుట? మున్ను త్తమాంగనలు చుట్టు నిలిచి వీవనలతో వీచుచున్న మహారాజు నేఁడు దావాగ్ని దగ్ధుఁడై గ్రద్దఱెక్కలతో వీవంబడుచున్నవాఁడు గదా! మున్ను హంసతూలికా తల్పముపైఁ బవ్వళించి వంది మాగధ సంఘములచే మేల్కొల్పఁబడు మహారాజు నేఁడు కాకులు, గ్రద్దలు పీఁకుచుండఁ గటికినేలపైఁ బడి యున్నవాఁడుగదా! నేను గాంధారిని గుఱించి యంత దుఃఖింపను. ఆయమ పుత్రులంజఱును బోలిసిన తరువాత భర్త పూనిన వ్రతమును బూని కీర్తిమంతురాలై పతిలోకము నందినది. ఇఁక మా యమ్మ కుంతి యన్ననో, మహోజ్జ్వలమై సర్వసమృద్ధమైన

పుత్రులనైశ్వర్యమును వీడి వనవాసమును వలచి పోయినది. అట్టి మహాత్మురాలు చచ్చినను మే మింకను నట్టె బ్రతికి యున్నాము. ఛీ! ఛీ!! మాయీరాజ్య మేటికి? బల మేటికి! పరాక్రమ మేటికి! ఈక్షాత్రధర్మ మేటికి? ఇవి యన్నియుఁ గాల్పనా? సురమునీంద్రా! లోక గతి యెంత సుసూక్ష్మ మైనది! చూడుఁ. ఆతల్లి సామ్రాజ్యమును వదలి వనవాస మును గోరుకొన్నది గదా! యుధిష్ఠిర భీమార్జునులను గన్న వీరమాత దిక్కుమాలినదానివలెఁ గార్చిచ్చునఁ బడి కాలి పోయిన దని యనుకొన్నచో మూర్ఛితుఁడ నగుచున్నాను. సవ్యసాచి ఖాండవవనమును గాల్పించి యగ్నిదేవుని సంతృప్తి పఱచుట యెల్లఁ బనికి మాలిన పని యయిపోయినది. చూడుఁ. చేసిన మేలు మఱచి యీ యగ్ని యెంతటి కృతఘ్నుఁ డైనాఁ డో! తనకు మేలు చేసిన యీసవ్యసాచితల్లినే తాను గాల్చి వేసినాఁడే! ఆనాఁడు తనకుఁ బని వడినపుడు మాయాబ్రాహ్మణ వేషము వేసికొని భిక్షార్థియై వచ్చెను! ఛీ! యేమి యగ్ని దేవుఁడు? ఏటి పార్థుని ప్రసిద్ధసత్యసంధత? మహాత్మా! యిది నా కన్నిటికంటెను గష్టతర మని తోఁచుచున్నది. ఏమన? అంతటిమహారాజు వృథాగా నగ్నిదగ్ధుఁ డయ్యెనే యని. లోకో త్తరమైన కురువంశమున నుద్భవించి, నేల నాలుగుచెఱఁగు లేలి, చివర కంతటి తపస్వియై రాజర్షి నాఁ బరగిన యమ్మహా రాజున కిట్టి నికృష్టపుఁ జా వెట్లు సంభవించెను? అత్తపోవన మున మంత్ర పూతములగు తనహోమాగ్ను లుండఁగా వట్టి యగ్నితోనా మాతండ్రి మరణించుట? నలువైపుల దావాగ్ని చుట్టుకొనినపుడు, నరములపోవై బక్క చిక్కి యున్న మా

తల్లి కుంతి యంతటిమహావిపత్తులో గడగడ వడఁకుచు 'హా! నాయనా! ధర్మరాజా!' యని నన్నుఁ జీరి యెంత విలపించి నదో కదా! 'భీమసేనా! యిట్టియాపదనుండి కాపాడరారా' యని దిక్కులు మాఱుమ్రోఁగ నెంత వాపోయెనో గదా! ఇట్లు విలపించుచు మాయమ్మ దావాగ్నిచే దగ్ధురాలై పోయినది కాఁబోలు! మాయందఱికంటెను నామెకు సహదేవుని యం దెక్కుడు ప్రేమ. వాఁడైనను నామెను దావాగ్నినుండి తప్పింపఁ జాలక పోయెనే!

అని ధర్మరాజు విలపించుచుండఁగా విని తక్కినవా రందఱు నొకరి నొకరు కఱచుకొని యేడువసాగిరి. యుగము క్రుంగి నపుడు సర్వభూతములవలె నయ్యెవుకు పాండవులును దుఃఖ సముద్రములో మునిఁగిపోయిరి. వా రట్లు పెద్ద పెట్టున నేడ్చుచుండఁగా వారిరోదనధ్వని రాజభవనములు నిండి భూమ్యాకాశములను మాఱుమ్రోఁగించెను.

ఇది నలువదియవ యధ్యాయము.

---

## నారదాగమనపర్వము

**{ ధర్మరాజాదులు ధృతరాష్ట్రాదుల కంత్యక్రియ లొనరించుట }**

పాండవు లిట్లు దుఃఖించుచుండఁగా నారదమహర్షి ధర్మరాజుతో నిట్లనియె. 'రాజేంద్రా! ధృతరాష్ట్రమహారాజు నే నక్కడ మొదట విన్నట్లుగా వట్టియగ్నితో దగ్ధుఁడు కాలేదు. కనుక నతనినిఁ గూర్చి నీ వేమియు వగవఁ బనిలేదు. వాయుభక్షకుఁడై తప మొనరించు నా ప్రజ్ఞాశాలి యవ్వనములోఁ

ప్రవేశించునపుడే యగ్నుల నుద్వాసించె నని వింటిని. తర్వాత నాతని యాజకు లయ్యగ్నుల నా నిర్జనారణ్యమున వదలి తమ యిష్టము వచ్చినట్లు వెళ్లిపోయిరఁట. ఆయగ్నులే రవులొక్కని దావాగ్నియై యయ్యరణ్యమును గాల్చివేసెనఁట. ఈవిషయ మచ్చటి తాపసులు నాకుఁ జెప్పిరి. కనుక నా ధృతరాష్ట్ర మహారాజు నే నింతకు మున్ను నీకుఁ జెప్పినట్లుగా గంగాతీర మున స్వకీయాగ్నులచేతనే దగ్ధుఁ డయ్యె నని గంగాతీరమున నా కగపడిన మునులు దెలిపిరి. రాజేంద్రా! అమ్మహాత్ముఁ డాత్మాగ్నితోడనే సమాయుక్తుఁ డై నాఁడు. అతనికై పరితపింప కుము. అప్పుణ్యపురుషుఁ డుత్తమగతిఁ జెందినవాఁడు. గురు శుశ్రూషలచే మీ తల్లియు మహోత్తమమగు సిద్ధినిఁ బడసిన దనుటకు సందియము లేదు. రాజేంద్రా! యిఁక నీ తమ్ము లతోఁ గూడి యందఱును వారలకుఁ దిలోదకము లొసఁగుట కర్తవ్య మగును. ఆ విధిని నిర్వర్తింతురు గాక.'

అని చెప్పినంతఁ బాండవ ధురంధరుఁ డగు నా నరపాలుఁడు భార్యా సోదరులతోఁ గూడ గంగానదికి బయలుదేఱెను. రాజ భక్తినిఁ బురస్కరించుకొని పౌరులును, జానపదులును నేక వస్త్రధారులై నలువైపులనుండి మూఁగి వారివెంట గంగానది కేఁగిరి. పిమ్మట నక్కురుకులపుంగవు లగు ధర్మరాజాదు లందఱును గంగానదిలో స్నానము చేసి యుయుత్సుని ముం దుంచుకొని మహాత్ముఁ డగు ధృతరాష్ట్రునకును, గాంధారికిని, గుంతీదేవికిని బేరును, గోత్రమును జెప్పి యథావిధిగ నుదకక్రియ లొనరించిరి. ఆ శౌచము తీరునంతవఱకును వా రక్కడనే యూరివెలుపల నుండిరి. అటనుండి యుధిష్ఠిర

మహారాజు విధిజ్ఞులును, ఆప్త కారులు నగువారినిఁ బిలిచి వారివారికిఁ దగిన కర్తవ్యములను దెలిపి, వలసినధనము నొసఁగి, ధృతరాష్ట్రుఁడు కాలిపోయిన గంగాద్వారమునకుఁ బంపెను. పండ్రెండవ దివసమున నారాజేంద్రుఁడు శౌచ విధుల నెల్లఁ దీర్చుకొని, యా ధృతరాష్ట్రాదుల నుద్దేశించి సంపూర్ణదక్షిణలతో విధ్యుక్త ప్రకారమున శ్రాద్ధము లొన రించెను. ధృతరాష్ట్రు నుద్దేశించి య మ్మహారాజు విశేష దక్షిణలతో సువర్ణదానములు, రజతదానములు, గోదాన ములు, శయ్యాదానములు నొసంగెను. గాంధారికిని, గుంతీదేవికిని వేర్వేఱుగా వారిపేళ్లు చెప్పి లోకోత్తరములైన దానము లొసఁగెను. ఎవ రెవ రేదేది యెంతెంత కోరు దురో, యంతంత యది యది యా యా బ్రాహ్మణుఁడు పొందుచుండెను. వారి వారి యిచ్ఛానుసారము శయ్యలు, భోజనములు, యానములు, మణులు, రత్నములు, ధనములు, వాహనములు, వస్త్రములు, భోగములు, సాలంకృతులైన దాసీజనులు నీ ప్రకారముగా న మ్మహారాజు తల్లుల నిద్దఱి నుద్దేశించి యిచ్చివేసెను. ఇట్లు బహువిధముల శ్రాద్ధకృత్య ములు నిర్వర్తించి యనంతర మా రాజేంద్రుఁడు మరల హస్తినాపురమును బ్రవేశించెను. మున్నా రాజేంద్రుఁడు గంగాద్వారమునకుఁ బంపియున్న యా పురుషులు తదాజ్ఞాను సారము ధృతరాష్ట్రాదుల యస్థుల నేరి యొకటిగాఁ గట్టి మరల గంగకడకుఁ దీసికొనివచ్చి, వివిధములగు గంధమాల్యా దులచే యథావిధిగ వానికిఁ బూజచేసి, వానిని గంగలోఁ గలిపి యా సమాచారము ధర్మరాజున కెఱిఁగించిరి. నారద

మహర్షియు ధర్మాత్ముఁడగు నయ్యుధిష్ఠిరమహారాజు నూఱడం బలికి సంప్రీతుఁడై యథేచ్ఛం జనియె.

ప్రజ్ఞాచక్షుఁడగు ధృతరాష్ట్రమహారాజు సంగ్రామములో, కుమారులను బోఁగొట్టుకొని, యుద్ధహతులగు జ్ఞాతులుఁ బంధువులు, మిత్త్రులు, సోదరులు మున్నగువారి నుద్దేశించి యెల్లప్పుడు ననేక దానముల నొసఁగుచు నీ ప్రకారముగాఁ బదునైదు సంవత్సరములు హస్తినాపురముననుు—, ఆవల మూఁడేండ్లు తపోవనమునను నుండి జీవించెను. ఇఁక ధర్మరాజన్ననో జ్ఞాతులను, బాంధవులను బోఁగొట్టుకొనుటచేత నన్నింట నిస్పృహుఁడై నిరుత్సాహుఁడై పేరునకుమాత్రము రాజ్యభారమును వహించెను.

ఇది నలువది యొకటవ యధ్యాయము.

నారదాగమన పర్వము సమాప్తము.

గద్య:—ఇది విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి
వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి ప్రణీత
మైన వచనభారత మందలి
యాశ్రమవాసికపర్వము సంపూర్ణము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---



శ్రీః

# మౌసల పర్వము.

---

ధర్మరాజు యాదవనాశనమును వినుట.

జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె: రాజేంద్రా! వినుము. అట్లు కురుక్షేత్రమున జరిగిన మహాసంగ్రామమున విజయము నంది, కౌరవ సామ్రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడై యుధిష్ఠిరుఁడు భూమిని బరిపాలించుచుండ ముప్పదియైదు సంవత్సరములు గడచెను. ముప్పదియాఱవయేఁడు వచ్చినంతనే గొప్ప యుత్పాతము లనేకము లుత్పతిల్లెను. ఇసుకను వెదఁజల్లుచు రూక్షస్పర్శములై పెద్దపెద్దగాలులు పిడుగులతోఁగూడ వీచెను. పక్షులు కుడినుండి యెడమవైపునకు వలయాకారముగఁ దిరుగసాగెను. మహానదులు తమ నీరములను వెలుపలికిఁ గనరాకుండఁ దమలోననే దాఁచికొనెను. దిక్కుల నెల్ల దట్టముగా మంచు గ్రమ్మెను. ఆకసమునుండి తోఁకచుక్కలు నిప్పులు గురియుచు నేలపై నంతటను రాలెను. సూర్యబింబము దుమ్ముతోఁ బొదువంబడి కళావిహీనమై యుదయించుచుండఁ బ్రతిదినము దానిచుట్టును మొండెములు తాండవించెను. బూడిదరంగును, నరుణ వర్ణమునుం గలిగి తుదల నల్లనై కోసులువాఱిన మువ్వన్నె పరివేషములు చంద్రసూర్యులకుఁ జుట్టును బలుమాఱులు కానఁబడియెను. ఎప్పసి

యనుగ్రహమునంజేసి కలికాలమునను గృతయుగమునందు వలె ధర్మము చెల్లెనో, యెవ్వని యనుగ్రహమునఁ బాండవులు యశమునందిరో, యట్టి జగన్నాథుఁడగు శ్రీకృష్ణభగవానుఁడు పరమపదమునందఁ దలఁచుటంజేసి యివియు, నిట్టివి మఱియెక్కుడులును నగు నుత్పాతములు రాఁబోవు మహాభయమును సూచించుచుఁ బొడసూపెను.

వానిని గని కౌరవేంద్రుఁడగు యుధిష్ఠిరుఁడు శంకాకులుఁడై యుండఁ గొంతకాలమునకు 'యాదవులందఱును ముసలముచే నశించి' రనియును, 'బలరామకృష్ణులును బరమపదము నంది' రనియును నాతనికిఁ దెలియవచ్చెను. వెంటనే నలువురు తమ్ములను రప్పించి వారితోఁగూడ నాతఁడు 'కర్తవ్యమే' మని యాలోచించెను. బ్రాహ్మణశాపము తమ్ము బలాత్కరింప నొండొరులఁ బొడిచికొని యాదవు లందఱును నీల్గుట కా పాండవులు మిక్కిలి దుఃఖించిరి. ఆదినారాయణుఁడగు వాసుదేవునిమరణమును సముద్రశోషణమునుంబలె వారు నమ్మఁజాలకపోయిరి. ఇట్లు ముసలముచేఁ గలిగిన యా యాదవ వినాశమును దలపోసికొని వారెల్లరు దుఃఖ శోకోపహతులై దిక్కు దోఁపక విషణ్ణహృదయులై కూర్చుండిరి.

ఇది యొకటవ యధ్యాయము.

---

## మౌసలపర్వము

### యాదవ వంశనాశక మగు ముసలము పుట్టుట

'మునీంద్రా! వాసుదేవుఁడు చూచుచుండఁగనే వృష్ణి వంశము వారును, అంధకకులమువారును, భోజులును నగు



143. సారణాదియాదవులు సాంబున కాఁడువేసము వేసి విశ్వామిత్రకణ్వనారదులకుఁ జూపి, "ఈ బిడ యేమి సంతానము గనునో?" నని ప్రశ్నించుట.

BY COURTESY OF KARNATAKA DEPOT, MADRAS.

నా మహారథు లందఱును వినాశము నందుట యెట్లు పొసఁగి నది?' అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుఁ డిట్లనియె. 'నృపాలా! భారతయుద్ధము చెల్లిన యా ముప్పది యాఱవయేఁట యాదవులలో నవినీతి మెండుగాఁ బ్రబలి కాలము ప్రేరేపింప వారెల్లరును ముసలములతో నొండొ రులం జంపికొనిరి' అన విని జనమేజయుఁడు 'బ్రాహ్మణో త్తమా! యాదవులందఱు బ్రహ్మదండ బలాత్కృతులై మడిసి రని నొడివితిరి. వీరాగ్రణులగు వృష్ణ్యంధక భోజు లను సర్వ నాశముగా నెవ్వరు శపించిరి? దానితో వా రందఱు నెట్లు నశించిరి? తద్వృత్తాంత మంతయును సవిస్త రముగాఁ దెలుపుఁ'డని ప్రార్థించుటయు, నాతని కమ్మునీంద్రుఁ డిట్లనియె.

రాజేంద్రా! పూర్వ మొకప్పుడు తపోధనులగు విశ్వా మిత్రుఁడు, కణ్వుఁడు, నారదుఁడు నను మహర్షులు ద్వారకా నగరమున కేతెంచినఁ జూచి సారణాదులగు యాదవ వీరులు కాలచోదితులై సాంబునకు నాఁడుదాని వేసము వేసి యలంక రించి ముందుంచుకొని వారి యొద్దకుఁబోయి 'ఋషులారా! యీమె పరాక్రమశాలియుఁ, బుత్రసంతానార్థియు నగు బభ్రుని భార్య. ఈ బిడ యేమి సంతానమును గనునో చక్కఁగ నెఱుంగుదురే?' యని ప్రశ్నించిరి.

అంత నట్లు వారు తమ్ము వంచించి యపహసించుటకుఁ గినుక గదుర నమ్మునీంద్రులు నిప్పు లొలుకు కన్నుల నొం డొరులం జూచికొని వంచకులగు నా దురాత్ములవైపు దిరిగి 'యవినీతులారా! కృష్ణుని కొడుకగు నీ సాంబుఁడు వృష్ణ్యం

ధక వంశములను సర్వనాశనము చేయు భయంకరమగు నినుప రోఁకలిని గనును. దానితో బలరామ కృష్ణులు దక్కఁ దక్కిన దుర్మార్గులగు మీ రందఱు నీసురేఁగి ఘాతుకులై కులము నెల్లఁ దెగ నఱికికొందురు. శ్రీమంతుఁడగు హలాయుధుఁడు శరీరమును వదలి సముద్రమును జొచ్చును. నేలపై శయనించి యుండఁగా మహాత్ముఁడగు కృష్ణుని జరుఁడను బోయ యొకఁడు బాణముతోఁ గొట్టును.' అని శపించి తమ వచ్చిన త్రోవనుఁ జనిరి.

పిమ్మట నీ వృత్తాంతమంతయును విని కృష్ణుఁడు కాల పరిణామము నెఱింగిన మతిమంతుఁడు గావునఁ దన చుట్టునున్న యాదవులను జూచి 'భవితవ్య మట్లేయున్నది' యని పలికి యభ్యంతర మందిరమున కేఁగెను. కాని జగన్నాథుఁడయ్యును నాతఁడు విధివిధానము నన్యథాకరింప నొల్లఁ డయ్యెను.

అంత మఱునాఁడు తెల్లవాఱఁగనే సాంబునకు శాపప్రభావమునం జేసి వృష్ణ్యంధక వీరులనెల్ల భస్మ మొనరింపఁగల యా భీకరమహాముసలము యాదవ వినాశమునకు యమదూతవలె జనించెను. యాదవు లా వార్తను బ్రభువగు వసుదేవునకుఁ దెలిపిరి. ఆతఁడు కడుంగడు విషాదమునంది యాదవులచే నా మహాముసలమును మిక్కిలి సన్నని పొడిగాఁ జేయించి సముద్రమునఁ జల్లించెను. బలరామ కృష్ణులతోడను, మహాత్ముఁడగు బభ్రునితోడను నాలోచించి యా నృపాలుఁడు శాసింప రాజపురుషులు పురమునం దెల్ల నిట్లు చాటించిరి. 'ఈనాఁడు మొదలుకొని ద్వారకాపట్టణమున నున్నవా రెవ్వరుగాని, వృష్ణ్యంధక వంశముల జన్మించిన యే ప్రాణి

గాని మద్యపానము నొనరింపరాదు. ఎవ్వఁడే కాని మద్య మును ద్రాగినట్లు మాకుఁ దెలిసెనా వాఁడు వెంటనే బ్రదికి యుండఁగనే తా నొకఁడు చేసిన తప్పునకుఁ దనతోడి బంధు వులతోఁగూడ శూలముపై నెక్కింపఁబడును' అని.

అంతట మహాత్ముఁ డగు నా రాజుశాసనము నెఱింగి పౌరు లందఱును రాజదండనమునకు భయపడి సురాపానము నొన రింప కుండఁ గట్టుఁబా టొనర్చికొనిరి.

ఇది రెండవ యధ్యాయము.

---

## మౌసలపర్వము

### యాదవకులమున నుత్పాతము లుప్పతిల్లుట

ఇట్లు వృష్ణ్యంధకులు ముసలమువలనఁ గలుగు నాపదను దలఁగుటకు సప్రయత్నులై కాలము గడపుచుండ నంతకుఁడు వా రందఱి యిండ్లలోను బ్రతిదినమును దిరుగాడుచుండెను. భయంకరమును, వికటమును నగు రూపముతోను, నలుపు మించిన కవిలరంగుతోను, బోడితలతోను నా పురుషుఁడు యాదవుల యిండ్లలోఁ జొచ్చి కొన్ని యెడలఁ గనఁబడియు, మఱికొన్ని యెడలఁ గనఁబడకయుఁ దిరుగసాగెను. మేటి విలు కాండ్రు కొందఱు కనఁబడినప్పు డాతనిని నూఱులకొలఁ దియు, వేలకొలఁదియు నగు బాణములచేఁ గొట్టిరి. కాని సర్వ భూతవినాశకుఁ డగు నాతని నవి వేధింపఁజాల వయ్యెను. దినదిన మును బెద్దపెద్ద సుడిగాలులు మొదలగు నుత్పాతము లసంఖ్య ములుగాఁ గనవచ్చెను. మేనికి గగ్గురుపాటు గలిగించు

నా మహోత్పాతములు వృష్ణ్యంధకవినాశమును సూచించు చుండెను. రాజవీథులలోఁ బగిలిన చిల్లపెంకులు మెండుగాఁ బడి యుండ నందు నెలుకలు లెక్కకు మిక్కుటముగాఁ బారాడఁదొడఁగెను. రాత్రులలో నిద్దురపోవువారి వెంట్రుకలను, గోళ్లను నెలుకలు దినిపోసాగెను. యాదవ మందిరములలో గోరువంకలు "చీచీ కూచీ" యని యఱచు వికారధ్వనికి రేయింబవళ్లు నెడ తెఱపి లేకుండెను. హంసలు గూబలవలె గూపెట్టెను. మేకలు నక్కలవలె నూళలువైచెను. తెల్లని మేనులతోను, నెఱ్ఱనికాళులతోనుం గూడిన గువ్వలు కాలచోదితములై వృష్ణులయిండ్లలోఁ దూఱి తిరుగాడెను. ఆవులకు గాడిదలును, గంచరగాడిదలకు నేంటెపిల్లలును బుట్టెను. కుక్కల కడుపునఁ బిల్లులును, ముంగిసల కడుపున నెలుకలును జన్మించెను. బలరాముఁడును, గృష్ణుఁడును దక్కఁ దక్కిన యాదవు లందఱును బాపకార్యముల నొనరించుచు సిగ్గుపడరైరి. బ్రాహ్మణులను, బితరులను, దేవతలను నొప్పింపఁ దొడఁగిరి. పెద్దలను దిరస్కరింప సాగిరి. భార్యలు భర్తలను, భర్తలు భార్యలను లెక్కసేయక యున్మార్గవర్తులై చరింప నారంభించిరి.

హోమకాలముల నగ్నిహోత్రుఁడు నల్లనివియు, నెఱ్ఱనివియు మాంజిష్ఠవర్ణము (మిక్కిలి యెఱుపురంగు) గలవియు నగు జ్వాలల వేర్వేఱ నెగయించుచు నపసవ్యముగా సుడియుచుండెను. ఆపట్టణమున నుండువా రందఱకు నుదయాస్తమయకాలముల సూర్యుని చుట్టును మొండెములు మూఁగి యున్నట్లు కనవచ్చుచుండెను. వంటయింట సిద్ధము కాఁగనే చక్కఁగాఁ బాకముఁజూచి దించికొనిన వంటకములు తినుటకుఁ దోడు

కొనఁగనే యందుఁ బురుగులు వేలకొలఁదిగా మిలమిల మెదలాడఁ జొచ్చెను. పుణ్యాహముఁ జదువునపుడును, మహాత్ములు జపముసేసికొనునపుడును నెవరో తమ మీఁదికిఁ బరువెత్తికొని వచ్చినట్లు విన వచ్చి కను దెఱచి చూచునంతలో నెవ్వరును వారికిఁ గన రాకుండిరి. మాటిమాటికి నాకసమున నక్షత్రములొండొంటితో నొరసికొనుచున్నట్లును, గ్రహములును, నక్షత్రములు నొండొంటితో నొరసికొను చున్నట్లును వారి కగపడుచుండెను; కాని యెంత చక్కఁగాఁ జూచినను నిజనక్షత్రములు [తమతమ నక్షత్రములు] మాత్రము వారికిఁ గానఁబడకుండెను. వృష్ణ్యంధకుల యింటింటను బాంచజన్యశంఖధ్వని వినవచ్చు చుండఁ జుట్టునుఁ జేరి గాడిదలు భయంకరారావములతో మెండుగాఁ గూయఁ జొచ్చెను.

ఇట్టి యుత్పాతములఁ గాంచియు, ఆ కృష్ణపక్షమునఁ బదుమూఁడవ దినముననే యమావాస్య యగుటను జూచియు యాదవుల కెల్లరకుఁ గాలము మూడుట యెఱింగి వాసుదేవుఁ డెల్ల వారలఁ గనుంగొని 'యిదిగో యీ కృష్ణపక్షమునఁ బదుమూఁడవ దినమే చతుర్దశియును బంచదశియును (అమావాస్యయు) నై యందు రాహుగ్రహణముకూడఁ గలిగినది. చూచితిరే! ఇది మున్ను భారతయుద్ధము గానున్నపుడు గలిగినది. మరల నేఁడు కలిగి మన సర్వనాశమును సూచించుచున్నది' అని పలికి కొంతతడ వాలోచించి, తొల్లి యాదవులకుఁ బ్రాప్తకాలముగాఁ దాను దలంచు చున్న యా భారతయుద్ధము తరువాతి ముప్పదియాఱవయేఁడు సంప్రాప్త మగుట యెఱింగి మరల నిట్లనియె. 'పూర్వము కన్నకొడుకు లంద

మును జచ్చి, 'నా' యనువా రెల్లరును గూలారి, కడుపు చిచ్చుతోఁ గుమిలిపోవుచు గాంధారి యాదవవంశ వినాశము నకై శపించెనే! ఆ ముప్పదియాఱవ యేఁ డిదే వచ్చి నది. భారత యుద్ధకాలమున రెండు పక్షముల సైన్యములును వ్యూహములు దీరి నిలిచి యున్నపుడు గలిగిన మహాభయం కరము లగు నుత్పాతముల నాలోకించి యుధిష్ఠిరుఁడును వాక్రుచ్చిన యా ముప్పది యాఱవ యేఁ డిదే రానే వచ్చినది.'

ఇట్లు యాదవుల కెల్లరకును దెలిపి యా వాక్యముల నన్నిం టిని యథార్థములనే యొనరింప నెంచి శత్రుసంహారకుఁ డగు నమ్మహాత్ముఁడు తీర్థయాత్రను జాటింపఁ బంచెను. జనార్ద నుని యానతిమెయి రాజపురుషులు 'సముద్రమునకు జాతర సేయఁ దరలుఁడో' యని పుర మెల్లయెడలఁ జాటించిరి.

ఇది మూఁడవ యధ్యాయము.

---

## మౌసలపర్వము

### యాదవ నాశనము

నాఁటిరాత్రి ద్వారకానగరమున నల్లనిశరీరమును, దెల్లని కోఱలును గల స్త్రీ యొకతె యట్టహాసము సేయుచు నిండ్లలోఁ జొరఁ బడి స్త్రీల నీడ్చికొని పోవు చున్నట్లును, భయంకరము లగు గ్రద్ద లగ్నిహోత్రగృహములలోను, నడియిండ్లలోను జొచ్చి యం దున్న వృష్ణులను, నంధకులనుఁ బొడిచికొని తిను చున్నట్లును, దమ తమ భూషణములను, గొడుగులను, టెక్కె ములను, గవచములను వెఱపుఁ గొలుపు రాక్షసులు దొంగి లించికొని పోవు చున్నట్లును నెల్లవారును గలలు గాంచిరి.

పూర్వము ఖాండవవనమును గాల్చునప్పు డగ్నిదేవుఁ డొసంగినది, వజ్రనాభము, అయోమయము నగు కృష్ణుని చక్రము యాదవులందఱుఁ జూచుచుండ నాకాశమున కెగిరి పోయెను. మనోజవము లగు శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకము నను పేరిటి కృష్ణుని మేటి గుఱ్ఱములు నాలుగును సూర్యునివలెఁ బ్రకాశించుచున్న దివ్యరథమును నీడ్చుకొని దారుకుఁడు చూచుచుండఁగనే సముద్రము మీఁదుగాఁ బరువెత్తి పోయెను. ఉత్తమధ్వజము లగు బలరాముని తాటిసిడమును, కృష్ణుని గరుడకేతనమును వారిచే నిత్యపూజల నందుచున్న వానిని దివ్యాప్సరసలు మింటిపై కెత్తుకొని పోయిరి. అప్పుడు కృష్ణపరమాత్మునిఁ జూచి, తాఁకి, నేస్తము నొనరించి, యానందానుభవము నందిన యా పుణ్యపురుషు లగు యాదవులను స్వర్గలోకమునఁ బ్రవేశపెట్టుటకై విమానములతో వినువీథి నిలిచిన దేవతలు విస్పష్టముగఁ 'దీర్థయాత్రకై శీఘ్రముగ బయలుదేఱుఁడు' అని పలికిరి.

అంతట వృష్ణ్యంధకవంశజు లగు నమ్మహారథు లెల్లరు నంతఃపురాంగనలతోడం గూడి తీర్థయాత్రకు వెడలఁ దలఁచిరి. కాలచోదితులై వా రందఱు పరమ సంతోషముతోఁ గలకలలాడుచు నింటింటను సత్వరముగా నానావిధము లగు పేయములను, మాంసములను, నాసవములను బుష్కలముగా సిద్ధము గావించుకొని మద్యపానాసక్తులై పురము వెడలి రథములమీఁదను, గుఱ్ఱములమీఁదను, నేనుంగులమీఁదను నెక్కి ప్రభాసతీర్థమునకుఁ జనిరి. శ్రీమంతులును, జండపరాక్రములును నగు సయ్యాదవు లందఱు నటఁ దమ తమ

కొఱకై యేర్పఱచిన చప్పరములలోఁ దమ తమ యంతఃపుర స్త్రీలతోడను, దినుటకునుద్రాగుటకును మెండుగాఁ గొని వచ్చిన పదార్థములతోడను యథార్థముగ విడిసిరి. ఇట్లు సముద్రతీరమున నెల్ల వారును విడియుటను గనుంగొని యోగ విదుఁడును, సర్వార్థములను జక్కఁగ నెఱింగినవాఁడును నగు నుద్ధవుఁ డెందేనియుఁ బోవనెంచి యాదవవీరుల నెల్ల వారలను వీడ్కొని కృష్ణభగవానుని కడకుఁ జని, నమస్కరించి, కృతాంజలియై నిలిచిన నమ్మహనీయుఁడును యాదవవినాశము నెఱింగిన వాఁడు గావున నమ్మహాత్ముని ప్రయాణమును నివారింపఁ డయ్యెను. అంతఁ గాలము దీఱనున్న యా యాదవవీరు లందఱును జూచుచుండ నయ్యుద్ధవుఁడు నిజతేజము భూమ్యాకాశములు నిండుకొని వ్యాపింప నెందేనియుం జనియెను.

తరువాత జనమేజయనృపాలా! కాలవిపర్యాసమున కేమందును? యాదవు లందఱును బ్రాహ్మణసంతర్పణమునకై సిద్ధము చేయఁబడిన యన్నమును కల్లుకంపుతో నింపి క్రోఁతులకుఁ బాఱవైచిరి. అంతట నూర్లకొలఁదిఁ దూర్యధ్వానములు బోరుసెలఁగ నట నర్తక సంకుల మై దుస్సహపరాక్రము లగు నయ్యాదవవీరులకు మహాపానమను మహోత్సవము సెల్లెను. ఎట్టయెదుట నుండి కృష్ణుఁడు నూచు చుండఁగనే బలరాముఁడు, కృతవర్మ, సాత్యకి, గదుఁడు, బభ్రుఁడు మున్నగు యాదవ ప్రముఖు లెల్ల నానావిధమద్యములనుం జెడఁద్రావిరి.

ఇట్లు మహాపానము చెల్లుచుండ నా సభామధ్యముననుండి కైపు మీఱి సోలుచు సాత్యకి కృతవర్మనిఁ జూచి యవమానకరముగాఁ బెద్దపెట్టున నవ్వి ‘క్షత్త్రియవంశమునఁ బుట్టిన

వాఁడెవఁడైననుం దనమీఁదికి రాక పీనుంగులవలెఁ బడి నిద్రపోవువారలం దెగనఱుకునే? కృతవర్మా! నీ వొనరించిన యీ పాడుపనికి యాదవు లెవ్వరును సహింపరు' అనియెను. ఆ మాట విని మేటిరథికుఁడు ప్రద్యుమ్నుఁడు 'మేలు మే' లని యీ పలుకులం బొగడి కృతవర్మ నవమానించుటయు నాతఁడు మిక్కిలి కినుక గదురఁ దిరస్కారపూర్వకముగ నెడమచేత నిర్దేశించి చూపుచు సాత్యకి కి ట్లనియె. 'ఓరీ! యుద్ధరంగమునఁ జేతులు తెగి ప్రాయోపవేశము నొనరించి యున్న భూరిశ్రవునిం బరమఘాతుకమగు చావు చంపితివే! యది నీ వీరత్వమునకు లక్షణమే కాఁబోలును' కృతవర్మని పలుకులు విని యరివీరవినాశకుఁ డగు వాసుదేవుఁడు కినుక వొడముటయు రోషవీక్షణములఁ గ్రేఁగంట నాతనిని జూచెను. ఆ సమయమున సాత్యకి, సత్రాజిత్తు కడ నున్న స్యమంతకమణికై కృతవర్మఁ డొనరించిన యీ ద్రోహగాథను మధుసూదను తలంపునకు రాఁ బ్రస్తావించెను. దానిని విని నెట్టుకొనివచ్చు కోపమునుం బట్టఁ జాలక పెద్దపెట్టున నేడ్చుచు నంకస్థలమున కేతెంచి సత్యభామ కృష్ణుని క్రోధానలమును నినుమడింపఁ జేసెను. ఇది యంతయును గాంచి సాత్యకి సక్రోధుఁ డై లేచి 'ఇదే యేవురు ద్రౌపదికొడుకులు ధృష్టద్యుమ్న శిఖండులునుం బోయిన తెరువుననే యీతని నంపుదును. అమ్మా! సత్యము తోడుగా బాస యొనర్చెదను. సౌప్తికమున ద్రోణుని కొడుకునకుఁ దోడై దుర్మార్గుఁడై యెల్లవారిని గొంతులు గోసిన పాపాత్మకుఁడగు నీ కృతవర్మన కిదే యీ నిముసముతో నాయువును, యశమును ముగిసినవి.' అని పలికి మీఁదికిం బోయి

జనార్దను నెట్టయెదురనే ఖడ్గముతోఁ గృతవర్మని తలఁ ద్రెవ్వ నేసెను.

ఇట్లు కృతవర్మం జంపి క్రోధావేశమున నలువైపుల నున్న తక్కుంగలవారలం జూచి కసిమసఁగు సాత్యకి నిలువరింప వాసుదేవుఁడు వగు వెత్తునంతలోఁ గాలము మూఁడి ప్రేరేపింప భోజులును, నంధకులు నేకీభూతులై యెక్కువెట్టున సాత్యకిని జుట్టుముట్టిరి. ఇట్లు క్రోధావిష్టులై నేనెనుఁ బఱ తెంచి సాత్యకిపైఁ బడు భోజాంధకవీరులఁ గాంచియు జనార్దనుఁడు కాలవిపర్యయము నెఱింగినవాఁడు గావునఁ దేజోనిధి యయ్యుఁ గోపింపఁ డయ్యెను. అంతట వారును మద్యపానము వలన రేఁగినకైపున నోడ లెఱుంగక చేటుకాలము ప్రేరేపింప నట నున్న యెంగిలికంచములు, పానపాత్రలు మున్నగు వానిం గొని సాత్యకిపై విసిరి కొట్టిరి. సాత్యకిపాటుం గని క్రోధపరవశుఁడై రుక్మిణీసూనుఁడగు ప్రద్యుమ్నుఁడు సాత్యకిని విడిపింపఁ దత్సేనామధ్యమునం జొచ్చెను. అప్పుడు ప్రద్యుమ్నుఁడు భోజులతోడను, సాత్యకి యంధకులతోడనుం దలపడిరి. ఇట్లు పోరాడు నవ్వీరవరేణ్యులు కడుంగడు బాహుబలశాలు లయ్యును శత్రుసైన్యము లనంతము లగుటంజేసి కృష్ణుఁడు చూచుచుండఁగనే యిరువురును నేలం గూలిరి. ఇట్లు నిహతులై పడిన తమ్మునిని, సాత్యకిని, గొడుకును బ్రద్యుమ్నునిం గాంచి కోపముం బట్టఁజాలక యదునందనుఁ డట నున్న మూఁడంచులతుంగను బిడికిలినిండఁ బెఱికి పట్టుకొనెను. అంతట నయ్యది భయంకరమును, నయోమయమును నగు వజ్రాయుధమువంటి రోఁకలి యయ్యెను. దానితో నాతఁ

డెదుట నున్నవారి నెల్లఁ జావ మోఁదెను. అంతట నంధక వంశమువారును, భోజాన్వయమువారును, శినికులమువారును, వృష్ణివంగడమువారు నగు నయ్యాదవు లెల్లఁ గాలచోదితులై కలియంబడి ముసలరూపము లగు నా మూఁడంచుల తుంగలతో నొండొరుల మోఁదుకొని యెక్కుడివా రక్కుడ మడిసిరి.

జనమేజయ నృపాలా! యిట్లు చెల్లిన యాసంకుల సమరమున యాదవుఁ డెవ్వఁడేని కోపావేగమున నొకతుంగను బెఱికికొనెనా చాలును. అదియెల్ల వజ్రాయుధమువలెఁ జూపట్టుచుండెను. ఇట్లు తృణముగూడ నచట ముసల మగుట గానవచ్చెను. ధరణీశా! యది యెల్ల బ్రహ్మదండకృత మని యెఱుంగుము. ఇట్లు వారెల్ల రా మూఁడంచుతుంగలతోఁ దెగ బాదుకొనుచుండిరి. ఒక్కొక్కతుంగయు వజ్రమువంటి రోఁకలి యై దిటవుఁ జూపుచుండెను. అట్టి యా దొమ్మియుద్ధములోఁ దండ్రిని గొడుకును, గొడుకును దండ్రియును నురుమాడుకొనిరి. మదమత్తులై కుకురాంధకు లిట్టు లొండొరులం బొడిచికొనిమంటలలో మిడుతలవలెఁ బొడపడంగిరి. కాని యంద ఱట్లు కూలుచుండుట గనుచుండియు నొక్కనికయినను బరువెత్తిపోవ నయినను బుద్ధి పొడమ దయ్యెను. మధుసూదనుఁడును నిది యెల్లఁ గాలవిపర్యయ మని తలంచుచుఁ జేత నున్న యాముసలము నే యూఁతఁగాఁ గొని నిలువంబడి సర్వము నవలోకించుచుండెను. రణనిహతులై నేల వ్రాలి యున్న సాంబుని, చారుదేష్ణుని, బ్రద్యుమ్నుని, ననిరుద్ధుని, గదునిం గనుంగొని యమ్మహాత్మున కాఁపరాని కోపము జనించెను. అంతట నా చక్రాయుధుఁడు హతశేషులగు యాదవుల నెల్లఁ

దుంగలఁ గొని, చావ మోఁది నిరవశేషము గావించెను. ఇట్లెల్ల వారిని దుదముట్టించి నిలిచిన యమ్మహాత్ముని కడకుఁ దేజశ్శాలియగు బభ్రుఁడును, శత్రుజేతయగు దారుకుఁడును నల్లనఁ జేరం జని 'మహాత్మా! లెక్కకు మిక్కుటముగా నున్న మనుజుల నందఱను నిరవశేషముగ సంహరించితివి. బలదేవుఁ డెచట నున్నాఁడో వెదకికొని యచటికే పోవుదము రమ్ము' అని విన్నవించిరి.

ఇది నాలుగవ యధ్యాయము

---

## మౌసలపర్వము

### శ్రీకృష్ణ నిర్యాణము

అంతట దారుకుఁడును, కృష్ణుఁడును, బభ్రుఁడును బలరాముఁ డున్న చోటు వెదకుచుఁ బోయి పోయి యొక విజన ప్రదేశమున వృక్షముక్రింద నేదియో యాలోచించుకొనుచుఁ గూరుచుండియున్న యనంతపరాక్రముఁ డగు నాతనిం గనుంగొనిరి. పిమ్మట బలరామునిం డగ్గఱి మహానుభావుఁ డగు కృష్ణుఁడు దారుకునిం గాంచి 'దారుకా! నీవు కురుభూములకుఁ జని యాదవులకుఁ గలిగిన యీ మహావధము నంతయు నర్జునున కెఱిఁగింపుము. బ్రాహ్మణ శాపమునంజేసి యాదవులందఱునుం దెగి రని యాతనికిఁ దెలుపుము. నీ మాట వినిన వెంటనే యర్జునుఁ డిచటి కేతెంచునుగాక.' అని యాజ్ఞాపించెను. అంత నాతఁడును రథ మెక్కి మనసు మనసున లేక కురుదేశములకుం జనియెను. అట్లు దారకుఁడు చనినతరువాతఁ

జెంత నున్న బభ్రుని గాంచి వాసుదేవుఁడు 'ధనలోభమున దొంగలు స్త్రీజనమును బాధింతురు. అట్లు గా కుండ నీవు శీఘ్రముగఁ బోయి వారిని గాపాడుము' అని యాజ్ఞాపించెను. కేశవశాసనముం దలఁ దాల్చి యాతఁడును మద్యపాన మదముచేఁ దొట్రుపడుచు బంధువధమువలని శోకము పీడింపఁ బ్రయాణ మయ్యెను. అట్లాతఁ డేకాకియై త్వరితగతిం జనుచుండ నెటనుండియో యొకబోయ వైచినబాణ మాతనిం దాఁకెను. అంతట నాతఁడును బ్రాహ్మణశాపము దగిలిన వాఁడే కావున నాబాణమును జేరి యున్నముసలము తాఁకుటయే తడవుగా వాసుదేవుని కల్లంత దూరముననే నేలం బడి ప్రాణములం బాసెను. ఇట్లు బభ్రునిపడుటఁ గాంచి తేజోమూర్తియగు వాసుదేవుఁ డగ్రజున కభిముఖుఁడై 'బలదేవా! నే నిదే వేగముగాఁ జని స్త్రీజనమును బంధువుల కప్పగించి వచ్చెదను, అంతవఱకు నీ విచటనే నారాకను బ్రతీక్షించి యుండుము.' అని పలికి బయలుదేఱి ద్వారకానగరమును జొచ్చి తండ్రిసాలికిం జని యిట్లనియె. 'రాజేంద్రా! మన కున్న యీ సర్వస్వమును ధనంజయుఁడు వచ్చునంతకుఁ గాపాడుము. బలరాముఁడు వనమున నారాకకై వేచి యున్నాఁడు. నే నిదే యాతనికడ కేఁగెదను. పూర్వము కురుకులక్షయమును గాంచితిని. నేఁడు సర్వయాదవ వినాశమును గన్నులఁ జూచితిని. యాదవశూన్య మయిన యీ యాదవ నగరమును నేఁడు గన్నెత్తియైనను జూడఁ జాలను. నానిశ్చయము నెఱుంగుము. నే నిదే యరణ్యమున కేఁగి బలదేవునితోఁ గూడి తప మొనరింతును' అని యిట్లు పలికి జనకుని పాదములకు శిరము

షోకంబ్రణమిల్లి వాసుదేవుండు సత్వరుండై నడువసాగెను. అంతట స్త్రీలును, బాలురును బెద్దపెట్టుననగర మెల్ల మార్మోగ హాహోవ సాగిరి. ఇట్లాక్రోశించు నాయువిదల రోదనధ్వని విని కృష్ణుండు వెనుకకు మరలి వారలతో 'శీఘ్రకాలముననే వీరవరేణ్యుండగు నర్జునుం డిచటికి వచ్చును. పురుషశ్రేష్ఠుండగు నాతండే మీదుఃఖముల నెల్లం దొలంగించును.' అని పలికి యరణ్యాభిముఖుండై చనియెను.

అట్లు చని యాతం డరణ్యమున నేకాంతస్థలమున నాసీనుండై యున్న బలదేవునిం గాంచెను. పిమ్మట యోగనిష్ఠుండగు నమ్మహాత్ముని ముఖమునుండి తెల్లని మహానాగ మొండు బయలువెడలుట నవ్వాసుదేవుండు కనుంగొనెను. ఇట్లు మహానుభావుండగు నా బలరాముండు నిజదేహమును వీడి, వేయి పడగలతోడను, పెనుగొండవంటి పఱపును నిడివియును గల శరీరముతోడను, నెఱ్ఱని మోములతోడనుం గూడిన నాగేంద్రుండై కృష్ణభగవానుండు గనుంగొను చుండ సముద్రము నకుం జనియెను. ఇట్లు తన్నుం జేరు నమ్మహాత్ముని సముద్రుండు లెస్సగా నెదుర్కొని తనలోం జేర్చికొనెను. అంతట దివ్యులగు నాగేంద్రులును, పుణ్యనదులును నమ్మహాత్మున కెదురుగా వచ్చి పూజించిరి. కర్కోటకుండు, వాసుకి, తక్షకుండు, పృథుశ్రవసుండు, అరుణుండు, కుంజరుండు, మిశ్రి, శంఖుండు, కుముదుండు, పుండరీకుండు, మహాత్ముండగు ధృతరాష్ట్ర నాగేంద్రుండు, హ్రాద, క్రాథ, శితిపృష్ఠ, నికేతువులు, నాగులగు చక్రమందాతిషండులు, నాగశ్రేష్ఠుడగు దుర్ముఖుండు, అంబరీషుండును నాతని కెదురుగా వచ్చిరి. వారితోంగూడ సాగరే



156. యోగనిష్ఠుం డగు రాముని ముఖమునుండి వేయిపడగలతోడి మహానాగ మొండు బయలువెడలి, కృష్ణుఁడు చూచుచుండ సముద్రముం జొరుట.

BY COURTESY OF KARNATAKA DEPOT, MADRAS.

శ్వరుఁ డగు వరుణుఁడుగూడ స్వయముగా నమ్మహాత్మున కెదురుగా వచ్చి స్వాగత మడిగి యభినందించెను. భూభారమును వహించువాఁడును, శుద్ధబుద్ధియు నగు నా సంకర్షణదేవునిని వా రెల్లరు నర్ఘ్యపాద్యాదిసత్కారములచేఁ బూజించిరి. ఇట్లగ్రజుఁడు పరమపదము నందిన యీప్రకారము నెల్ల దివ్య దృష్టిని గాంచి సర్వార్థవేత్త యగు నవ్వాసుదేవుఁ డా నిర్జనారణ్యమునఁ దిరుగాడుచు నాలోచనామగ్నుఁడై యొక్కయెడ నేలపైఁ గూరుచుండెను. పూర్వము నిజధర్మమునూఁది గాంధారి పలికిన పలుకులను, నెంగిలిపాయసమును బూయునాఁడు దుర్వాసుఁ డాడినమాటలను, నన్నింటిని నాతఁడు తలఁపునకుఁ దెచ్చుకొనెను. అంత మహానుభావుఁ డగు నా వాసుదేవుఁడు వృష్ణ్యంధకవినాశమును, కురుకులక్షయమును దలపోసి తన పరమపదప్రాప్తి కదియే కాలమని నిశ్చయించెను.

అంతట నమ్మహాత్ముఁడు యోగనిష్ఠ నంది యింద్రియముల నెల్ల లెస్సగా నిరోధించెను. సకలార్థ తత్త్వమును నెఱింగిన యమ్మహాత్ముఁడు మూఁడు లోకములను బ్రోవఁ జాలిన యాదిదేవుఁ డయ్యును దుర్వాసుని వచనము యథార్థమొనరింపఁ దలఁచి దేహత్యాగమునకు నిమిత్తము వలయునని తలంచెను. ఇంద్రియముల నెల్ల లెస్సగా నిరోధించి మౌని యై మనస్సు నేకాగ్రము గావించి యమ్మహాత్ముఁడు గాఢ సమాధి నంది నేలపైఁ బవ్వళించెను.

అంతలో నా తావునకు భీకరాకారుఁ డగు జరుఁ డను వేటకాఁ డొకఁడు మృగముల వేఁటాడుటకై చనుదెంచెను.

గాఢసమాధి నొంది శయనించి యున్న యప్పరమాత్మ నల్లం తటఁ గనుఁగొని వాఁడు జింక యని తలంచి యాసగొని యొక బాణమును నాతని యఱకాలునం గాటముగఁ గ్రుచ్చెను. వెంటనే యా బోయ తాఁ గొట్టిన లక్ష్యమును గ్రహింప నెంచి వేవేగముగ నవ్వాసుదేవునికడ కేతెంచెను. అట నాలుగు భుజములతోడను, పీతాంబరముతోడను వెలుంగుచు యోగయుక్తుఁడై పరుండి యున్న పురుషునిం గాంచి వాఁడు తా నొనరించిన యపరాధము నెఱింగి మిక్కిలి భయము నంది యమ్మహాత్మ్ముని పాదములపైఁ బడియెను. తన బోయపుట్టుకకును, దా నొనర్చిన యా పాపకార్యమునకును నట్లు పశ్చాత్తాపమునందు నా బోయభక్తికిఁ బ్రీతుఁడై నారాయణుఁడు వానికిఁ బుణ్యలోకముల ననుగ్రహించి యూఱడించెను. ఆదినారాయణు నట్లు దర్శించి నిజదేహమును ద్యజించిన యాబోయను వేలుపులు స్వర్గమునకుఁ గొని పోయిరి. అటఁ గృష్ణుఁడును నిజతేజము లోకముల నెల్ల వ్యాపింప మహేంద్రు లెల్లరు గుంపులు గుంపులై పూజింప నూర్ధ్వలోకములకుం జనియెను.

ఇట్లు సురలోకమును జేర వచ్చు నా పురుషోత్తముని దేవేంద్రుఁడు మున్నుగా నశ్వినీదేవతలు, రుద్రులు, నాదిత్యులు, వసువులు, విశ్వేదేవతలు, మునులు, సిద్ధులు, నప్సరసలతోడం గూడ గంధర్వోత్తములు నెదురుగా వచ్చి సత్కరించిరి. జనమేజయనృపాలా! యిత్తెఱంగున నతిశయతేజోమూర్తియు, నిఖిల లోకాదియు, నవినాశియు, నాదినారాయణుఁడు నగు నయోగ్యగాచార్యుఁడు సుందరతేజము భూమ్యాకాశముల

నిండుకొొన వాచామగోచర మగు స్వస్థానము నందెను. అంతట వేలుపులును, మునులును నమ్మహాత్మునిఁ బరివేష్టించిరి. చారణులును, గంధర్వో త్తములు, ను త్తమాప్సరసలును, సిద్ధులును బ్రణతులై యప్పరమాత్ముని బూజించిరి. సర్వేశుఁ డగు నాతనిని వేలుపు లభినందించిరి. మునీంద్రులు వేద ఋక్కులతోఁ బూజించిరి. గంధర్వులు స్తోత్రపాఠముల నొన ర్చుచు నిలిచిరి. అప్పుడు మహేంద్రుఁడు సంతోషముతో నా పురుషో త్తము ని ట్లభినందించెను. 'భగవానుఁడా ! నీ కివే ప్రణామసహస్రములు. శార్ఙ్గ కోదండమును దాల్చు నాది నారాయణుఁడవు నీవు ధర్మ సంస్థాపనమునకై భూలోకమున నవతరించితివి. సుప్రసిద్ధుఁ డగు కంసుఁడు మొద లగు దేవ శత్రువులను, దర్పము గల దురాత్ములను సర్వనాశన మొన రించి బరువుచేఁ గ్రుంగి తపించు భూదేవికిఁ గుదురుపాటు గలిగించితివి. మహాత్మా ! యిట్టి దట్టి దని నిరూపింప రానిది, యెన్నఁడును జీర్ణదశ నెఱుంగనిది, యెవ్వని కేనియు నెఱుంగ రానిది, వేదగమ్యము, సర్వో త్తమము నగు నీ దివ్యపద మును బొందుము. ప్రభూ! ప్రతికల్పమునను నిట్లే యవత రించి ప్రపన్నులగు మనుజుల బాధలఁ దొలంగించి రక్షింపుము.'

అని దేవనాథుఁ డిట్లు పలికి విరమింపఁగనే దేవత లెల్లరును వెంటనంటి శ్రీనివాసుఁ డగు నమ్మహాత్మునిపైఁ బుష్పవర్ష మును గురియించిరి. అంత నప్పరమాత్ముఁడు సూర్యమండల మును బ్రవేశించెను. పదంపడి యా సూర్యబింబమునడుమ

నుండి మూర్తిమతియగు దివ్యవాణి యిట్లు వినవచ్చెను. 'దేవతలారా ! చతుర్భుజములతోఁడం గూడిన యీ నా రూపము చాల విశిష్టమైనది. ఈ రూపమున జీవించి భూలోకమునఁ జిరకాలము వసించితిని. అప్రమేయ మగు నా యీమూర్తి నెల్లవారును నుపాసింపుఁడు. ఎల్లప్పుడును నే నీమూర్తియందు నివసించి యుందును.' అని.

పిమ్మట బ్రహ్మాదు లగు దేవత లందఱును నా తావునకుం జనఁ జాలమి నా దేవుని మనముల ధ్యానించుచు వెనుకకు మరలి యమ్మహాత్ముని గుణగణములఁ గీర్తించుచుఁ దమ తమ పుణ్యలోకముల కేఁగిరి.

ఇది యైదవ యధ్యాయము.

---

## మౌసలపర్వము

**— యాదవవినాశనమును విని యర్జునుఁడు ద్వారక కేతెంచుట —**

అటమున్ను వాసుదేవునియానతిఁ గొని చనిన దారుకుఁడును కురుభూములకుం జని మహారథు లగు పాండవులఁ గాంచి ముసలమువలనఁ గలిగిన యీసంగ్రామమున నొండొరులఁ బొడిచికొని యాదవవీరు లెల్లరునుం బొలియుట విన్నవించెను. వృష్ణి భోజాంధక కుకుర వీరు లెల్లరు సర్వనాశముగాఁ జచ్చుట విని పాండవులు శోకసంతప్తులై మనములఁ గడుంగడు భయ మందిరి. అంతటఁ గృష్ణునకు మిక్కిలిం గూరుచు చెలికాఁ డగు నర్జునుఁడు వారి నెల్ల వీడ్కొని యేమియుం బల్కక మామ యగు వసుదేవునిఁ జూచుటకుఁ బ్రయాణమై దారుకునితోఁగూడ యాదవనగరమున కేతెంచెను. ద్వారకా

నగర మాతనికి మగఁడు నచ్చిన కులాంగనవలెఁ గానవచ్చెను. మున్ను లోకనాథుఁ డగువానిచే నాథవతులై నేఁడనాథ లగు నా వాసుదేవుని పదునాఱువేల యనుంగుభార్యలును దమకు రక్షకుఁడుగా నేతెంచిన యర్జునుఁడు కన్నులఁ బడఁగనే పెద్ద పెట్టున వాపోయిరి. గోలుగోలున విలపించు నాయంగనలను జూడఁగనే యర్జునునకుఁ గన్నులనిండ నీరు గ్రమ్మెను. భర్తను (కృష్ణుని), కుమారులను గోలుపోయిన యా స్త్రీజనమును సరిగఁ జూచుటకైనను నాతనికిఁ జేఁతగా దయ్యెను. వృష్ణులును, నంధకులును నిండుకొని, నీళ్లుగాను, గుఱ్ఱములు పెనుఁ జేఁపలుగాను, రథములు నావలుగాను, భేరీ మృదంగాది వాద్య నాదములును, రథధ్వనులునుం దరంగఘోషములుగాను, మేడలు తీరఘట్టములుగాను, రత్నములు నాచుతీఁగలగుంపుగాను, వజ్రప్రాకారములు పెద్దపెద్దయలలుగాను, రాజమార్గముల త్రిప్పులు ప్రవాహజలముల సుడులుగాను, మొగసాలలు నీరు నిలిచిన గుండములుగాను, రామకృష్ణులు మహా గ్రాహములుగాను నొక మహానదివలెఁ గనుపట్టు నాద్వారక కాలపాశములం దగులువడి నేఁడు భయంకర మగు వైతరణీ నదివలె నాతనికిఁ గాన్పించెను. యాదవశూన్యమై కళ దొఱఁగిన యానగరమున మంచుకాలమునాఁటి తామర తీఁగలునుంబలె నాతని కానందలేశమయినను గనుపట్టదయ్యెను. అట్లున్న యా ద్వారకను, నట్టి దశలో నున్న వాసుదేవుని యంతఃపురాంగనలనుం జూచి యర్జునుఁడు కన్నుల నీరు దొరఁగఁ బెద్దపెట్టున నేడ్చుచు నేలపైఁ బడియెను. అప్పుడు రుక్మిణియు, సత్యభామయు నాతనిం డగ్గఱి పుడమినిఁ బడి పెద్ద

యెలుంగున విలపించిరి. కొంతసేపునకు నేలఁబడియున్న యాతని నెత్తి బంగరుగద్దెపైఁ గూరుచుండఁ బెట్టి వారెల్లరుఁ జుట్టురాఁ బరివేష్టించిరి. అభినందనపూర్వకముగ నెల్లవార లాతని సమీపించిరి. తరువాత నర్జునుఁడును గోవిందునిఁ బేర్కొని పెక్కుభంగుల వినుతించి యా స్త్రీజనము నోదార్చి మేన మామయగు వసుదేవునిఁ జూడం జనియెను.

ఇది యాఱవ యధ్యాయము.

---

మౌసలపర్వము

— { వసుదేవుఁడు సర్వయాదవనాశమునకును దుఃఖించి సర్వభారము నర్జునున కొప్పఁ జెప్పుట } —

పుత్రశోకమునం గుమారిలు వసుదేవుఁడు తనకడకే తెంచు వీరాగ్రణి యగు నాకౌరవప్రోత్తమునిఁ గాంచెను. తన్నుఁ జూచినంతనే కడుంగడు శోకించు నా నరపాలునిఁ జూచి కన్నుల నీరు వెల్లివిరుసుడ మిక్కిలి దుఃఖితుఁడై పార్థుఁ డాతని యడుగులపైఁ బడియెను. బలిష్ఠమగు వెడలుపుటురముతోడి యమ్మహాభుజునిఁ జెలియలికొడుకును నవ్వసుదేవుఁడు లేవ నెత్తి యాఁదల మూర్కొనఁ దలఁచెను గాని య ట్లొనర్ప నాతనికిఁ జేతగాకపోయెను. అమ్ముదుసలిరా జాజానుదీర్ఘము లగు తన బాహువులతో నాతని నెన్న గౌఁగిలించి వంశవర్ధనుఁ డగు కొడుకును గృష్ణునిఁ బేరుకొనియుఁ, బాలివారైన సోదరులను, గొడుకులను, గొడుకుల కొడుకులను, బిడ్డల కొడుకులను, నెచ్చెలులను నెల్లవారిని దలంచియుఁ బేరుగ్రుచ్చి పనవి పనవి తద్దయుఁ బరవశుఁడై యిట్లు విలపించెను.

అర్జునా ! రాజన్యులనే గాక దానవులనుంగూడఁ బలువుర నుక్కడఁచిరే! యా వీరాగ్రణుల నెల్లఁ గన్నులకు దూరము చేసికొనియుఁ జావు లేక బ్రదికియే యున్నాఁడను. నీకు మిక్కిలి ప్రేమాస్పదులుగా నీ వెప్పుడు నాదరించుచుందువే యా నీ శిష్యుల దుర్నయముననే యాదవు లెల్లరుఁ గూలారిరి. నాయనా! వృష్ణివీరులలో నెల్ల నతిరథులై యుండిరే! వారినిఁ జేకొని నీవుగూడ మురిసిపోవుచుందువే ! కృష్ణునకును బ్రేమపాత్రులై యుండిరే! యా ప్రద్యుమ్నుఁడే యా సాత్యకియే వా రిద్దఱే యాదవుల యీసర్వ నాశమునకును మూలకారణ మయిరి. అర్జునా! దానికై యిటు సాత్యకిని గాని, యటు కృతవర్మను గాని నిందింపను. అక్రూరుఁడుగాని రుక్మిణీపుత్త్రుఁడు (ప్రద్యుమ్నుఁడు) గాని తప్పొనరించి రని దూఱను. ఆ బ్రాహ్మణ శాపము గలదే! అదియే యీసర్వానర్థమునకును గారణము. కాకున్నఁ గుమారా! కేశికంసుల వంటివారినిం గూడ విక్రమము సూపి తెగటార్చిన సమర్థుఁడు, బలగర్వితుఁడగు శిశుపాలునకు దేహబంధము నూడఁ దన్నిన వీరుఁడు, నిషాదవీరుఁడగు నేకలవ్యుని, గాళింగ, మాగధులను, గాంధారులను, గాశిరాజును, మరుభూమియందలి రాజన్యులను, దూరుపునను, దక్షిణమునను నున్న రాజులను, బర్వతవాసులగు నాటవిక ప్రభువులను బొడవడంచిన జగజ్జెట్టి యా మధుసూదనుఁడే యీ దుర్నయము నెల్ల నెదురనుండియు నుపేక్షించునే? నీవును, నారదుఁడును, మహర్షులును సనాతనుఁ డని, గోవిందుఁ డని, పాపవిదూరుఁ డని, యచ్యుతుఁ డని, దేవాదిదేవుఁ డని, యాతని నెఱుంగుదురు

గదా ! ఆతఁడే-సర్వసమర్థుఁడగు నాయధోక్షజుఁడే—యానా
సొంతముకోడు కే—యాకృష్ణుఁడే — యీ జ్ఞాతిక్షయమును
దనకన్నులయెదుట జరుగుచున్నదానిని సంపూర్ణముగ నుపే
క్షించెను. వేయేల? గాంధారి పలుకును, ఋషుల శాపమును
నిజముగా నాతఁ డన్యథా చేయఁ దలఁపఁడయ్యెను ; గాని
జగత్ప్రభుఁడగు నాతఁడు తలంచినఁ జేయరానిపని యున్నది
యా? అశ్వత్థామ చంపినను నీ పౌత్త్రుని బరీక్షితుని నిజతేజ
ముచే నమ్మహాత్మ్ముఁడు మరల బ్రదికించుట నీకును బ్రత్య
క్షమే కదా ! అట్టి వాఁడయ్యును, ఆ నీ చెలికాఁడు తనజ్ఞాతి
జన మెల్ల నిట్లు గూలారుచుండఁ గాపాడ నిచ్ఛగింపఁడయ్యెను.
అంతటఁ బుత్త్రులు, పౌత్త్రులు, సోదరులు, మిత్త్రులు నెల్ల
వారును సర్వనాశముగఁ గూలి నేలఁ బడుటఁ జూచి వచ్చి
కృష్ణుఁడు నాతో నిట్లు చెప్పెను. ' ఈ యాదవవంశమునకు
నంతిమకాలము నేఁటి కీరీతిగఁ బ్రాప్తమైనది. అర్జునుఁ డీ
ద్వారకకుఁ ద్వరలోననే రాఁగలఁడు. ఆతనికి యాదవుల కెల్లఁ
గలిగిన యీమహోపద్రవమును జెప్పి పుచ్చితిని. యాదవ
క్షయమును వినినంతనే తేజోధనుఁడగు నాతఁడు వెంటనే
యిచటి కేతెంచు ననుటకు సందేహము లేదు. అర్జునుఁడే
నేను. నేనే యర్జునుఁడ నని తలంపుము. ఆతఁడు చెప్పినతెఱం
గునఁ గాఁగల కార్యము నరసికొనుము. కాలగతికిఁ దల లొగ్గిన
స్త్రీజనమును, బాలుర నాతఁడే యథార్హముగ నరసికొనును.
మీకు నౌర్ధ్వ దైహిక క్రియలుగూడ నాతఁడే నిర్వర్తింపఁ
గలఁడు. ధనంజయుఁ డిచటినుండి మరలిపోవఁగనే కోట
గోడలతోఁగూడ నట్టిళ్లతోఁగూడ నీపట్టణమును సముద్రుఁడు

ముంచివేయును. ఇఁక నేనో, యిప్పుడే యరణ్యమున కేఁగి బల రామునిఁ గలసికొని యెందేని యొక పుణ్యప్రదేశమున నియతుఁడనై కాలమును గాంక్షింతును.'

ఇట్లు చెప్పి తలఁపునకును గూడ మించినపరాక్రమము గల ప్రభుఁడగు నా హృషీకేశుఁడు పసికూనలతోఁ గూడఁ బండఁబాఱిన ముదుసలిని నన్ను దిగవిడిచి యేదే నొకదెసకుం జనియెను.

నాయనా ! యిల్లిల్లవారిని గోలుపోయి మహాత్ములగు నా పుత్త్రుల బలరామకృష్ణులఁ దలఁచికొనియు, మహాఘోరమగు నాజ్ఞాతిక్షయమును దలపోసికొనియు శోకపీడితుఁడనై యాహారమును ముట్టమానితిని. అటు చావనురాక, యిటు బ్రదుకను లేక నడపీనుఁగనై కుమిలి పోవుచున్నాఁడను. నాయనా! యింతలో దైవవశమున నీవు గానేవచ్చితివి. ఇఁకఁ గృష్ణుఁడు చెప్పిపోయిన దంతయు నాచరింపుము. అర్జునా ! యిదే యీ రాజ్యమును, స్త్రీలను, నమూల్యవస్తువులను నీకు స్వాధీన మొనర్చితిని. పరంతపా ! యింతవఱకును బ్రియతమములుగాఁ గాపాడుకొనిన యీ పాడు ప్రాణముల నిఁక హాయిగాఁ బరిత్యజింతును.

ఇది యేడవ యధ్యాయము.

---

## మౌసలపర్వము.

వసుదేవాదులు కాలగతి నొందుట. అర్జునునిచే గొంపోవఁబడు యాదవ స్త్రీలు దోపిడిగాండ్రచే భంగపాటు నొందుట. అర్జునుఁడు వ్యాసాశ్రమము చేరుట.

మామ యగు వసుదేవుఁ డిట్లుపలుకఁగనే పరితపించు మనస్సుతో విన్నఁబాటు నందిన మొగముతో నర్జునుఁ డాతని కిట్లనియెను. 'రాజేంద్రా! యాదవ ప్రవీరుఁడగు కృష్ణుఁడు సకలబంధువులును బాడువెట్టిపోయిన యీనేలను జూచుచుఁ జాలసేపిచట నిలువఁ జాలను. మామా! రాజేంద్రుఁడగు ధర్మరాజును, భీమసేనుఁడును, నకులుఁడును, సహదేవుఁడును, ద్రౌపదియు, నేనును మేమాఱుగురమును నొక్కటేమనస్సు గలవారము. ఆరాజన్యుఁడును దేహయాత్ర విరమించుటకు నిత్యమును గాలకాంక్షియై యున్నాఁడు. నేఁటి కా కాలము సంప్రాప్తమైనది. కాలతత్త్వము లెస్స యెఱింగిన నీకుఁ గానరాని దేమున్నది? ఎల్లవిధములను యాదవాంగనలను, బాలవృద్ధులనుం,గొని చని యింద్రప్రస్థమునకుఁ జేర్చెదను.'

అంతట నర్జునుఁడు దారుకుని వైపుఁ జూచి 'దారుకా! యాదవవీరుల యమాత్యులను జూడవలయును. ఆలస్య మొనరింపకుము' అని పలికి దుఃఖించుచు యాదవ సభామందిరమగు సుధర్మను బ్రవేశించెను. పిమ్మట సముచితాసనమున నున్న యా వీరునిని మంత్రులు మొదలగు ప్రకృతులును, బ్రాహ్మణోత్తములును, దక్కిన నగరవాసులు నుచిత

రీతిని డగ్గతి పరివేష్టించిరి. చిన్నవోయిన మొగములతో మనసు మనసున లేక, యేమి చేయుటకును దిక్కు దోఁపక యున్న వారి నందఱను జూచి మిక్కిలి విన్నఁదనముతో సర్జునుఁడు కాలోచితముగ నిట్లు పలికెను.

'వృష్ణ్యంధక జనము నెల్ల స్వయముగా నింద్రప్రస్థము నకుఁ గొని పోవుదును. ఈ పట్టణము నంతయుఁ గొలఁది దిన ములలో సముద్రము ముంచి వేయఁగలదు. కావున నంద ఱును వాహనములను, నానావిధములగు శ్రేష్ఠవస్తువులను సిద్ధముచేసికొనుఁడు. కృష్ణుని పౌత్రుఁడగు నీవజ్రకుమారుని నింద్రప్రస్థమున మీకు రాజుగా నొనరించెదను. నేఁటి కేడవ నాఁడు నిర్మలమూర్తియై సూర్యభగవానుఁ డుదయించు నప్పటికి మన మందఱమును బురమును వదలి యూరివెలుపలఁ జేరి యుండవలయును. ఆలస్యము నొనరింపక ప్రయాణమునకు సిద్ధము గండు.' అని యిట్లు పుణ్యావర్తనుఁడగు నాయర్జునుఁడు పలుకఁగనే వారందఱు నుత్సాహమును దెచ్చికొని శీఘ్రముగఁ దమతమ ప్రయాణమునకు వలయు సామగ్రిని సిద్ధము నొన రించికొనిరి. అర్జునుఁడును గృష్ణునియింట విడిసి గాటమగు శోకముచేఁ గలిగినమూర్ఛ మాటిమాటికి ముంచి యెత్తుచుండ నా రేయిని గడపెను.

ఆ రాత్రి వేగఁగనే శూరుని కొలమునకుఁ బెట్టనిసొమ్మై, ప్రతాపశాలి, తేజోధనుఁడు నగు వసుదేవుఁడు యోగమార్గ మునఁ బరమపదము నందెను. అంత వసుదేవునియింట నాక్రోశించు నంతఃపురాంగనల యేడ్పుటెలుంగులు చెవులకు ఱంపపుఁగోఁతలై మిన్నుముట్టెను. చెదరిన తల వెంద్రుకల

తోఁ బ్రిదిలిన ముత్తెపుసరులతో దీనాతి దీనముగఁ జేతు లతో ఱొమ్ము బాదుకొనుచు స్త్రీజన మెల్ల గొల్లున నేడ్చెను. పరమపదించిన యా వసుదేవునితోఁ గూడ నాతని సతీ మణులు దేవకి, భద్ర, రోహిణి, మదిర యను పుణ్యాంగనలు సహగమన మొనరింప సిద్ధపడిరి. అప్పుడు పార్థుఁ డా వసుదేవు నిని గొప్పదియు, మనుజులు మోయునదియు నగు నొక యమూల్యయానముపై నునిచి పురము వెడలించెను. ఆ యాన మువెంబడి దుఃఖశోకాతులులై ద్వారకానగరమున నున్న యెల్లవారును, పౌరులు, జానపదులు, మిత్రులు నెడనెడ ననుసరించి చనిరి. వసుదేవుని యశ్వమేధపు గొడుగును, వెలిఁ గెడునగ్నులను గొని యాజకు లాతనిశవయానమునకు ముం దర నడచిరి. వేలకొలఁది పుణ్యాంగనలును, గోడండ్రును జుట్టురా నరుదేరఁ జక్కఁగా నలంకరించికొని దేవకి మొదలగు నాతనిధర్మపత్నులు నలువురును నా యానమునకు వెనుకనై చనిరి. ఇట్లు నడిచి బ్రదికియున్నప్పు డా మహాత్ముఁడు మిక్కిలి ప్రేమించు చుండిన యొక ప్రదేశమున వా రెల్లరు నా వసు దేవుని శరీరమును సొదపై నునిచి పితృమేధము నొనరించిరి. చితిపై నున్న శూరనందనుఁడగు నా వసుదేవునితోఁ గూడఁ బుణ్యాంగనలగు నాతని నలువురు పత్నులును బతితోడిదే లోక మని యా సొదపై నెక్కిరి. పిమ్మట నర్జునుఁ డా నలు వురు పుణ్యస్త్రీలతోఁగూడ వసుదేవుని శరీరమును మంచి గంధపుఁ జెక్కలతోడను, నింకను బెక్కుసుగంధ వస్తువుల తోను దహింపఁజేసెను. అప్పుడు మిక్కిలి మంటలు రేఁగి కాల్చు నగ్నిహోత్రుని ఛటచ్ఛటాశబ్దములును, సామగాన

యొనరించు వేదవిదుల ఘోషమును, వా విడిచి యేడ్చెడు నెల్లవారి యాక్రందన ధ్వనులును గలసి మహాధ్వని జనించెను. తరువాత వజ్రుఁడు మున్నుగా వృష్ణ్యంధకకుమారులును, స్త్రీలును నా వసుదేవునకుఁ దిలోదకముల నొసంగిరి. ఇట్లర్జునుఁడు ధర్మలోపము గలుగకుండ నా ధర్మమును జేయించి యాదవు లందఱును నశియించిన యా యుద్ధభూమికిఁ జనియెను.

అచట యుద్ధరంగమునఁ బడియున్న యా బంధు జనుల నందఱను జూచి యాతఁడు మిక్కిలి దుఃఖించెను. పిదప బ్రాహ్మణశాపముచే మూఁడంచుతుంగలనుండి గలిగిన ముసలములచేఁ గూలిన యా బంధువుల కెల్ల యథాప్రధానముగఁ గాలోచిత క్రియల నన్నింటిని నాతఁడు నెఱవేర్చెను. తరువాత నర్జునుఁడు పురుషోత్తముఁడగు కృష్ణభగవానునిఁ గనువాఁడై తరలి చని యొక్కయెడ నమ్మహాత్ముని శరీరము పడియుండఁ జూచి పెద్దపెట్టున విలపించుచు మూర్ఛాక్రాంతుఁ డయ్యెను. కొంతవడికిఁ దెలివంది లేచి యమ్మహాత్ము పలుకుల నెల్లఁ దలంచుకొని శోకము పొంగిపొరలుచుండ నాప్తకారులగు పురుషులతో బలదేవుని శరీరమును వెదకించి తెప్పించి యయ్యిరువుర దేహములకు నాతఁ డగ్ని సంస్కారమును గావించెను.

ఇట్లయ్యర్జునుఁడు నిహతులగు యాదవుల కెల్ల యథావిధిగఁ బ్రేతకార్యముల నిర్వర్తించి యేడవనాఁడు రథారూఢుఁడై సత్వరముగఁ బ్రయాణ మయ్యెను. మగలు చచ్చి శోకపీడితలగు వృష్ణివీరుల స్త్రీ లందఱును గుఱ్ఱములను, నెడ్లను, వేసడములను నొంటెలనుం బూంచిన యానములపై

నెక్కి యేడ్చుచు మహాత్ముఁడగు నా ధనంజయుని వెంటఁ జనిరి. మావటివారును, సారథులును మున్నగు యాదవవీరుల భృత్యు లందఱు నాతనినే యనుగమించిరి. వీర శూన్యమై బాలవృద్ధమయమగు పౌరజానపదజన మంతయు నర్జునుని యానతిమెయి స్త్రీజనమును బరివేష్టించి నడిచిరి. పాదరక్షకులు వెంట రా నడగొండలవంటి యేనుఁగులతో గజారోహకులును, ఉత్తమాయుధములఁ బూనిన వీరులును వారి వెంట నేఁగిరి. వృష్ణ్యంధకకుమారు లెల్లరును, మిక్కిలి ధనములతోఁ గూడ బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రులును నర్జునుని బరివేష్టించి చనిరి. వాసుదేవుని పదునాఱువేల యంతఃపురాంగనలును గృష్ణుని పౌత్త్రుఁడగు వజ్రకుమారుని మున్నిడుకొని పయనించిరి. పెక్కు వేలు, పెక్కు లక్షలు, పెక్కర్బుదములునుం గా మగలు చచ్చిన తక్కుంగల వృష్ణ్యంధక స్త్రీజన మెల్ల వారివెనుక బయలుదేఱిరి. ఇట్లు మహాసముద్రమువంటి యా యాదవచక్రమును మిక్కుటములగు ధనములతోఁ గూడిన దానిని శత్రునగరవిజేత యగు రథికశ్రేష్ఠుఁడు పార్థుఁ డొక్కఁడే భారవాహియై నడిపించెను. అమ్మహాజన మెల్ల నీవలికి వచ్చినవెంటనే భీషణమకరాకులమగు సముద్రము సర్వరత్నసంపూర్ణమగు ద్వారకను ముంచివైచెను. పురుషశ్రేష్ఠుఁ డగు నయ్యర్జునుఁ డేయే తావును దాఁటి యీవలకు నడచునో యా యా తావు నెల్ల సముద్రము నీటితో ముంచుచు వచ్చెను. ఆ యద్భుతమును గన్నెదురఁ గనుంగొని ద్వారకావాసులగు నా జను లందఱు 'అహో! దైవసంకల్ప!' మని పలుకుచు మిక్కిలి వేగ

ముగ నావలకుం జనిరి. మనోహరములగు నడవులలోను, బర్వతములయందును, నదులకడను విడిదలలఁ గావించుచు ధనంజయుఁ డయ్యాదవాంతఃపురమును నడిపించెను. ఇట్లు చనిచని యా విజయుఁడు సంపన్నమగు పంచనదమున గో పశు ధాన్య సమృద్ధమగు నొక ప్రదేశమున నెల్లవారిని విడియించెను.

అంతట నర్జునుఁ డొక్కఁడే నడిపించుకొని పోవుచున్న యనాథలగు నందఱు స్త్రీలను గాంచి పాపాత్ములగు దొంగలు కొందఱు లోభోపహతులై యొక్కచోఁ జేరి యిట్లాలోచించిరి. 'అదిగో యర్జునుఁ డొక్కఁడే ధనుర్ధారియై నడిపించుకొని పోవుచున్నాఁడే! యా మ్రుక్కడిమూఁకలో నెవ్వరును దిక్కులేరు. అందఱును ముదుసళ్లును, బాలురును, యోధు లున్నను వారు చేవచెడినవారివలె నున్నారు. మనలను లెక్కసేయక యర్జునుఁ డీగుంపునిచటు దాఁటించుచున్నాఁడు.' అనియిట్లొండొరులతోఁ గూడఁబలుకుకొని భయంకరాకారులగు నాయాభీరు లందఱును జేతులలో బడితెలను బూని వేలకొలఁది నొక్కమాటుగా మట్టిపెళ్లలను రువ్వుచు, నయ్యాదవసంఘముపైఁ బఱచిరి. కాలవిపర్యయము ప్రేరేపింప వా రందఱుఁ బెడబొబ్బలువెట్టి వేఱువేఱుగ నెల్లవారిని బెదరించుచు దోఁచుకొనుటకై వారిమీఁదం బడిరి. అంతట ననుచరులతోఁ గూడ గిరుక్కున మరలి బాహుశాలియగు నర్జునుఁ డా దొంగలను జూచి వెడనవ్వు నవ్వుచు 'మరలి పొండు. పాపాత్ములారా! బ్రదుకుపై నాస గలదేని మరలి పొండు. ఇదే నా బాణములచేఁ దుంటలు తుంటలు గాఁ దెగితి రని తలంపుఁడు.' అని యదలించిన నవ్వీరునిమాటలఁ బాటిసేయక వీటఁబుచ్చి

మాటిమాటికి నడ్డుపెట్టుచున్నను నమ్మూకపైఁ బడి దొంగలు దోఁచుకొనసాగిరి. అంత నర్జునుఁడు నజరమును, దివ్యమునగు గాండీవము పేరిటి యామహాధనుస్సును నెక్కుపెట్టసాగియుఁ దివియలేక తివియలేక యెట్టకేలకుఁ దివిచి యల్లెత్రాటిని దగిలించెను. అంతలో దొంగలదోఁపిడి సంకుల మయ్యెను. అర్జునుఁడు దివ్యాస్త్రములను స్మరించెనుగాని యొక్కటియు నాతనికి స్ఫురింప దయ్యెను. ఇట్లు బాహుబలము పొలిపోవుటయు, దివ్యాస్త్రములు తోఁపకుండుటయు నను నీగొప్ప విపర్యాసమున కాతఁడు మిక్కిలి చిన్నవోయెను. ఏనుఁగులపైనను, రథములపైనను, గుఱ్ఱములపైనను నుండి యుద్ధము గావించు నా వృష్ణియోధు లందఱునుగూడ దొంగలు దోఁచుకొని పోవుచున్న తమ తమ ధనములను మరలించుకొనఁ జాలరైరి. స్త్రీజనము మిక్కుటముగా నుండుటచేతను, దొంగలు నలుప్రక్కల వచ్చి క్రమ్ముకొనుటచేతను, నయ్యాబలలను గాపాడుట కర్జునుఁడు కడుంగడుఁ బ్రయత్నము నొనరించెను. అట్లయ్యును నా వరాంగనలు, యోధు లందఱును జేయునది లేక చూచుచుండ నలువైపులకును నీడ్చికొని పోఁబడిరి. మఱికొందఱు స్వేచ్ఛమెయి నెందేనియుఁ బరువెత్తిపోయిరి. అట్టి యా దశను గనుంగొని యుద్విగ్నహృదయుఁడై ధనంజయుఁడు గాండీవ నిర్ముక్తములగు శరపరంపరల నా చోరులపైఁ బరగించెను. యాదవయోధు లెల్ల నోపినకొలఁదిఁ బార్థునకు బాసటయై వారిని వారించిరి. కాని మఱునిముసముననే పూర్వ మెప్పుడును నక్షయములై రక్తపానమునకు నాలుకలు గోయు శరములతో నతత

పరిపూర్ణములగు నర్జునిని యంబులపొదు లొక్కబాణమేనియు లేకుండ శూన్యము లయ్యెను. ఇట్లు శరము లెల్ల సంక్షయము నందుటయు దుఃఖశోకములు పెనఁగొన నయ్యింద్రనందనుం డెట్టకేలకుఁ గేల నున్న గాండీవపు వింటిబ్రద్దతో నా దోఁపిడి కాండ్రను జావమోఁదెను. జనమేజయరాజేంద్రా! యేమని చెప్పుదును? అట్లు పార్థుఁడు చేయునది లేక చూచుచుండఁగనే యామ్లేచ్ఛులు యాదవుల యుత్తమాంగనలను లాగికొని నలువైపులకును బరువెత్తిపోయిరి. ధనంజయుఁడు నద్దైవకృత మునకు దురపిల్లుచు దుఃఖశోకములం గూరి తుదకు నిట్టూర్పులు పుచ్చుచు నిలిచెను. దివ్యాస్త్రము లెల్లఁ దోఁపమియు, బాహుపరాక్రమ మట్లు చేవచెడుటయుఁ దుట్టతుదకుఁ జేతి విల్లును జెప్పినమాట వినమియు, నక్షయతూణీరములుం గూడఁ బాడునడుటయు, నాతఁడు మనమునం గళవళమంది తుద కిది యెల్ల దైవకృత మని యెంచి కుక్కురు మిక్కురు మనకుండ వెనుకకు మరలెను. అంతట బుద్ధిశాలియగు నయ్యర్జునుఁడు మిగిలిన స్త్రీజనమును, దోఁచుకొనిపోఁగాఁ జిక్కిన కొలఁది పాటి యుత్తమవస్తువులను గొని నడచి కురుక్షేత్రమున విడిదలఁ గావించెను.

పిమ్మట నాధనంజయుఁడు యుధిష్ఠిరు ననుమతి నెఱింగిన వాఁడు గావున వంశకర్తలగు నయ్యాదుకుమారుల నట నట రాజ్యము లొసంగి నిలిపెను. కృతవర్మతనయుఁడగు నశ్వపతి యనువానిని మృత్తికావత మనుపురమున ఖాండవారణ్య దేశమున కెల్ల రాజుగా నభిషేకించి నిలిపెను. దోఁపిడి పోఁగాఁ

జిక్కిన భోజవీరుల కళత్రముల నెల్ల నాతని కప్పగించి యచ టనే నిలిచెను. తక్కిన స్త్రీలను, బాలురను, వృద్ధులను గొని యాతఁ డింద్రప్రస్థమున కేతెంచి వీరశూన్యమగు నాగుంపు నంతయు నచట నిలిపెను. సాత్యకి ప్రియనందనుని యూయు ధాని యనునాతని సరస్వతీనగరమున నునిచి యాతని వంశ మునకుం జెందిన బాలవృద్ధాదుల నాతనికడ నిలిపెను. తక్కిన వారి కెల్ల రాజుగా నింద్రప్రస్థమున వజ్రకుమారుని రాజ్యము నొసంగి యభిషేకించెను. ఆతనికడ నునిచిన స్త్రీ జనములో నక్రూరునిభార్య లావజ్రకుమారుఁ డెంత వారించి నను నిలునక యెందేనియుం జనిరి. రుక్మిణీదేవియు, గాంధా రియు, శైబ్యయు, హైమవతియు, జాంబవతియు సొద సొచ్చి పతి ననుగమించిరి. సత్యభామయుఁ దక్కుం గల కృష్ణుని దేవేరులును దపము సేయ నిశ్చయించి యర ణ్యమున కేఁగిరి. తనవెంట వచ్చిన ద్వారకావాసు లగు పౌరుల నెల్ల యథార్హముగ వారివారి వృత్తులు తొంటి యట్లి చెల్లుచుండ నేర్పాటు గావించి యర్జునుఁ డావజ్రున కప్పగిం చెను. ఇట్లు కాలోచితములగు కృత్యముల నెల్ల నిర్వర్తించి పార్థుఁడు కన్నుల నశ్రువులు గాఱుచుండ నాశ్రమస్థుఁడగు కృష్ణద్వైపాయన మునీంద్రునిఁ గనుఁగొనఁ జనియెను.

ఇది యెనిమిదవ యధ్యాయము.

---

## మౌసలపర్వము

**వ్యాసునిచేఁ బ్రబోధితుఁడై యర్జునుఁడు హస్తినాపురమునకు మరలి వచ్చుట.**

రాజేంద్రా! వినుము. అట్లయ్యర్జునుఁడు సత్యవాది యగు నమ్మహామునీంద్రుని యాశ్రమమును జొచ్చి యచట నేకాంతమున నాసీనుఁడై యున్న సత్యవతీనందనుఁ డగు కృష్ణద్వైపాయనమహర్షినిఁ గాంచెను. సర్వ ధర్మముల నెఱింగిన యా మహాతపస్విని దరియఁ జని యాతఁడు 'నే నర్జునుఁడను' అని తనపేరు తెలిపి యభివాదము నొనరించెను. ఆ మహర్షియుఁ బ్రసన్నుఁడై యాతనిని స్వాగత మడిగి కూర్చుండ నియోగించి వికలహృదయుఁడై మాటి మాటికి నిట్టూర్పులు పుచ్చుచుండుటఁ గని యాతఁడు విషణ్ణమనస్కుఁ డగుట యెఱింగి యిట్లు పలికెను. 'అర్జునా! గోటినీరును, వెంట్రుకలు విదిలింపఁ జిలుకు జలమును, గుడ్డతుదిఁ జాఱునుదకమును, కడవమూతినుండి కార్చునీరమును నను వీనియం దేదియైన శరీరమును దడిపినను, రజస్వల యగు తరుణిని గదిసినను, బ్రహ్మహత్య నొనరించినను, యుద్ధమునఁ బరాజయము నందినను నీ యేడుకారణములచేఁ బురుషుఁడు సిరిఁ దొలంగు నందురు. వీనిలో నేదియైన నిన్ను సోఁకెనా? ఏల సిరి దొలఁగినవానివలెఁ గనుపడు చున్నాఁడవు? తొల్లింటికన్నఁ జాల వేఱుపడి యున్న నిన్ను గుర్తింపనుంగూడఁ జాలక పోయితినే! ఏమిది? అర్జునా! వినిపింపఁదగునేని నాకు సత్వరముగ నెఱిఁగింపుము.'

అనిన నమ్మునీంద్రున కర్జునుఁ డిట్లనియె. 'మునీంద్రా! తొలుకారుమబ్బునుంబోని నిగనిగలాడు నెమ్మేనితో విరిదామరలం దెగడు కనుదోయితోఁ గలకలలాడు దేవుఁడు—ఆ కృష్ణుఁడు బలరామునితోఁ గూడ శరీరమును వీడి దివి కేఁగినాఁడు. మహాత్మా! దానిని దలఁచి దలఁచి శోకముచే మేను పరవశ మగుచున్నది. ఎప్పుడును జావుపైఁ గోరిక గలుగుచున్నది. అమృతమూర్తియగు నా దేవదేవుని పలుకులు విని, స్పృశించి, కని, యమృతమువంటి యానందము ననుభవించుట దలఁపునకు వచ్చిన శరీరము వశము గాక మూర్ఛాక్రాంత మగుచున్నది. ముసలమువలనఁ గలిగిన యీ మహాసంగ్రామమున బ్రాహ్మణశాపమునంజేసి ప్రభాసతీర్థమున వృష్ణివీరుల కెల్లఁ గలిగిన యీ ప్రధ్వంసము—సర్వవీర వినాశకరము. అబ్బ! తలఁచుకొనిన నిప్పుడును మేను జలదరించుచున్నది. ఆ మహాత్ము లందఱును సింహపరాక్రములు, కడుం గడు బలశాలులు, శూరాగ్రణులు. అట్టి యీ భోజులు, వృష్ణులు, నంధకులు నొండొరువులతోఁ బోరాడుకొని యుద్ధమునఁ గూలిరి. మహాత్మా! చూడుము. అది యెంత కాలవిపర్యయమో గాని గదలు మొత్తుచున్నను, పరిఘము లొత్తుచున్నను, శక్తులు పైఁబడినను జలింపక యోర్చుకొను నాయినుపగుదియలవంటి బాహుదండములు గల వీరులు తుంగల వ్రేటులకుఁ జచ్చిరి! బాహుశాలులగు నా యాదవవీరు లట్లొండొరులఁ బొడిచికొని యైదులక్షలమంది నిధనము (మరణము) నందిరి. అంతులేని పరాక్రమము గల యీ యదువీరు లెల్ల నిట్లు సర్వనాశ మందుటయు, యశోధనుఁ

డగు వాసుదేవుని మరణమును మాటిమాటికిని దలంపునకు వచ్చి యూఱట గలుగకున్నది. మహాసముద్ర మింకఁబొఱుట, మందరపర్వత మున్మూలిత లూఁగుట, మిన్ను విఱిగి నేలపైఁ బడుట, యగ్ని చల్ల నగుటయునుబోలెఁ గృష్ణుఁడు మరణించుట యనిన నింకను నమ్మఁజాల కున్నాఁడను. కృష్ణుఁడు దిగ విడిచి పోయిన నాకు నీలోకమున బ్రదుకవలయు నను కోరిక లేదు. మునిసత్తమా ! యింతకంటెను గష్టతరమగు వృత్తాంతము నిముసము నిముసమునకుఁ దలంపునకు వచ్చి మనస్సును వ్రయ్యలుగాఁ జీలిచి వైచునది గలదు. దానిని దెలిపెదను వినుము. పంచనద నివాసులగు బోయలు యుద్ధమున నన్నుఁ దిరస్కరించి నేను గుడ్లు వెల్లగించుకొని చూచుచుండఁగనే వేలకొలఁది యాదవ కళత్రములను గొల్ల గొని పోయిరి. అపుడు గాండీవము నందుకొందునుగదా దానికి నల్లెత్రాడు నెక్కించుటగూడ నాకుఁ జేతఁ గాదయ్యెను. తొల్లింటివలె నుండక నా బాహుబలము సన్నగిలి పోయెను. నానావిధము లగు దివ్యాస్త్రములఁ దలంప నొక్కటియుఁ దోఁపదయ్యెను. సాధారణము లగు బాణములుగూడ నిముసములో నక్షయతూణీరముల నుండి యంతర్హితము లయ్యెను. అమేయస్వరూపుఁడును, శంఖ చక్ర గదా ధారియు నై చతుర్భుజములతోఁ దామరరేకులను దెగడు కనుదోయితోఁ, గడుంగడు మిక్కుటమగు తేజముతో శత్రు సైన్యముల నెల్లఁ గాల్చి వైచుచుఁ బూర్వ మెప్పుడును నా రథమునకు ముందు నడచు శ్యామసుందరవిగ్రహుఁ డగు నప్పురుషుఁ డిప్పుడు నా కన్నులకుఁ గాన రాఁడయ్యెను.

మునీంద్రా ! వేయేల ? ఎవ్వఁడు ముందై నిజతేజముతో శత్రు సైన్యముల నిర్దహించుచుండ నేను వెనుకగా గాండీవ నిర్ముక్తములగు శరములతో వానిని గూల్చుచుంటినో యా మహాత్మునిం గానమిచే విషాదపరవశుఁడనై సుడివడు వానివలె నయితిని. సర్వవిధముల నిర్వేదము నందిన నా మన మున కెందును నూఱట దొరకకున్నది. ఆ దేవకికొడు కగు నా దేవదేవుని— నా వాసుదేవుని— నా యనాదిని—నా ప్రభువును—నావీరుని—నా జనార్దనునిఁ గోలుపోయిన నాకు బ్రదుకుపై రోఁత పుట్టుచున్నది. కృష్ణుఁడు పోయె నని వినఁ గనే నాకును దిక్కులెల్లఁ గటికిచీఁకటిగా నయినవి. మహాను భావా ! యిట్లు బంధువు లందఱును జచ్చి బాహుబలము పాడై యన్నివిధములఁ గాడువడి నిలుకడ గానక పరువులు వాఱు నాకు నేది శ్రేయమో దాని నుపదేశించుటకు మీరే యర్హులు' అని యర్జునుఁ డాడిన యీ పలుకుల నెల్ల విని వేద వ్యాసుఁ డిట్లు బదులు పలికెను.

'అర్జునా ! ధర్మవ్యవస్థను సంరక్షించుటకై యవతరిం చిన నారాయణునితోఁగూడ దేవతలు నిజాంశముల యాదవ వృలై జనించిరి. అమ్మహాత్ముఁడు నిజతత్త్వమునఁ గలియఁ దలఁచి యుపేక్షవహింప నాతనితోఁగూడ వారును దివి కేఁగిరి. బ్రాహ్మణశాపము నిశ్శేషముగ భస్మీపటల మొనరింప నా వృష్ణ్యంధకమహారథు లందఱును నశించిరి. వారినిగూర్చి శోకింపకుము. విధివిధాన మట్లే యుండినది. మహాత్ములగు మునులు నట్లే శపించిరి. ఇది యెల్ల నెఱింగియే తొలఁగింపఁ జాలియును వాసుదేవుఁ డీయనర్థము నుపేక్షించెను. కాదేని

చరాచరములతోఁడి ముల్లోకము నంతయునైన నన్యథా కరింపఁజాలిన యమ్మహాత్మునకు మునుల శాపముఁ దప్పించుట యేమి లెక్క? ఇఁక నీ బలక్షయమా? పూర్వము ప్రభాసతీర్థమునఁ గుపితుఁడై యష్టావక్రముని యయ్యాదవాంగనలకు శాపము నొసంగెను గావున నట్లు గలిగినది. చతుర్భుజుఁడై చక్ర గదా ధారియై నీవలని స్నేహమునంజేసి నీ రథమునకు ముందు నడచుచుండిన యప్పురుషోత్తముఁడు- సనాతన మునీంద్రుఁడగు వాసుదేవుఁడు-విశాలలోచనుఁడగు నా కృష్ణుఁడు భూభారమును బాపి, తనువును వీడి, యుత్తమమగు నిజస్థానము నందెను. వీరాగ్రణీ! బాహుశాలివగు నీవును—భీమసేనుఁడును, గవలును దోడుగా నిట మహత్తరమగు దేవకార్యము నిర్వర్తించితివి. కావున నిఁక మీ రందఱును గృతకృత్యులై కాలమునకు సంసిద్ధులుగ నున్నా రని తలంతును. మీ కిఁక సంసారమునుండి ముక్తులగుట యాలోచితమగు కార్యము. ఇది మీకు శ్రేయస్కరము. కుమారా! బలము గాని, బుద్ధి గాని, తేజము గాని, విజ్ఞానము గాని ప్రాప్తకాలముననే సమకూడును. కాలము మాఱినపుడు నశించును. జగద్బీజమగు (ఆకాశాదులగు) సర్వమునకును గాలమే మూలము. యదృచ్ఛాగతిచే సర్వమును బయలుపఱచు నదియు, మరలఁ దనలో నడంచుకొనునదియును గూడఁ గాలమే. అదియే యొకప్పుడు బలవంతమును, మఱియొకప్పుడు దుర్బలము నగును. అదియే యొకప్పుడు సర్వమును శాసించును. మఱి యొకప్పుడు శాసింపఁబడును గూడ. దివ్యాస్త్రము లన్నియుఁ గృతకృత్యము లగుటంజేసి నీ

కెట్లు వచ్చినవో యట్లే తొలంగినవి. కాలము వచ్చినప్పు డవి మరల నీ చేతికి వచ్చును. ఉత్తమగతి కేఁగుటకు మీ కిది తగినకాలము. అట్లొనరించుటయే శ్రేయ మని నాయభి మతము.

ఇట్లు మహాతేజస్వియగు వ్యాసమహామునీంద్రుఁడు పలికిన పలుకుల నెఱింగి యమ్మహాత్మునిచే ననుజ్ఞఁ గొని యర్జునుఁడు హస్తినాపురమునకు మరలెను. ఇట్లేతెంచి యాతఁడు నగరము సొచ్చి, యుధిష్ఠిరుని సందర్శించి వృష్ణ్యంధకకులములం గూర్చి జరిగిన యా వృత్తాంతము నంత యును దెలిపెను.

ఇది తొమ్మిదవ యధ్యాయము.

గద్య:—ఇది విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి
వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి ప్రణీత
మైన వచనభారతమందలి
మౌసలపర్వము సంపూర్ణము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

---



శ్రీః

# మహాప్రస్థానికపర్వము

---

ధర్మరాజు పరీక్షిత్తునకుఁ బట్టము గట్టి మహాప్రస్థానము సేయుట. అగ్నిదేవుని ప్రేరణచే నర్జునుఁడు గాండీవమును సముద్రములో వైచుట

ఇట్లు వృష్ణ్యంధక వంశములకు ముసలమువలనఁ గలిగిన యా మహాసంగ్రామమును వినియుఁ,గృష్ణపరమాత్ముని పరమ పదప్రాప్తి నాకర్ణించియు 'నావలఁ బాండవు లేమి చేసిరి?' అని యడిగిన జనమేజయనరపాలునకు వైశంపాయనుఁ డిట్లు వచించెను.

రాజేంద్రా ! వినుము. కౌరవేంద్రుఁడగు ధర్మజుఁడు యాదవులకుఁ గలిగిన యా గొప్పయుద్ధమును విని యుత్తమ గతికై యిలు వీడి చన నెంచి యర్జునునిఁ జూచి యిట్లనియె. "మతిమంతుఁడా ! సర్వ భూతములను కాలమే పరిపాకము నందించుచున్నది. ఆ కాలపాశమునకు నేనును, నీవునుగూడ లోనుగాక తప్పదు. ఈ విషయమై యాలోచింపుము." అని చెప్పఁగా విని యర్జునుఁడు "కాల మెప్పటికిని గాలమే."యని పలుకుచు ధీశాలియగు పెద్దన్నగారి వాక్యము నంగీకరించెను.

ఆతని యభిప్రాయము నెఱింగి భీముఁడును, నకుల సహదేవులును నర్జునుని వాక్యమున కంగీకారమును దెలిపిరి. అంత

నయ్యుధిష్ఠిరుఁడును ధర్మానుష్ఠానవాంఛచేఁ బ్రస్థానము (సర్వమును ద్యజించి యిల్లు వెడలిపోవుట) నొనరింపఁ దలఁచి వైశ్యాపుత్త్రుఁడగు యుయుత్సునిఁ బిలిపించి, 'సర్వరాజ్యమును నారసికొను' మని యాతని కప్పగించి బాలుఁడగు పరీక్షితుని హస్తినాపురమున రాజుగా నభిషేకించెను. అప్పు డప్పాండవాగ్రజుఁడు సుభద్ర నవలోకించి దుఃఖాకులుఁడై 'అమ్మా ! యీ బాలుఁడు నీ కుమారుని కుమారుఁడు. ఈతఁడే యిఁకమీఁదఁ గౌరవరాజు గాఁగలవాఁడు. శేషించిన మొలకను వజ్రకుమారుని యాదవుల కెల్ల రాజును జేసితిని. ఇట హస్తినాపురమునఁ బరీక్షితుని, నట నింద్రప్రస్థమునఁ గుమారవజ్రుని నారసి పాలించుకొనవలసిన భారము నీయది. పరమధర్మమైన యీనీ కృత్యమును వదలి యితరవిధముగా నాలోచింపకుము.' అని చెప్పెను.

పిమ్మట ధర్మాత్ముఁడగు నా యుధిష్ఠిరుఁడు తమ్ములతోఁ గూడి కృష్ణపరమాత్మునకును, మామయగు ముదుసలికి వసుదేవునకును, బలరామాదులగు తక్కినవారికిని నప్రమత్తుఁడై తిలోదకము లొసఁగెను. ఎల్లవారి నుద్దేశించియు యథావిధి శ్రాద్ధములను జేసెను. కృష్ణు నుద్దేశించి తపోధనులగు కృష్ణద్వైపాయనునకు, నారదునకు, మార్కండేయునకు, భారద్వాజునకు, యాజ్ఞవల్క్యునకును వాసుదేవస్మరణపూర్వకముగ షడ్రసోపేతముగ భుజింపఁబెట్టెను. నూర్లకొలఁది వేలకొలఁది యునుగా రత్నములను, దుకూలములను, గ్రామములను, గుఱ్ఱములను, రథములను, గన్యకలను బ్రాహ్మణోత్తములకు దానము చేసెను. తరువాత భరతకులప్రదీపకుఁడగు నా ధర్మ

రాజు కులాచార్యుఁడగు కృపునిఁ బౌర పురస్సరముగఁ బిలిపించి గద్దియపైఁ గూర్చుండ నిడి పరీక్షిత్కుమారు నాతనికి శిష్యుఁడుగా నప్పగించెను.

పిమ్మట నా రాజర్షి ప్రకృతివర్గము నెల్లఁ బిలువఁబనిచి తాను జేయఁదలఁచినవిధ మెల్లఁ దెలియఁ జెప్పెను. ఆ పౌరజానపదజను లందఱు నా మాట వినఁగనే మనముల మిక్కిలి కళవళ మందిరి. ఆతని మాటల నంగీకరింపక పోయిరి. "అట్లు చేయరా" దని యానరపాలునకు విన్నవించికొనిరి. కాని కాలవిపర్యయము నెఱింగిన యా ధర్మవేత్త వారిమాట ప్రకార మొనరింపఁడయ్యెను. ఎట్టకేలకు నా పౌరులను, జానపదులను నా ధర్మాత్ముఁ డొప్పింపఁగలిగెను. ఇట్లాతఁడు ప్రస్థానము నొనరించుటకే నిశ్చయించెను.

అంతలో నచట నొకవివాదము ప్రారంభ మయ్యెను. దానిలో గృహనిర్మాణమున కగు నొకస్థలమును విక్రయించుటలో భూమి నమ్మువాఁడును, గొనువాఁడును, రాజునుం గూడ నొక్కమాఱుగా నాలాభము తమకె తమకె రావలయు నని లోభగ్రస్తు లయిరి. దానిని జూచియుఁ, గృష్ణపరమాత్ముని నిర్యాణము నెంచియుఁ గలియుగ మేతెంచె నని యెఱింగి సహదేవుఁడు చిఱునగవుతో ధర్మ మట్లు సంకరమై నశించుట నా నృపాలున కెఱుకపఱచెను. దానిని వినినంతనే మనమున నొక్కింత ఖేదము నంది "యిఁక నా జీవితము చాలు"నని తలపోసి కౌరవేంద్రుఁడగు నా ధర్మనందనుఁడు తన శరీరముపై నున్న యాభరణముల నన్నిటిని దీసివైచి నారచీరలను ధరించెను. భీమార్జున నకుల సహదేవులును, గీర్తిశాలిని

నడచిరి. ఆ మహానుభావు లందఱును యోగము నవలంబించి త్యాగధర్మము ననుష్ఠించుచు ననేకములగు దేశములను, నదులను, సముద్రములను జూచుచు నేఁగిరి. యుధిష్ఠిరుఁడు ముందు పోవుచుండ భీముఁడును, నర్జునుఁడును, నకులుఁడును, సహదేవుఁడును వరుసగా నొకరివెనుక నొక రాతనివెంట నడచిరి. స్త్రీజనమున కెల్ల మేలుబంతి—కమలపు రేకులవంటి కన్నులుగల లక్షణవతి—ద్రౌపది వారందఱకును వెనుకయై చనియెను. ఇట్లరణ్యములకుం జను నా పాండవుల నా శునకమును నల్లె వెంబడించెను. క్రమక్రమముగా నేఁగుచు వారుదయాచలముకడ నున్న లౌహిత్య మను సముద్రమును దరియ నేఁగిరి.

ఉత్తమ వస్తు లోభముచే నర్జునుఁ డింకను దివ్యధనువగు గాండీవమును, నక్షయ తూణీరములను విడువక వెంట నే తెచ్చుకొనుచుండెను. అంతట వారి కా సముద్రతీరమునఁ గొండవలెఁ దోఁచ నంతయు నాక్రమించి పురుష విగ్రహధారియై యగ్నిదేవుఁడు ప్రత్యక్ష మయ్యెను. పాండవులను జూచి యాతఁ డిట్లు పలికెను. "పాండునందనులారా! నే నగ్నిదేవుఁడ నని యెఱుంగుఁడు. యుధిష్ఠిరా! బాహుశాలివగు భీమసేనా! పరంతపుఁడవగు నర్జునా! వీరులగు నకుల సహదేవులారా! నా వాక్యమును వినుఁడు. నే నగ్నిదేవుఁడను. నర నారాయణుల ప్రభావముచే నేన ఖాండవవనమును దహించితిని. ఈ మీ సోదరుఁ డగు నర్జునుఁ డీక నుత్తమాయుధమగు గాండీవమును విడిచిపెట్టియే యరణ్యమునఁ జరించును గాక. ఇంక దీనిచే సాధింపఁగల కార్య మేదియును లేదు.

మహాత్ముఁడగు వాసుదేవుని కడ నున్న యాయుధశ్రేష్ఠమగు చక్రముగూడ నెప్పుడో పోయినది. మరల సమయము వచ్చి నప్పు డది యాతనిచేతికి వచ్చును. పూర్వ మర్జునునికొఱకై ధనుశ్శ్రేష్ఠమగు నీ గాండీవమును నేను వరుణునికడ నుండి కొనివచ్చితిని. కావున నీ దివ్యచాపము నావరుణునకే యొసంగుదురు గాక." అని యగ్ని దేవుఁ డాడిన యప్పలుకులు విని యన్నదమ్ము లందఱును బ్రేరేపింప ధనంజయుఁ డా ధనువును, నక్షయ బాణములతో నిండిన యా గొప్పయంబుల పొదులను రెండింటిని సముద్రజలముల వైచెను. అంతట నగ్ని దేవుఁ డచ్చటనే యంతర్ధాన మయ్యెను.

పిమ్మట వీరు లగు నా పాండవులు దక్షిణాభిముఖులై చని యుప్పుసముద్రము నుత్తరతీరముగుండ దక్షిణమునకును బడమటికిని నడిమిదెసగా నడచి క్రమ క్రమముగా మరల నిండుపడమటికే మరలి చనిరి. అట్లు చనుచో వారు సముద్రము ముంచివేసిన ద్వారకను జూచిరి. భరతకుల శ్రేష్ఠు లగు వా రిట్లు భూమికిఁ బ్రదక్షిణముఁ జేయఁ దలఁచినవారు గావున నటనుండి మరలి యాయోగావలంబు లుత్తరదిశాభిముఖముగా నడచిరి.

ఇది యొకటవ యధ్యాయము.

---

# మహాప్రస్థానికపర్వము

—ద్రౌపది మొదలగువారు త్రోవలో గతప్రాణులై పడుట—

అట్లు పాండవులు నియతాత్ములై యోగము నవలంబించి యుత్తర దిక్కునఁ జని చని మహాగిరి యగు హిమవంతమును జూచిరి. దానిని దాఁటి వారావల వాలుకార్ణవమును జూచుచుఁ గడచని పర్వతశ్రేష్ఠ మగు మేరుమహాశైలమును గనుఁగొనిరి. ఇట్లు వారందఱును యోగధర్మమును బూని మహావేగముగ నేఁగుచుండ ద్రౌపది యోగభ్రష్టయై నేలపైఁ బడియెను. దానిని జూచి భీమసేనుఁ డన్నవైపు దిరిగి "యగ్రజా! యీ రాజనందన యెన్నఁడేనియు నధర్మమును నొక్కదానినిగూడఁ జేసి యెఱుంగదే! ఇట్టి యీ పాంచాలి నేలపైఁ బడుట కేమి కారణమో తెలుపు" మని యడిగిన ధర్మజుఁ డిట్లనియె. "ఉత్తమపురుషా! యీబిడకు ధనంజయుపైని బక్షపాతము మెండు. దానికి నీ రీతి నిప్పు డీమె ఫలము ననుభవించుచున్నది.

అని యిట్లు నుడివి ధర్మమూర్తియు, ధీమంతుఁడు నగు నా భారతోత్తముఁడు నేలఁ గూలిన ద్రౌపదిదెస నాలోకింపక దీమో మనస్సును సమాధానపెట్టుకొని ముందునకు నడచెను. కొంతదూర మేఁగెడుసరికి విద్యాశాలియగు సహదేవుఁడు ధరణిఁ బడినం జూచి భీముఁడు ధర్మజునితో 'నన్నయ్యా! వీఁడుగో సహదేవుఁడు నేల వ్రాలినాఁడు. ఈ మాద్రీనందనుఁడు మనల నందఱ నొక్కవిధముగానే శుశ్రూషించువాఁడు. ఈతని యెడ నహంకారము నణుమాత్రమునైనను

గానము. ఇట్టి యీతఁడుఁగూడఁ బడినాఁడే, యేమికారణము?' అని యడిగిన నాతఁ డిట్లనియె. "తమ్ముఁడా! యీతఁ డే ప్రాజ్ఞుఁడు గూడఁ దనతో సాటి యగువాఁడు లేఁ డని గర్వించు వాఁడు. దానం జేసియే విద్వాంసుఁడగు నీ రాజకుమారుఁ డిట్లు పతితుఁ డై నాఁడు" అనియిట్లు పలికి యట్టిదశనున్న సహదేవుని విడిచిధర్మనందనుఁడు ముందునకు నడచుచుండఁ దక్కిన తమ్ములును నాతని ననుసరించి యేఁగిరి. ఆ కుక్కగూడ ధర్మరాజు వెంటఁ జనుచునే యుండెను. మఱి కొంతదూరము పోవఁగనే నేలపాలయిన పాంచాలిని, దమ్ముని౯ జూచి దుఃఖపీడితుఁడై బంధుప్రియుఁడు, శూరవరేణ్యుఁడునగు నకులుఁడును బుడమిని బడియెను. వీరాగ్రణియు, సుందరాకారుఁడు నగు నాతఁ డిట్లు నేల వ్రాలఁగనే భీముఁడు మరల నన్నవైపు దిరిగి యాతనితో 'అన్నా! కొంకులేని ధర్మస్వరూపుఁడు, ప్రేమపాత్రుఁడు నగు తమ్ముఁడు, నోటిమాట నోటనుండఁగనే మనయాజ్ఞ చెల్లించు ననుచరుఁడు, ప్రపంచమున నెందును సాటిలేని యందము గలవాఁడు నకులుఁడు గూడ వీఁడుగో నేలఁ బడినాఁడు.' అనిన ధర్మమయుఁడును, బుద్ధిశాలులలో నెల్ల వరిష్ఠుఁడు నగు నా యుధిష్ఠిరుఁడు 'భీమసేనా! యీతఁడు రూపమునఁ దన కెవ్వరు సాటి లే రనియుఁ, దానే సర్వాధికుఁడ ననియుఁ దలఁచువాఁడు. దానివలన నతఁ డిట్లు పడినాఁడు. వృకోదరా! రమ్ము పోవుదము. ఎవని కేది విధివిహితమో వాఁడు దానిని దప్పక యనుభవింపనే వలయును' అని పలికి ముందు నడువ సాగెను.

ఇంకఁ గొంతదూర మేఁగెడుసరికిఁ జూచుచుండఁగనే నేలఁగూలిన ప్రియురాలిని, సోదరులను జూచి, మున్ను

శ్వేతాశ్వములను బూంచిన తేరున శత్రుసైన్యముల నెల్ల నుగ్గునూఁచము గావించిన యా వీరుఁడు—అర్జునుఁడు శోక సంతప్తుఁడై నేలం గూలెను. అట్లు దేవేంద్రునితో సాటికి వచ్చు తేజముగల పురుషసింహుఁడు, మూఁడులోకములకుం గూడ యుద్ధమునఁ దేరి చూడనైనను రాని వీరుఁడు—ఆ ధనంజయుఁడు పుడమినిఁ బడి మరణించుటను జూచి భీముఁ డన్నతో 'నగ్రజా! యిటు చూడుము. నవ్వులనేనియుఁ బలికి బొంకని మహాత్ముఁడే యీ యర్జునుఁడు! మఱి యీతఁడును నేలఁ గూలినాఁడే! ఇది యేమి పాపఫలమయ్యా!' అని యడిగిన నాతఁడు "కుమారా! యీతఁడు 'నేనొక్కఁడనే శత్రుసైన్యముల నెల్ల భస్మీకరించెదను' అని నుడివెను. కాని తానొక్కఁడే శూరుఁడ నని తలంచు నీతఁడు తా నాడిన యాపలుకులను జెల్లింపఁడయ్యెను. కావున నీతఁడు పడెను. అదియునుగాక యీతఁడు విలుకాండ్ర నెల్లర నవమానించెను. మేలు కోరువాఁ డెవఁడైనను నట్లితరుల నవమానింపరాదు." అని పలికి ముందునకు నడచెను.

అంతట మఱి కొంతదూరము చనఁగనే భీముఁడును నేలపైఁ బడెను. నేలఁగూలి యాతఁడు బిగ్గరగా 'నో ధర్మరాజా! నీకుఁ గడుంగడుఁ బ్రేమాస్పదుఁడగు నేనును నిదే నేలఁ బడితిని. ఇటు చూడుము. నా యీపాటున కేమి కారణము? మహాత్మా! యెఱుంగుదువేని తెలుపుము.' అనిన 'నోయీ! నీవు కడు మిక్కుటముగ భుజించువాఁడవు. కడుంగడు బలశాలి నని గర్వించుచుందువు. ఇతరుల నెల్లరఁ దృణీకరింతువు. దానివలన నీ వీ యవస్థకుఁ బాలయితివి' అని నుడివి

ధర్మనందనుఁ డాతనివంకఁ గన్నెత్తియయినఁ జూడక చని యెను. జనమేజయా! నేను నీకుఁ బలుమాఱులు తెలిపితి నే యా కుక్కమాత్ర మింకను నాతని ననుసరించియే చనియెను.

ఇది రెండవ యధ్యాయము.

---

## మహాప్రస్థానికపర్వము

(ధర్మరాజు, దేవేంద్రుఁడు తెచ్చినరథముపై దేవలోకమున కరుగుట. శునకము విషయమై దేవరాజ ధర్మరాజుల సంవాదము. శునకరూపమున వచ్చిన ధర్ముఁడు ధర్మరాజునకుఁ బ్రత్యక్షమగుట.)

ధర్మరా జిట్లు చనుచుండ నాకాశమునను, భూమిని, నెల్లయెడలను గొప్పధ్వని కలిగెను. పిదప రథముతోఁగూడ దేవేంద్రుఁ డాతనికిఁ బ్రత్యక్ష మయ్యెను. దేవేంద్రుఁడు ధర్మరాజు నా రథముపై నెక్కు మని కోరెను. తన తమ్ము లందఱును నట్లు గూలుట గని శోకమునఁ గుమిలిపోవు ధర్మజుఁ డామాట విని దేవేంద్రునిఁ జూచి 'సురేశ్వరా! నా తమ్ములు నలువురు నిటఁ బడిపోయినారు. వారును నాతోఁ గూడ వచ్చునట్లు లనుగ్రహింపుము. సోదరులను వదలి నే నెట్లు స్వర్గమునకు రాఁ గోరుదును? అదియునుగాక సుకుమారి, సుఖములకేగాని కష్టములకుఁ దగనిది ద్రౌపది. ఆ రాజనందనయు మాతోఁగూడ నేతెంచున ట్లనుగ్రహింపవలయును. ఈ రెండింటిని మీ రంగీకరింతురుగాక.' అని పలుకుటయు నాతఁ డి ట్లనియె. 'భరతర్షభా! నీవు నీ సోదరులను నలువురను

ద్రౌపదితోఁగూడ స్వర్గమునఁ జూచెదవు. వారందఱు నీకన్న ముందుగనే స్వర్గలోకమును జేరియున్నారు. శోకము నందకుము. వారు మనుష్యశరీరములను విడిచి స్వర్గమున కేఁగిరి. నీవో యీశరీరముతోడనే స్వర్గమున కేఁగనున్నాఁడవు. సంశయింపకుము.'

అంతట యుధిష్ఠిరుఁ డిట్లనియె. "త్రిలోకేశ్వరా! యీ శునకము నే నిల్లు వదలినదిమొదలు సదా నన్నాశ్రయించి యేతెంచినది. దీనిని నావెంటఁ గొనిరా ననుగ్రహింపుము. ఆశ్రయించిన దీనిని వీడి కఠినవృత్తికిఁ బాల్పడుటకు నా బుద్ధి యంగీకరింపదు' అన విని యింద్రుఁడు 'రాజేంద్రా! యమరత్వము నందితివి. నాతో సరి సమానుఁడవును నయితివి. పరిపూర్ణమగు లక్ష్మిని, మహత్తమమగు సిద్ధినిఁ జేకొంటివి. నేఁడు స్వర్గసుఖము లన్నియును నీకు దక్కినవి. ఇట్టి నీకు నిందేమియు నృశంసత రాదు. ఈ కుక్కను వదలిపెట్టుము." అని పలికెను. అంతట వారిరువురకును నా శునకమునుగూర్చి యిట్లు సంభాషణము జరిగెను.

ధర్మరాజు:—మహేంద్రా! యార్యధర్మముల ననువర్తించు నేనీ యనార్యమును, దుష్కరము నగు కార్యము నొనర్పఁజాలను. ఆర్యా! భక్తజనమును బరిత్యజించినఁగాని కలుగనప్పు డట్టి సంపదయే నాకుఁ గలుగకుండుఁగాక.

ఇంద్రుఁడు:— రాజేంద్రా! కుక్కను జేకొనినవారికి స్వర్గమునఁ దావు లేదు. ఆతని యిష్టాపూర్తముల ఫలమును క్రోధవశు లను దేవత లపహరింతురు. కావున నో ధర్మనందనా!

చక్కఁగా విచారించి నిర్ణయ మొనరింపుము. ఈ కుక్కను వదలి పెట్టుము. ఇం దేమియును ఘాతుకత్వము లేదు.

ధర్మరాజు:—మహేంద్రా! భక్తపరిత్యాగము కష్టంగడు పాప మని పెద్దలు చెప్పుదురు. అది బ్రహ్మహత్యవలనఁ గలుగు పాపమునకు సమాన మనియు నందురు. కావున నెన్ని విధములఁ జూచినను నాత్మ సుఖమునకై దీని నెప్పటికిని వదలి పెట్టఁ జాలను. అదియునుగాక భయము నందినవానిని, ఇతర మెఱుఁగక యాశ్రయించిన భక్తుని, ఆర్తుఁడై యొద్దఁ జేరిన వానిని, కాపాడు దిక్కు లేక ప్రాణార్థియై వచ్చినవానిని నా ప్రాణము పోయినను నేను విడువఁబూనను. ఇది నాకు నిత్య వ్రతము.

ఇంద్రుఁడు:—రాజేంద్రా! యిదే యెక్కడి వెఱ్ఱి? కుక్క చూచినచోఁ బురుషుఁ డొనరించు దానము,హోమము, ఇష్టాపూర్తములు అను నీసుకృతముల నన్నింటిని క్రోధవశు లను దేవతలు హరించి కొనిపోవుదురు. కావున నా మాట వినుము. ఈ కుక్కను విడువుము. కుక్కను వదలినచో దేవ లోకము నందెదవు. పుణ్యపురుషా! తమ్ముల నందఱను వదలితివి. ప్రియురాలగు ద్రౌపదిని ద్యజించితివి. ఆర్జించిన పుణ్య కర్మములచే నుత్తమలోకము నందితివి. ఈ కుక్కను వదలలే కున్నావే! పరిపూర్ణముగఁ ద్యాగము ననుష్ఠించు నీవు ఇపు డేల పొరఁబడు చున్నాఁడవు?

ధర్మరాజు:—దేవేంద్రా! చచ్చినవారితో బ్రదికి యున్న మానవుల కెట్టి మైత్రిగాని, యెట్టి ద్వేషముగాని లే వనుట లోకముల నెల్లఁ గలిగిన పరిపాటియేగదా! మఱి మర

ణించిన యీ నా సోదరులను, ద్రౌపదిని నేను బ్రదికింపఁ జాలనుగదా ! కావున వారిని ద్యజించితిని. కాని బ్రదికి యుండఁగా వారిని ద్యజింపలేదు. శరణుచొచ్చినవానిని శాత్రవున కప్పగించుటయు, స్త్రీని వధించుటయు, బ్రాహ్మణ ద్రవ్యము నపహరించుటయు, మిత్రునకు ద్రోహము చేయుటయు నను నాలుగు సుప్రసిద్ధములైన పాపకార్యములు గలవు గదా ! భక్తత్యాగ మనునదియు వానితో సమాన మని నా యభిప్రాయము.

ధర్మరా జిట్లు తెగనాడఁగనే శునకరూపముతో నుండి యిది యంతయు వినుచున్న భగవంతుఁడగు ధర్ముఁడు మిక్కిలి సంతోషము నంది నిజరూపమును దాల్చి నిలిచి మృదుమధుర వాక్యముల నా నృపాలునిఁ బొగడుచు నిట్లనియె. "రాజేంద్రా! నడవడిని, బుద్ధి వైభవమునను, సర్వభూతములయందును నునిచిన యీ నీ దయాగుణమునను నెల్ల విధములఁ దండ్రినిబోలి యుత్తమకులీనుఁడ వనిపించుకొంటివి. కుమారా! పూర్వ మొకప్పుడు నేను నిన్ను ద్వైతవనమునఁ బరీక్షించితిని. నాఁడు నీటికొఱకై పరాక్రమించి నీ తమ్ము లందఱు నాచే నిహతులై నపుడు నీవు నీ సొంతముతమ్ము లగు భీమార్జునుల నిరువురను వదలి 'నా తల్లికిఁ దొలికొడుకను నేను బ్రదికియుండ, మాఱుతల్లియగు మాద్రికిమాత్రము తొలికొడుకు జీవించి యుండ

వలదా?' యని మాతృసామ్యమును దలఁచి నకులుని బ్రది కింపు మని కోరితివి. మఱి నేఁడో యాశ్రయించినది యనియొక కుక్కను వదల నొల్లక దేవరథమునుగూడఁ దిరస్కరించితివి. భళీ! కుమారా ! స్వర్గమునఁగూడ నీకుసాటిలేరు. కౌరవేంద్రా! కావుననే నీకు బొందితోడనే యక్షయలోకములు నందఁగలిగి నవి. భారతశ్రేష్ఠా ! సర్వోత్తమమగు దివ్యపదము నందితివి"

అంతట ధర్ముఁడును, దేవేంద్రుఁడును, మరుత్తులు, నశ్వినీ దేవతలును మొదలుగాఁ గల సర్వదేవతలును, దేవర్షు లును నప్పాండవోత్తముని దివ్యరథముపైఁ గూర్చుండ నిడిరి. తరువాత సిద్ధపురుషులును, గామవిహారులును, రజోగుణ మింతయేనియు నంటనివారును, మనస్సు, వాక్కు, కర్మము నను త్రికరణములను మిక్కిలి పుణ్యాత్ములును నగు నావేలుపు లెల్లరును దమ తమ విమానముల నధిరోహించి నలువైపులఁ బరివేష్టించి నడచుచుండఁ గురుకులతిలకుఁడగు నమ్మహాపురు షుఁ డా దివ్యరథము నెక్కి భూమ్యాకాశముల నెల్ల నిజతేజ మావరింప మహావేగమున నూర్ధ్వమార్గమునఁ జనియెను.

అప్పుడు సురలోకముననుండి సకల లోకములను దెలి సినవాఁడును, సర్వశాస్త్రముల నెఱింగినవాఁడును, మహాతప స్వియు నగు నారదుఁ డుచ్చైస్స్వరముతో 'బళిరే! పూర్వము నుండి యెందఱో రాజర్షులు వచ్చి యున్నారు. కాని వారి కీర్తి నెల్లఁ దనకీర్తిచే మాటువఱచి కౌరవేంద్రుఁడగు ధర్మ

రాజు వీఁడుగో సురలోకము నధిష్ఠించుచున్నాఁడు. కీర్తిచేతను, తేజముచేతను, బవిత్రమగు నడవడిచేతను సకల లోకములను నిండి బొందితోఁగూడ స్వర్గలోకము నందినవానిని వేఱొక్కని మున్నెన్నఁడైన వినియుంటిమే? అది యీ మహాత్మున కొక్కనికే చెల్లినది' అని పలికి ధర్మరాజువైపు దిరిగి 'రాజేంద్రా! అటు చూడుము. నీవు భూలోకమున నుండఁగా నసంఖ్యములగు తేజస్సులుగాఁ జూచియుంటివే యవే వేల కొలఁది దేవమందిరము లవి కాన వచ్చుచున్నవి' అనియెను.

నారదుని పలుకులను విని ధర్మాత్ముఁడగు నా నరపాలుఁ డచటఁ దమ్ములను, దన శత్రురాజన్యులను గానక 'మహాత్మా! యది పుణ్యలోక మగుఁగాక, పాపలోకమే యగుఁగాక. నా సోదరు లున్న లోకముననే నేనును నివసింతును. ఆ లోకమున కే నేను బోవఁదలఁతును; గాని తక్కిన లోకములు నా కక్కఱ లేదు.' అని పలుక దాక్షిణ్యముతోఁ గూడిన యాతని పలుకులను విని దేవరాజగు మహేంద్రుఁ డిట్లు బదులు పలికెను. 'రాజేంద్రా! నీ పుణ్యకర్మములచే జయించికొనిన యీ లోకమున నీవు వసింపుము. మానవసంబంధ మగు స్నేహము నేల నీ వింకను నెఱవేర్చికొందువు? ఇతరు లెవ్వరికిని పొందరాని మహోన్నత మగు సిద్ధి నందితివి. నీ సోదరు లీ పదవి కెప్పుడును రాలేరు. ఏమి! ఇంకను నీవు మానవ స్వభావము తగులుకొనియే యున్నదే!! నరాధిపా! యిది

స్వర్గలోకము. వారే దేవఋషులు. వీరుగో సిద్ధులు. వీ రంద అను స్వర్గమున నుండువారు. చూడుము' అని యిట్లు త్రిలోకనాథుఁడగు దేవేంద్రుఁడు పలుక ధీమంతుఁడగు నా యుధిష్ఠిరుఁ డర్థవంతమగు వచనము నిట్లు బదులు పలికెను. దైత్యాంతకా! యీ నా సోదరులు లేక యిచట నుండుటకు నా కిష్టము లేదు. నా సోదరు లెం దున్నారో నేనును నచటికే పోవఁదలఁతును. సత్యమూర్తి, గుణవంతు రాలు, స్త్రీలలో నెల్ల నుత్తమురాలు, బుద్ధిశాలిని యీ పు ణ్యాంగన ద్రౌపదియు నా కుమారులును నెచట నున్నారో నేనును నచటికే పోవ నెంతును.

ఇది మూఁడవ యధ్యాయము.

గద్య:—ఇది విద్వాన్ అవధానము చంద్రశేఖరశర్మ ప్రణీతమైన వచనభారతమందలి మహాప్రస్థానికపర్వము సంపూర్ణము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



శ్రీః

# శ్రీ మహాభారతము

## స్వర్గారోహణపర్వము

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్.

{ధర్మరాజు స్వర్గమున దుర్యోధనుని వైభవమును జూచి సహింపక తమ్ములను జూడఁగోరుట.}

జనమేజయుఁడు వైశంపాయనునితో 'మునీంద్రా! యద్భుతచరిత్రుఁ డగు వ్యాసమునీంద్రుని యనుగ్రహముచే మీకుఁ దెలియరాని విషయములు లేవుగదా! మా పూర్వ పితామహు లగు పాండవులును, ధార్తరాష్ట్రులును మూఁడవ లోక మగు స్వర్గమును జేరి యేయే పదముల నందిరో వివరింపవే' యని యడుగ వైశంపాయనుఁ డిట్లనియె. 'రాజేంద్రా! మూఁడవలోక మగు స్వర్గమున కేఁగినతరువాత మీ పెద్దతాత లగు యుధిష్ఠిరాదుల వృత్తాంతమును దెలిపెద వినుము. ధర్మ రాజు స్వర్గమునకుఁ బోవఁగనే యచట దుర్యోధనుఁ డాతని కగపడెను. అతఁడు సింహాసనము నధిష్ఠించి సిరితోఁ దులఁ దూఁగు చుండెను. సిరిలక్ష్మీపరివృతుఁడై యాతఁడు సూర్యుని

వలెఁ బ్రకాశించుచుండెను. పుణ్యకర్ములును, తేజోమూర్తులు నగు దేవతలును, సాధ్యులును నాతనిఁ బరివేష్టించి యుండిరి.

ఇట్లు మహావైభవమున నున్నదుర్యోధనునిఁ జూచి ధర్మరాజాతనిసంపదకు సహింపఁ జాలక వెంటనే గిరుక్కున వెనుకకు మరలెను. దేవతలను జూచి యాతఁడు బిగ్గరగా 'నీదుర్యోధనునితోఁగూడ నీలోకముల నే నుండ నొల్లను. ఈతఁడు లుబ్ధుఁడు. దీర్ఘదృష్టి కలవాఁడు గాఁడు. ఈతనివలననే మేము కాఱడవులఁ బడరాని కష్టములఁ బడి తుదకు యుద్ధము నొనరించి బంధువులను, మిత్రులను బలవంతముగఁ జాడుచేసి కొంటిమి. వేయేల? ఈతనితోడనే పృథివి యెల్ల నాశనమై పోయినది. నిండుసభనడుమఁ బెద్దలందఱును జూచుచుండ ధర్మాత్మురాలు, పాంచాలవంశమునఁ బుట్టినకులీన, సులక్షణవతి, మాసహధర్మచారిణి ద్రౌపది ఈదురాత్మునిచేతనే యీడ్పింపఁ బడినది. ఇట్టి యీ పాపాత్ముని గన్నెత్తి చూచుటకుఁ గూడ నా కిష్టము లేదు. నా తమ్ము లున్నచోటికి నేను బోవుదును.' అని యనఁగనే చిఱునగవుతో నారదుఁ డాతని కిట్లనియె.

'ధర్మరాజా! యట్లుకాదు. స్వర్గనివాసమున విరోధము లని యుండనే యుండవు. యుధిష్ఠిరా! సుయోధననృపాలునిఁ గూర్చి యెన్నఁడు నిట్లు పలుకకుము. నా యీమాట వినుము. మహారాజగు నీ దుర్యోధనుని దేవతలతోఁబాటుగా స్వర్గవాసు లగు సత్పురుషులు, రాజశ్రేష్ఠులు నెల్లవారును బూజించుచున్నారు. యుద్ధ మను హోమకుండమున శరీరములనాహుతి చేసి వీరస్వర్గము నందిన మీరందఱును దేవతలతోఁబాటివారు. మిమ్ము యుద్ధమున బాధించిన యీ దుర్యోధనుఁడును క్షత్త్ర

ధర్మమునంజేసి యీపదవి నందినాఁడు. గొప్ప భయము గలిగి నపుడుగూడ నీ రాజన్యుఁడు భయరహితుఁడై క్షత్త్ర ధర్మ మును బాటించెను. కుమారా! జూదమువలనఁ గలిగిన మా కష్టములను మనసునఁ బెట్టకుము. ద్రౌపదిని బెట్టిన కష్టములను గూడఁ దలపోయకుము. మీకు దాయాదులవలన యుద్ధము లందుఁగాని, యితరత్ర గాని కలిగినబాధల నన్నిటిని మఱచి పొమ్ము. తగినరీతి నీ దుర్యోధనునిఁ గలసికొనుము. నరపాలా! యిది స్వర్గలోకము. ఇచట వైరములు లేవు.'

అని యిట్లు నారదుఁడు చెప్పఁగనే కౌరవేంద్రుఁ డగు నయ్యుధిష్ఠిరుఁడు తన తమ్ములనుగూర్చి ప్రశ్నించెను. మఱి యు నా బుద్ధిశాలి యిట్లు పలికెను. "ఈ దుర్యోధనుఁడు ధర్మము తోవయో యెఱుఁగఁడు; పాపియై రాజ్యమునకు, మిత్త్రులకు ద్రోహము చేసినాఁడు; ఈతనివలననే మనుష్యులు మొద లేనుఁగులవఱకును గల సర్వ సౌభాగ్యములతోఁగూడ భూ మండల మెల్ల నొక్కుమ్మడి నాశన మైనది. ఈతనివలననే మే మును బగఁ దీర్చుకొనఁ దలఁచి కోపముచేఁ గుమిలికూలాంతితిమి. ఇట్టి యీ దుర్యోధనునకే సనాతనములగు నీ వీరలోకములు ప్రాప్తించినచో నిఁక బలిష్ఠవ్రతినఁ జెల్లించుకొను వీరాధి వీరులకు—ఆడిబొంకని మహాత్ములకు—అనేకపుణ్యవ్రతముల నాచరించిన వారికి—నా తమ్ములకు నెట్టి లోకములు గలిగినవో చూడ వలయును. మహానుభావుఁడును, సత్యప్రతిజ్ఞుఁడు నగు కుంతీదేవి పెద్దకొడుకు కర్ణుఁడు, ధృష్టద్యుమ్నుఁడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుని పుత్త్రులు, ఇంకను క్షత్త్రధర్మము ననుసరించి శస్త్రవధము నందిన సకలరాజన్యులును నొక్కఁడుగూడ నిచటఁ

గానరా కున్నారే! వా రందఱు నెచట నున్నారు? మహాత్మా! వారిని విరాటద్రుపదులను, ధృష్టకేతు ప్రముఖు లగు నా రాజన్యులను, పాంచాలుఁ డగు శిఖండిని, ద్రౌపదికొడుకులను, శత్రువులకు నెదిరింపరాని వీరుఁడగు నభిమన్యుకుమారుని— అందఱను జూడవలయు నని యుత్తలపడుచున్నాఁడను.

ఇది యొకటవ యధ్యాయము.

---

## స్వర్గారోహణపర్వము

{ధర్మరాజు నరకమునఁ బడియున్న సోదరులను జూచి పరితపించుట}

దేవతలారా ! మితిమీఱిన తేజము గలవాఁడు కర్ణుఁ డిచటఁ గనఁబడకున్నాఁడు. అన్నదమ్ము లగు నామహాత్ములు, యుధామన్యుఁడును, ఉత్తమౌజుఁడును నిందుఁ గానరారు. యుద్ధము పేరిటి హోమాగ్నిలో శరీరములను వేల్చిన యా మహారథులు, నా కొఱకై యుద్ధమునఁ బ్రాణముల నర్పించిన యాపులులవంటి పరాక్రమశాలు లందఱును, రాజులును, రాజపుత్త్రులును నెచట నున్నారు? ఆ పుణ్యపురుషు లందఱు నీ లోకమును గెలిచికొన్నారా? ఆమహారథు లందఱు నీలోకముల నంది యుండిరనే యా మహాత్ములతోఁ గూడ నేనును నీ లోకముల నుందు నని తలఁపుఁడు. అట్లయి మగు నీ పుణ్య లోకమును వారు పొందకుండినచో వారందఱను సోదరులను, బంధువులను విడిచి నే నిచట నుండను. యుద్ధము ముగిసిన తరువాత మృతబంధువులకుఁ దిలోదకము లిచ్చుకాలమునఁ 'గర్ణునకుఁ దిలోదకముల నొసఁగుఁ'డని చెప్పిన మాతల్లిమాట

వినినప్పటినుండియు నేను గుమిలిపోవు చున్నాఁడను. మాతృచరణములఁ బోలిన యామహాత్ముని పాదముల దర్శించినంతనే పరబలవిధ్వంసకుఁ డగు నాకర్ణుని ననుసరింప నైతినే యని మాటిమాటికి దుఃఖిల్లుచున్నాఁడను. కర్ణునితోఁగూడిన మమ్ము దేవేంద్రుఁ డయినను యుద్ధమున గెలువఁ జాలునే? అన్నయని యెఱుంగమిచే సవ్యసాచి నంపి యా మహాత్మునిఁ జేతులారఁ జంపించితిని. సూర్యనందనుఁడగు నామహాత్ముని నెచ్చట నున్నను జూడఁ గోరుచున్నాఁడను. భీకరపరాక్రమము గలవాఁడు, నాకుఁ బ్రాణమునకంటెను బ్రియుఁడు నగు భీమునిఁ గనుఁ గొందును. మహేంద్రునితో సాటికి వచ్చు నర్జును నాలోకింతును. అశ్వినీకుమారులను బోలిన నకుల సహదేవులను జూతును. సహధర్మచారిణి యగు ద్రౌపదిని వీక్షింతును. నేనిచట నుండవలయు నని కోరుట లేదు. ఇది నిశ్చయము. సోదరులు లేనినాకు స్వర్గ మెందులకు? నా సోదరు లెచట నుండిన నదియే నాకు స్వర్గము. కాని యిది నాకు స్వర్గము గాదని నా యభిమతము".

అని పలికిన ధర్మరాజుమాటలను విని దేవత లాతనిని జూచి 'రాజేంద్రా! యచటికే పోవలయు నని నీవు శ్రద్ధ వహింతువేని శీఘ్రముగనే పోవచ్చును. నీ కేది ప్రియమో దానిని దీర్చుటకే దేవనాథుఁడు మమ్మాజ్ఞాపించి యిచట నిలిపినాఁడు.' అని చెప్పి దేవదూతను బిలిచి 'ధర్మరాజున కాతని బంధువులను జూపు' మని యాదేశించిరి.

జనమేజయమహారాజా! పిమ్మట ధర్మరాజును, దేవదూతయు నా బంధువు లున్నచోటునకుఁ బ్రయాణమైరి.

దేవదూత ముందుఁ బోవుచుండ నాతనివెనుక యుధిష్ఠిరుఁడు చనియెను. పాపాత్ములు నడచునట్టిమార్గమున వారు నడచిరి. ఆ మార్గము దుర్గమమై కశ్మలముగ నుండెను. నలువైపులఁ గటికిచీఁకటి గ్రమ్మటచే నది భయంకరముగా నుండెను. అందు వెంట్రుకలు నాచుతీఁగలవలెఁ గ్రమ్మి యుండెను. పాపుల దుర్గంధము నిండుగ వ్యాపించి యుండెను. మాంసమును నెత్తురును గలసి యడుసు పాఱి యుండెను. అడవియీఁగలు, జోఱీఁగలు, తేనెటీఁగలు, ఈఁగలు, దోమలు జుమ్మురు మని మూఁగుచుండెను. అక్కడక్కడ నలువైపులఁ బీనుఁగులు పడియుండెను. ఆ మార్గ మెముకలతోను, వెంట్రుకలతోను నిండి క్రిమి కీటకసంకులమై యేవగింపు గలిగించుచుండెను. దానికి నలువైపుల నగ్నిజ్వాలిక లావరించి యుండెను. ఇనుపముక్కుల కాకులు, గ్రద్దలు నా మార్గమున నిటు నటు పరుగెత్తుచుండెను. సూదులవంటి ముఖములతో వింధ్యశైలములవంటి శరీరములతోఁ బ్రేతములు తిరుగాడుచుండెను. అటనట మెదడును, నెత్తురును బూసికొనినవి, బుజములు దెగినవి, తొడలు దునిగినవి, చేతులు గోసినవి, కాళ్లు నఱకినవి, పొట్టలు చినిఁగినవియు నగు కొన్ని ప్రేతములు కానవచ్చు చుండెను. ఇట్లు చద్దిపీనుఁగుల దుర్గంధముచే నిండి నిబిడీకృతమై శరీరమునకు గగ్గురుపాటు గలిగించుచు నసహ్య మగు నా మార్గమున నడుమ నడుమ నే మేమో తలపోసికొనుచు ధర్మాత్ముఁడగు నా మహారాజు నడచెను. అట్లు చనిచని సల సలఁ దెరలు వేఁడినీళ్లతో నిండి యెవ్వరికిని దరియరాని యొకనదిని, బాకులవంటి యాకులు గలిగి

వాఁడియై మంగలకత్తులతో నిండిన యొకయడవిని నాతఁడు చూచెను. మండుచున్న తెల్లని సన్నని యిసుకతావులను, మంటలు గ్రక్కు నినుప బండలను, వెరలఁ గ్రాఁగుచున్న నూనెతో నిండిన యినుపకాఁగులను నాతఁడు చూచెను. వాఁడియగు ముండ్లు గలిగి తాఁకరాని కూటశాల్మలి యను బూరుగమ్రానును, పాపాత్ములకై యేర్పాటు గావింపఁబడిన నానావిధములగు యాతనలును నాతని కంటికిఁ బ్రత్యక్షము లయ్యెను. అంతట ధర్మరాజు దుర్గంధపూరితమగు నా మార్గ మును జూచి దేవదూతతో 'నోయీ! యిట్టి యీ మార్గ మున మన మెంతదూరము పోవలయును? నా సోదరు లున్న తా వెచ్చట? ఇది యేలోకము? ఇదియును దేవతలదియేనా? నాకుఁ దెలుపుము?' అని యడిగెను. దేవదూతయు నాతని మాట విని వెనుకకుఁ దిరిగి 'రాజేంద్రా! యింతవఱకే నీ ప్రయాణము. నే నిచటినుండియే వెనుకకుఁ దిరిగి పోవల యును. అట్లే దేవతలు నా కాజ్ఞాపించిరి. బడలియున్నచో నీవును నాతోఁగూడ వెనుకకుఁ దిరిగి రా వచ్చును?' అని చెప్పెను.

అంతట యుధిష్ఠిరుఁడును నచటి యా పాడుకంపునకు సొమ్మసిల్లి నిర్విణ్ణుఁడై మరలి పోఁదలఁచి వెనుకకుఁ దిరిగెను. ఇట్లు బాధయును, శోకమును బెనఁగొన వెనుకకుఁ దిరుగఁగనే యా ధర్మాత్మునకు నాలుగుదిక్కులనుండియు దీనాతి దీనముగ నా క్రోశించుచున్నవారి మాటలు కొన్ని యిట్లు వినఁబడి యెను. 'ఓ ధర్మరాజా! ఓ రాజర్షీ! ఓ పుణ్యాత్ముఁడా! ఓ కులీనుఁడా! ఓ పాండునందనా! మ మ్మనుగ్రహించి యొక్క

ముహూర్తము నే పిచటనే నిలువుము. శత్రువుల కెదురురాని నీ విచటికి వచ్చినతోడనే నీ మీఁదినుండి సుగంధబంధురమై పవిత్రమగు గాలి వీచి మాకు సుఖమును గలుగఁజేయు చున్నది. పురుషోత్తమా! భరింపరాని వేదనలఁ గ్రుంగు మేము రాజేంద్రుఁడవగు నీ విచటికి వచ్చుటచేఁ జాలకాలము నకు సుఖముమొగముఁ జూడఁగలిగితిమి. కౌరవోత్తమా! యొక్క ముహూర్తకాల మిచటనే నిలువుమా! నీ విచట నుండఁగా నరకయాతనగూడ మాకు బాధ గలిగింపకున్నది.'

ఇట్లా జీవుల దీనవచనములు విని దయ గలవాఁడగు నా ధర్మరాజు 'అబ్బ! యెంతకష్టము.' అని పలుకుచు నచ టనే నిలువఁబడెను. పూర్వము పలుమాఱులు విన్నవియే యయినను బాధలచే నవయుచున్న వారి యార్తధ్వనుల నాతఁడు గుర్తింపఁ జాలఁడయ్యెను. 'ఓయీ! మీ రెవ్వరు? ఇం దేల యున్నారు?' అని యాతఁడు వారిని బ్రశ్నించెను. వెంటనే వారు నాలుగు దిక్కులనుండియు 'నో ధర్మరాజా! నేను గర్ణుఁడను, నేను భీముఁడను, నే నర్జునుఁడను, నేను నకు లుఁడను, నేను సహదేవుఁడను, నేను ధృష్టద్యుమ్నుఁడను, నేను ద్రౌపదిని, మేము ద్రౌపదీపుత్త్రులము.' అని యాక్రోశించిరి. ధర్మరాజును నా చోటి కుచితమైనవారి యా యాక్రోశనములను విని "యక్కటా! యేమి యీదైవచేష్టితము! నీరందఱును మహాపురుషులే! దుర్గంధభూయిష్ఠమై మిక్కిలి ఘోరమైన యీదేశమున నుండుటకు వీ రేమిపాపము నొనరించిరి? కర్ణుఁడుగాని, ద్రౌపదేయులుగాని, ద్రౌపదిగాని యీచోటున నుండుట కేమి పాపమును జేసిరి? పుణ్యాకర్ములగు వీరందఱును



204. దేవదూత ధర్మజునకు నరకలోకమును జూపుట.
ధర్మజుఁ డందుఁ దనవారిని జూచుట.

BY COURTESY OF KARNATAKA DEPOT, MADRAS.

జేసినపాప మేమో నాకుఁ దోఁపకున్నది. అటు చూచినచో
నేమి పుణ్యముఁ జేసి యీ ధృతరాష్ట్రునికొడుకు దుర్యోధ
నుఁడు పాపాత్ములగు తనయనుచరులతోఁగూడ నట్టివైభ
వము ననుభవించుచున్నాఁడు? అట్లాతఁడు దేవేంద్రునివలె
సిరులతోఁ దులఁదూఁగుచుండ నిట్లు వీరు-అందఱును సర్వ
ధర్మముల నెఱింగినవారు—శూరులు—పలికి బొంకనివారు-
క్షత్రధర్మమును దొలఁగని సత్పురుషులు—గొప్ప గొప్ప
దక్షిణలతో ననేకయజ్ఞయాగాదికముల నొనరించిన పుణ్యా
త్ములు నరకము ననుభవించుచున్నారే! ఇది యే పాపమునకుఁ
బరిణామ మందును? నే నేమి నిద్రించితినా? మేలుకొనియే
యుంటినా? బ్రదికియుంటినా? మరణించియుంటినా? అక్కటా!
యిది యేమి చిత్తవికారమా? లేక నా కేమేని మతిభ్రమము
గలిగెనా?" అని పలువిధములఁ దలపోసికొనెను. చింతచే నింద్రి
యము లెల్లఁ గళవళము నంద బాధయు, వగపును గాట
ముగా నావేశింప నా మహాత్మునకుఁ దీవ్రతరమగు క్రోధము
జనించెను. అతఁడు దేవత లనుచిత మొనరించి రని నిందిం
చెను. ధర్మము సేవగించుకొనెను. తీవ్రశోకసంతప్తుఁ డగు
నాతఁడు దేవదూతను జూచి 'నీ వెవ్వరి దూతవో వారి
యొద్దకే పొమ్ము. నే నచటికి రాను. ఇచటనే యుందు నని
వారికిఁ దెలుపుము. ఏలయన? నేనిచట నుండుటవలన నింతకు
ముందు బాధలఁ బడుచున్న యీ నా సోదరులు సుఖపడు
చున్నారు' అని చెప్పెను.

అంతట ధీమంతుఁడగు నాతని పలుకులు విని దేవ
దూత దేవేంద్రుఁ డున్నయెడకుఁ బోయి ధర్మరా జొనరింప

నెంచినవిధమును, నాతఁడు పలికినపలుకులను సర్వమును విన్నవించెను.

ఇది రెండవ యధ్యాయము.

---

## స్వర్గారోహణపర్వము

— { ధర్మరాజు స్వల్పపాపఫలానుభవమునకు నరకలోకములు చూచి, తరువాత గంగలో స్నానము చేసి దేవత్వము నొంది పుణ్యలోకమున కరుగుట. } —

అట్లు కుంతీనందనుఁడును, ధర్మ మయుఁడు నగు నా యుధిష్ఠిరుఁడు ముహూర్తమునే పచట నిలుచునంతలో దేవ నాథుఁడు మున్నుగా నెల్లవేలుపులు నచటి కేతెంచిరి. ఆ రాజేంద్రుని లెస్సగాఁ బరీక్షించిన ధర్మముగూడ శరీరమును దాల్చి యాతఁ డున్నచోటికి వచ్చెను. పుట్టుకతోడను, గర్మ ములతోడను బుణ్యమూర్తులగు నా వేలుపులు తేజోమయము లగు దేహములతో సాక్షాత్కరింపఁగనే యచటఁ గ్రమ్మిన గాఢాంధకార మెల్లఁ బటాపంచ లయ్యెను. పాపకర్ములు పడు యాతనలు గోచరింప వయ్యెను. భయంకరములగు వైతరణీ నదియును, కూటశాల్మలియును, ఇనుపకాఁగులును, తప్తశిల లును నంతర్ధాన మయ్యెను. అచట నన్నివైపులను దిరుగుచుం డినవికృతశరీరము లన్నియును మాయ మైపోయెను. మిక్కిలి గొప్ప తేజముతో నొప్పుచున్న యా దేవతల నందఱి నా నర పాలుఁడు చూచెను. వారిపైనుండి సోఁకునకు హాయి గలి గించుచు మంచిపరిమళముతోఁ గూడి పరిశుద్ధమగు చల్లని గాలులు మెండుగా వీచెను. తేజశ్శాలియగు నా ధర్మనందనుఁ

డున్నచోటికి దేవేంద్రునితోఁగూడ మరుత్తులు, వసువులు, అశ్వినులు, సిద్ధులు, సాధ్యులు, రుద్రులు, ఆదిత్యులు, తక్కుం గల యెల్ల వేలుపులును, మహర్షులును జనుదెంచిరి.

పిమ్మట దేవనాథుఁడును, నుత్తమసంపత్సముపేతుఁడు నగు నింద్రుఁడు మధురవాక్యముల ననునయించుచు యుధిష్ఠిరున కిట్లనియె. "ధర్మరాజా! దేవగణముల నెల్ల సంప్రీతుల నొనరించితివి. పురుషోత్తమా! యిఁక నాలసింపక రమ్ము. వేఱువిధమునఁ దలఁపకుము. ఉత్తమసిద్ధి నిన్ను వరించినది. అక్షయము లగు పుణ్యలోకములు నీకుఁ బ్రాప్తించినవి. నీ సోదరులకును, మిత్రులకును బూజనీయమగు శాశ్వతస్థానము లభించినది. కోపమును వహింపకుము. నేను జెప్పెడి యీ వాక్యమును గమనింపుము. వత్సా! రాజు లగువా రందఱును దుదకు నరకమును దప్పక చూడనే వలయును. పుణ్యపాపములు రెండును రెండు ప్రోవులు. ముందు సుకృతము ననుభవించినవాఁడు పిమ్మట నరకము నందును. ముందుగాఁ బాపము ననుభవించినవాఁడు తరువాత స్వర్గము నందును. పాపకార్యములు మెండుగాఁ జేసినవాఁడు తొలుత స్వర్గము ననుభవించును. నీయందుఁ బుణ్యకర్మము లత్యధికముగ నుండెను. పాప మత్యల్పముగ నుండెను. దానివలన నీ మేలును గోరియే నేను నిన్నిచటి కిట్లు చేర్చితిని. నృపాలా! కుమారుని విషయమై నెపము పెట్టి నీవు ద్రోణుని వంచించితివి. కావున నెపము పెట్టియే నేనును నీకు నరకమును జూపించితిని. నీ వలెనే భీమార్జున నకుల సహదేవులును, ద్రౌపదియును నెపముతోడనే నరకము నొందిరి. భరతోత్తమా! వారును, నీ

కొఱకై యుద్ధరంగమున మరణించిన నీ పక్షపురాజు లందఱును. నీ సాటి కెప్పుడో పాపనిర్ముక్తులై స్వర్గమున సుఖమున్నారు. వారిగో! అందఱ నవలోకింపుము. కౌరవ్యోత్తమా! యెవనికై నీవు పరితపించుచున్నాఁడవో యాతఁడు, గొప్పవిలుకాఁడు, శస్త్రముపట్టినవారి కందఱకును సిగబంతి, కర్ణుఁడు! వాఁడే యుత్తమసిద్ధి నంది యున్నాఁడు. పురుషశ్రేష్ఠుఁ డగునయ్యాదిత్యనందనుఁడు స్వస్థానస్థితుఁడై యెట్లు వెలుఁగొందు చున్నాఁడో యటు చూచియైన శోకమును వీడుము. నరేంద్రా! నీ తమ్ములును, కొడుకులును, స్వపక్షరాజన్యులును దమతమ తావుల నెట్లు కిలకిలలాడు చున్నారో చూడుము. ఇంక నైన నీ మనస్తాపము తొలఁగిపోవుఁగాక. ముందు కష్ట మనుభవించితివి. ఇది మొదలు వగపు వీడి నిరామయుఁడవై నాతోఁగూడ విహరింపుము. కుమారా! నీ వాచరించిన పుణ్యకర్మములకు, జ్ఞానములకుఁ, దపములకు, దానములకు ఫలము ననుభవింపుము. రాజేంద్రా! నేఁడు స్వర్గమునఁ గల దేవతలు, గంధర్వులు, దివ్యాప్సరసలు నిర్మలాంబరభూషణు లై మంగళమూర్తివగు నిన్నుఁ జేరి కొలుతురుగాక. పుణ్యపురుషా! రాజసూయముచే నొడిచికొన్నవి, యశ్వమేధములచే సంపాదించికొన్నవి యగు పుణ్యలోకములను, తపముచే సాధించికొన్న మహాఫలములను నీ విఁక నుపభోగింపుము. యుధిష్ఠిరా! హరిశ్చంద్రుని సాటివాఁడవై నీ విఁక విహరించులోకము లందఱురాజుల లోకములకంటెను మహోన్నతము లయినవి. రాజర్షులగు మాంధాతయు, భగీరథుఁడును, దుష్యంతుని కొడుకు భరతుఁడును నివసించు

పుణ్యలోకముల నెల్ల నీ విఁక విహరింతువు. రాజేంద్రా! యదిగో దేవనది—మూఁడులోకములను బవిత్రముల నొన రించు పుణ్యమూర్తి కనుపండువు సేయుచున్నది. ఈ యాకా శగంగలో స్నానము సేయుము. పిమ్మట నావలఁ బోవుదువు. ఇందు స్నాన మొనరించినవెంటనే నీకు మనుష్యత్వము తొలఁగిపోవును. శోకములు పటాపంచ లగును. ఆయాస ములు పరువెత్తిపోవును. వైరము నిన్నుఁ ద్యజించును. ”

దేవపతి యిట్లు నొడివి విరమింపఁగనే శరీరమునుదాల్చి సాక్షాత్కరించిన ధర్మదేవత నిజనందనుఁడగు యుధిష్ఠిరున కి ట్లనియె. “ కుమారా! మిక్కిలి ప్రాజ్ఞుఁడవగు నీకు నాయెడలఁ గల భక్తివలనను, సత్యపరిపాలనమువలనను, ఓరిమివలనను, ఇంద్రియనిగ్రహమువలనను బరితుష్టుఁడ నయితిని. ఇప్పుడు నిన్ను మూఁడవసారి పరీక్షించితిని. ఎట్టిహేతువువలనఁ గాని స్వభావమునుండి కదలించుటకు సాధ్యపడవైతివి. పూర్వము ద్వైతవనమున నరణికై యేతెంచినపుడు నిన్నొకసారి ప్రశ్నించి పరీక్షించితిని. దానిని గడచితివి. ద్రౌపదితోఁగూడఁ దమ్ములందఱుఁ జచ్చినపుడు కుక్కరూపముతో నుండి మఱి యొకమాఱు పరీక్షించితిని. దానను నెగ్గితివి. నేఁడు మూఁడవ సారి పరీక్షించితిని. సోదరులకొఱకై నరకమున నుండుటకుఁ గూడ సిద్ధపడితివి. మహాభాగా! యిట్లు నా యొనరించిన ముమ్మాఱుపరీక్షలయందును బరిశుద్ధుఁడవై కలుషము సోఁకక సుఖ మందితివి. కుంతీనందనా! నీతమ్ములు నరకమునకుఁ దగిన వారుగారు. ఇదియంతయును మహేంద్రుఁ డొనరించినమాయ. కుమారా! రాజు లగువా రంపజనము జివరకు నరకమును

జూడక తప్పనే తప్పదు. కావున నీకీ ముహూర్తముపాటి దుఃఖము సంప్రాప్త మయినది. సవ్యసాచి గాని, భీమసేనుఁడు గాని, పురుషసింహులగు నకుల సహదేవులుగాని, సత్యవాదియు, శూరుఁడు నగు కర్ణుఁడుగాని, యెక్కువకాలము నరకమందుఁ దగినవారు కారు. రాజనందనయగు ద్రౌపదియు నెట్లును నరకమునకుఁ దగదు. రమ్ము. భరతాగ్రణీ ! రమ్ము. స్వర్గమున నున్నవా రందఱ నవలోకింపుము."

జనమేజయనృపాలా ! ధర్మదేవత యిట్లు వచింపఁగనే నీ పెదతాతయగు నా రాజర్షి యా ధర్మదేవతతోను, నెల్ల వేలుపులతోను గలసికొని దేవనదిని జేరఁజనియెను. మునులచే లెస్సగాఁ గొనియాడఁ బడునదియుఁ,బరమపావనియు నగు నా పుణ్యనదిని మునిఁగి యా రాజేంద్రుఁడు మనుష్యశరీరమును విడిచి దివ్యరూపము ధరించెను. వైరములును, సంతాపములును నాతని కానదినుండి లేచువఱకు మనుష్యత్వముతోఁ గూడ విడిపోయెను. అంతటఁ గౌరవేంద్రుఁడగు నయ్యుధిష్ఠిరుఁడు సకలదేవతలును దన్నుఁ బరివేష్టింప,మహర్షులందఱును స్తుతించుచుండ ధర్మదేవతతోఁ గూడి, యెచ్చోట శూరులును, బురుషోత్తములు నగు పాండవ ధార్తరాష్ట్రులు శోకముల నన్నింటిని వదలి తమతమ తావుల సుఖయుండిరో యా పుణ్యలోకమునకుఁ జనియెను.

ఇది మూఁడవ యధ్యాయము.

---

## స్వర్గారోహణపర్వము

{ఇంద్రుఁడు ధర్మరాజునకు దేవత్వము నందిన వారివారి నెఱిఁగించుట.}

అంతట నా యుధిష్ఠిరనృపాలుఁడు దేవతలును, ఋషులును, మరుత్తులును వినుతించుచుండఁ గురుపుంగవు లున్న చోటికిఁ బోయెను. అచట నాతఁడు బ్రహ్మదేవునకును బూజింపఁదగిన రూపముతో నుండిన గోవిందుని సందర్శించెను. ఆ మహాత్ముఁడు మున్ను చూచినయాకారపుఁబోలికలచేఁ బోల్చుకొనఁదగియుండెను. భయంకరములగు చక్రాది దివ్యాయుధములు పురుషవిగ్రహములను దాల్చి యాతని కడ నిలిచి యుండెను. మిక్కిలి తేజముతోఁ బ్రకాశించుచు వీరుఁడగు నర్జునుఁ డాతని నుపాసించుచుండెను. ఇట్లు నారాయణుఁ డాతనికిఁ గనుపండు వయ్యెను. దేవతలచేఁ బూజింపఁబడు నా నరనారాయణు లిరువురును యుధిష్ఠిరునిఁ జూచి యుచితరీతిని బూజించిరి. మఱియొకయెడ నా కౌరవేంద్రుఁడు ద్వాదశాదిత్యులతోఁ గూడ నున్నవానిని, శస్త్రములు పట్టిన వారి కెల్ల మేటియగువానిని గర్ణునిఁ గనుఁగొనియెను. మఱియొకచో మరుత్తులతోఁగూడ నున్న భీమసేనుని ముందు చూచిన యా రూపముతోడనే యున్నవానిని గాంచెను. ఉత్తమమగు సంపదతోఁగూడి యుత్తమసిద్ధి సంపన్న మానవుఁడు మూర్తిమంతుఁడగు వాయుదేవుని ప్రక్కను దివ్యరూపముతోఁ గనుపట్టుచుండెను. ఇంకొకయెడ నాతనికి నకుల సహదేవు లశ్వినీదేవత లుండు తావున నిజతేజముచేఁ బ్రకాశించుచు నగపడిరి. వేఱొకచో ద్రౌపది గానవచ్చెను. ఆమె

కమలములతోడను, గలువలతోడను గూర్చిన దండలను దాల్చి యుండెను. సూర్యునివంటి తేజస్సు గల నిజమూర్తితో నామె స్వర్గము నెల్ల నాక్రమించియుండెను. అట్లున్న యామెను జూచి యుధిష్ఠిరుఁడు వేగిరపడి యడుగఁ దలఁచునంతలో భగవానుఁడగు దేవనాథుఁ డాతని కిట్లు తెలిపెను. 'యుధిష్ఠిరా! యీయమ శ్రీమహాలక్ష్మి. నీ కొఱకై ద్రౌపదీరూపమున నయోనిజయై మనుష్యత్వము నంది లోకోత్తరసౌందర్యవతియుఁ బుణ్యమూర్తియు ననఁబరగినది. మీ యానందము నకై పరమేశ్వరుఁడు నియోగింప నీయమయే ద్రుపదవంశమున జనించి మిమ్ముఁ జేపట్టినది. వీరుగో! అగ్నితో సమానమగు తేజము గల యీ గంధర్వు లేవురును ద్రౌపదికిని మీకును గలిగిన మహాపరాక్రములగు కుమారులు. వాఁడే గంధర్వరా జగు ధృతరాష్ట్రుఁడు. విద్యాశాలియగు నాతఁడే నీ పెదతండ్రి యని యెఱుంగుము. వీఁడుగో! కుంతీనందనుఁడగు మీ యన్నయ్య కర్ణుఁడు. సూర్యనందనుఁ డనియు, రథికులందఱకంటెను మేటి యనియు,రాధేయుఁ డనియును బ్రఖ్యాతి నందిన యాతఁ డదే యాదిత్యులతోఁ గూడ నగ్నిహోత్రుని వంటి తేజముతోఁ బ్రకాశించు చున్నాఁడు. పురుషసింహుఁడగు నీతనిని జూడుము. రాజేంద్రా! వారుగో! వృష్ణ్యంధక వంశములవా రగు సాత్యకి మొదలగు మహారథులును, మహాబలు లగు భోజులును,సాధ్యులతోను,విశ్వేదేవతలతోను,మరుత్తులతోను నున్నారలు; కనుంగొనుము. వాఁడే పరాజయము నెఱుంగని మేటివిలుకాఁడు—కాంతితోఁ జందురునకు సాటికి వచ్చువాఁడు—సుభద్రానందనుఁడగు నభిమన్యుఁడు, చంద్రు

నితోఁ గూడి యున్నాఁడు. అదే యాలోకింపుము. వీఁడుగో! మహాధానుష్కుఁడగు పాండుమహారాజు కుంతీదేవితోడను, మాద్రీదేవితోడను గూడి సదా విమానారూఢుఁడై నా కడ కేతెంచుచుండును; అతనిని దిలకింపుము. వసువులలో నున్న శంతనుపుత్త్రుఁ డగు నా భీష్ము నవలోకింపుము. బృహస్పతికిఁ గెలన నాసీనుఁడై యున్న యీతఁడు ద్రోణాచార్యుఁడు; విలోకింపుము. వారే తక్కిన రాజన్యులును, నీపక్షపు యోధులును; గంధర్వులతోను, యక్షులతోను, బుణ్యజనులతోనుం గలసి చనుచున్నారు. మఱికొందఱు రాజులు వారే! గుహ్యకుల తావున నున్నారు. పాండవాగ్రణీ! వాక్కుచేతను, బుద్ధిచేతను, గర్మముచేతను బుణ్యావర్తనులగు నీ రందఱును శరీరములను వదలి స్వర్గలోకమును గెలిచికొన్నారు.

ఇది నాలుగవ యధ్యాయము.

---

## స్వర్గారోహణపర్వము

జనమేజయునకు వైశంపాయనుఁడు భీష్మాదులొందిన పదంబు లెఱిఁగించుట.
మహాభారత పఠన పాఠనాదిఫలశ్రుతి.

అని చెప్పిన విని జనమేజయుఁడు 'వైశంపాయన మునీంద్రా! మహాత్ములగు భీష్మద్రోణులును, మహారాజగు ధృతరాష్ట్రుఁడును, విరాట ద్రుపదు లిరువురును, శంఖుఁడు, నుత్తరుఁడును, ధృష్టకేతుఁడును, జయత్సేనుఁడును, సత్యజిన్నరపాలుఁడును, దుర్యోధనుని కొడుకులును, సుబలునికొడుకు శకునియు, తేజశ్శాలులగు కర్ణునికొడుకులును, రాజగు సైంధ

వుఁడును, ఘటోత్కచుఁడు మొదలగువారును, నీ వింతకు ముందు పేర్కొనినవారును, బేర్కొననివారు నగు తేజోమూర్తులు రాజన్యవీరులును స్వర్గలోకమున నెంతకాల ముండిరి? కాదేని వారి కచట లభించిన యా యా స్థానములు శాశ్వతములుగ నుండెనా? కానిచో వారు వారు తమ తమ పుణ్యకర్మము లనుభవించినతరువాత నేయేగతి నందిరి? ఆ విధ మంతయును వినుటకుఁ గోరిక యగుచున్నది. బ్రాహ్మణోత్తమా! యుజ్జ్వలమగు తపముచే నెల్లవృత్తాంతములును మీకుఁ గన్నులకుఁ గట్టినట్లు తేటతెల్లమగదా! యని యడుగుటయు నా నరపాలునకు మహాత్ముఁడు వేదవ్యాసమహర్షిచే ననుజ్ఞాతుఁడగు నా బ్రహ్మర్షి యిట్లు వివరించెను.

'మనుజాధిపా! వీరందఱును దమతమ కర్మఫలముల ననుభవించినతరువాత స్థానాంతరముల కేఁగనే వలయును. దేవరహస్యమగు నీ విషయమును గొప్పతేజశ్శాలి, దివ్యదృష్టిగల పురాణముని, గొప్ప తపస్వి, లోకాతీతుండగు బుద్ధివైభవము గలవాఁడు, నన్నికర్మముల పరిణామగతులను నెఱింగినసర్వజ్ఞుఁడు నగు పరాశరపుత్త్రుఁడగు వేదవ్యాసమునీంద్రుఁడు వివరించినవిధమునఁ దెలిపెదను వినుము.

అట్లు వారందఱును దమతమ కర్మఫలముల ననుభవించి కర్మము లన్నియు ముగిసినతరువాతఁ దమతమ పుట్టుకలకు హేతువులగు నా యా దేవతలలోఁ గలసికొనిపోయిరి. మిక్కిలి తేజము గలవాఁడును,బరాక్రమశాలియునగు భీష్ముఁడు వసువులలో నైక్య మయ్యెను. వసువు లెనిమిదిమంది యనియే గదా! లెక్కించుచున్నారము. ద్రోణుఁ డంగిరసుని వంశ

మునకెల్ల మేటియగు బృహస్పతిని జేరెను. హార్దిక్యుఁడగు కృతవర్మ మరుత్తులలోఁ గలిసికొనియెను. ప్రద్యుమ్నుఁడు మున్నేతెంచినట్లులే సనత్కుమారుని జొచ్చెను. ధృతరాష్ట్రుఁడు లభ్యములగు కుబేరుని లోకముల నందెను. కీర్తిశాలిని యగు గాంధారియు నాతని ననుగమించెను ధర్మపత్నులతోఁ గూడఁ బాండురాజు దేవేంద్రుని మందిరమున నివసించెను. విరాట ద్రుపదు లిరువురు, రాజన్యుఁడగు ధృష్టకేతువు, నిశఠాక్రూర సాంబులు, భాను కంప విదూరథులు, భూరిశ్రవుఁడు, శలుఁడు, భూరిరాజు, ఉగ్రసేన కంసులు, వసుదేవుఁడు, సోదరుఁడగు శంఖునితోఁ గూడ నుత్తమపురుషుఁడగు నుత్తరుఁడు, పురుషశ్రేష్ఠులగు నీ యందఱును విశ్వేదేవతలలోఁ గలిసిపోయిరి. పురుషసింహుఁడగు నర్జునుని కొడుకగు నభిమన్యుఁడు వేఱొకమగవాఁ డెవ్వాఁడు నేచోటను జేయని విధమున క్షాత్రధర్మము నూఁది యుద్ధము నొనరించిన మహారథుఁడు. ధర్మాత్ముఁడగు నాతఁడు చంద్రునిలోఁ గలిసెను. రణనిహతుఁడగు కర్ణుఁడు సూర్యు నావేశించెను. శకుని ద్వాపరమునఁ జేరెను. ధృష్టద్యుమ్నుఁ డగ్నిదేవునిలో నంతర్భవించెను. ధృతరాష్ట్రుని కొడుకు లందఱును రాక్షసులలోఁ గలిసిపోయిరి. విదురునితోఁగూడ రాజేంద్రుఁడగు ధర్మజుఁడు ధర్మునిఁ బ్రవేశించెను. బలదేవుఁడు బ్రహ్మానియోగమునం జేసి భూభారమును వహించు ననంతభగవానుఁడై రసాతలమున కేఁగెను. వసుదేవతనయుఁడగు కృష్ణుఁడు తా నవ్వాని యంశమునను జనించిన దేవదేవుఁడగు సనాతననారాయణునిలోఁ లీనుఁ డయ్యెను. వాసుదేవుని వలపుఁగత్తెలగు నా పదు

నాఱువేల తరుణులును గొంతకాలమునకు సరస్వతీనదియందు మునిఁగి శరీరములను వదలి స్వర్గము నంది యప్సరసలై నారాయణునకుఁ బరిచారికలై నిలిచిరి. ఇంకను నా గొప్ప యుద్ధమునఁ జచ్చినమహారథు లగు ఘటోత్కచాదివీరు లందఱును దేవతలలోను, యక్షులలోనుం గలిసిరి. ఆ యుద్ధములోఁ గొందఱు రాక్షసులు దుర్యోధనునకు సహాయులుగా వచ్చి యుండి రని పేర్కొని యుంటినే! వారందఱును సర్వోత్తమములగు లోకముల నందిరి. వారు వరుసగా నింద్ర, కుబేర, వరుణ లోకములఁ బ్రవేశించిరి. భారతశ్రేష్ఠా! యిట్లీ కురు పాండవ చరిత్ర మగు మహాఖ్యానము నంతయు సవిస్తరముగను, సంపూర్ణముగను నీకుఁ దెలిపితిని.

ఇట్లు సర్పయాగసమయమున వైశంపాయనమహామునీంద్రుఁడు వినిపింప నిమ్మహాఖ్యానమును విని జనమేజయ నరపాలుఁడు పరమాశ్చర్యభరితుఁ డయ్యెను. అంతలో నాతని యాజకు లా మహాయాగమును బరిసమాప్తి నందించిరి. ఆస్తీక మహామునియు నయ్యాపదనుండి సర్పముల నెల్ల విడిపించి మిక్కిలి సంతోషించెను. పిమ్మట నా రాజేంద్రుఁడు గొప్ప గొప్ప దక్షిణల నొసఁగి విప్రుల నందఱను సంతోషపెట్టెను. వా రందఱు నట్లు మహారాజుచే సత్కృతులై తమతమ వచ్చినత్రోవల నేఁగిరి. జనమేజయుఁడును విప్రుల నందఱను వీడుకొని సంతుష్టాంతరంగుఁడై తక్షశిలనుండి మరల హస్తినాపురమున కేతెంచెను. అని చెప్పి శౌనకాదిమహర్షులకు సూతుఁ డి ట్లనియె.

మహాఋషులారా! యిట్లు సర్పయాగము జరుగు సమయమున వేదవ్యాసమహామునీంద్రుని యానతిచే వైశంపాయనమునీంద్రుఁడు గీ ర్తించిన యీ మహాఖ్యానమును జక్కఁగా విని తెలిసికొంటిని. దాని నంతయును మీకు సవిస్తరముగ వినిపించితిని. ఇయ్యది యితిహాసము పేరిటి పుణ్యములరాశి. పరమపావనమును, నుత్తమము నగు దీనిని సత్యవచనుఁ డగు కృష్ణద్వైపాయనమహాముని నిర్మించెను. దైవముకలరూపును నెఱింగినసర్వజ్ఞుఁడు, ధర్మస్వరూపమును దెలిసిన సత్పురుషుఁడు, ఇంద్రియములకుఁగూడ నగోచరమైన పరమపవిత్రమగు తపస్సు నొనరించి యాత్మసాక్షాత్కారము నంది యీశ్వరత్వమున వర్తించు లోకోత్తరుఁడు, సాంఖ్యయోగములఁ గలిగిన సర్వతంత్రవిశారదుఁడు నగు నా మహామునీంద్రుఁడు దివ్యదృష్టితో నవలోకించి మహాత్ములగు పాండవులయుఁ, దేజశ్శాలులగు తక్కిన క్షత్రియులయుఁ గీర్తిని లోకములలో వెల్లడిసేయుటకును, దైవముల కెల్ల దైవమైన శార్ఙ్గధన్వుఁడగు నారాయణుఁడు వసుదేవునకుఁ బుత్త్రుఁడై యొనరించిన దివ్యలీలలను, సకలదేవతలును దమతమ యంశముల భూలోకమున జనించి మరల సాయుజ్యము నందినప్రకారమును గీర్తించుటకును నీ గొప్ప యాఖ్యానమును రచించెను.

ఇట్టి యీ యితిహాసమును బర్వకాలముల విని యెఱుంగు బ్రాహ్మణోత్తముఁడు పాపముల నన్నింటిని నావలకుఁ ద్రోసి స్వర్గమును గెలిచికొని పరబ్రహ్మమునఁ జేరఁబోవును. వేదవ్యాసవిరచిత మగు నీ వేదము నంతయును మన

స్సును గుదురుపఱచికొని వినిన యెల్లవానికిని బ్రహ్మహత్యచేఁ గలిగిన పాపముగూడఁ దత్క్షణమే నాశమై పోవును. శ్రాద్ధ కాలమున బ్రాహ్మణులకు దీనిని దుది కొకపాదమునైనను విని పించిన నాతని పితృదేవతల కా యన్నపానము లక్షయములై చెందును. ఇంద్రియములతోఁగాని, మనస్సుతోఁగాని, పగలు గాని, రాత్రి స్త్రీపరివృతుఁడై కాని యొనరించిన సర్వపాప ములను బ్రాతస్సంధ్యాకాలమున నీ మహాభారతము నెవ్వఁడు పఠించునో యా ద్విజునకుఁ దమకుఁదామ పటాపంచలై పోవును. పదునెనిమిది పురాణములను, ధర్మశాస్త్రములను, సాంగములగు వేదముల నన్నింటిని నొకపంకను నీ మహా గ్రంథము నొక్కదాని నొకపంకను నునిచి చూడ నన్నిటి కంటె మహత్త్వమును (గొప్పఁదనమును) భారవత్త్వమును (బరువు-విషయగౌరవము, కలిమియు) నిండే యుండుటంజేసి దీనికి మహాభారత మని పేరు కలిగిన దని పెద్దలు నిర్వ చింతురు. ఇట్టి యీ గ్రంథమును వినిన నెల్లకలుషములును దొలఁగిపోవును. ఇట్లని పదునెనిమిదిపురాణములకుఁ గర్త, వేదములకు మహాసముద్రమువంటివాఁడు, మహాత్ముఁడు నగు నా మునీంద్రుఁడు సింహనాదముగఁ జాటినాఁడు. సర్వసమర్థుఁ డును, మునియు నగు నా కృష్ణద్వైపాయనభగవానుఁడు పరమపుణ్యమగు నీ మహాభారతమును మూఁడుసంవత్సరములు రచించెను. జయ మనుపేరఁ బరగిన యీ మహాభారతము నెల్లవేళల వినినవానికి సంపదయుఁ, గీర్తియు, విద్యయు నొక్కమ్మడి వెలయును. ధర్మార్థకామమోక్షము లను నాలుగు పురుషార్థములలో నొక్కొక్కదానినిగుఱించియుఁ గల సర్వ

మును నీ మహాభారతమునఁ జెప్పఁబడినది. అదియే యితర గ్రంథముల నన్నింటను గలదు. ఇందు లేనిది మఱి యెందును లేదు. జయాఖ్యమగు నీ మహాభారతమును జదువుచోట నెల్ల లక్ష్మీ సరస్వతులును, కీర్తియు సంప్రీతితోఁ విలసిల్లును.

మహామునులారా! యటుతరువాత భారతమును విని పించిన గురూత్తముఁ డగు నా వైశంపాయనమునీంద్రుని బంగరుసింహాసనముపైఁ గూర్చుండ నిడి జనమేజయుఁడు మొదలగు రాజులును, ఆస్తీకాదులగు బ్రాహ్మణులును, ధర్మదత్త ప్రముఖులగు వైశ్యులును, సోమవంశ్య ప్రభృతులగు శూద్రులును బదిలక్షలు, పదివేలు, పదినూర్లు, పదిపదులు, పదియగు * నిష్కములచే యథాశక్తిగాఁ బూజించిరి. బిడ్డలు బ్రదుకనివాఁడు పది నిష్కములను దానము నిచ్చి చిరాయువు గల సంతానము నందెను. ఉబ్బసము మొదలగు రోగములతో నున్నవాఁడును నూఱుమాడలను దానము నొసర్చి యారోగ్యవంతుఁ డయ్యెను. వేయిమాడలను దానముచేసి సంతానము లేనివాఁడు పుత్రసంతతిని గాంచెను. ఇట్లు వారందఱును నాయురారోగ్యైశ్వర్యముల నంది తినను గట్టనుం గలిగి పుత్రవంతులై సుఖించిరి.

స్వర్గారోహణపర్వము ముగిసినతరువాత బంగారము, వెండి, రత్నములు, సర్వాభరణములు నొసంగఁబడియెను. మఱియు ఇటుకగోడలచేఁ గట్టఁబడి, యగ్ని మొదలగువాని

* నిష్కమనఁగా మాడ. ఇది పూర్వకాలమున వాడుకలో నున్న యొక నాణెము.

బాధల కందరాక, దేవపూజకు, నగ్నిహోత్రాదులకుఁ, జదువు నకు, ధనమునకునై వేలువేలుగా గదులు గలిగి లోపలను వెలుపలను మంచికప్పుతో నొప్పి, పై మేడతోఁ గూడి, యావులయింటితోఁ గూడినగృహమును దానము చేయవల యును. వీని నన్నింటిని గలిసిగాని, యథాశక్తిని గొన్నింటిని గాని దానము చేయవచ్చును. ఈ దానములను నిష్కాముఁడై చేసినచో నాతఁడు జన్మరాహిత్యము నందును. లేక సకా ముఁడై యొనరించినచో నాతఁడు బ్రహ్మమందిరమున నొక బ్రహ్మకల్పము సుఖించును. పురాణమును జెప్పునాతఁడు పురాణముముఖమున వేదాంతజ్ఞానమును గలిగించును. కావున నాతఁడు గురువుగా నెన్నఁబడుచున్నాఁడు. అట్టి యాత నిని బూజించుట సాక్షాత్తుగా నీశ్వరునిఁ బూజించుటయే యగును. మహాభారతమును జదువునాతనిని, వినునాతనిని, వ్రాయునాతనిని సిద్ధులును మహర్షులునుగూడ సంతో షముతో మిక్కిలి పూజింతురు. మహాభారతమును విని పించినయాతనిని బూజింపనివాని పుణ్యకర్మము లన్నియును నిష్ఫలము లగును. దేవత లాతనిని శపింతురు.

జయ మనుపేరఁ బ్రఖ్యాతి నందిన యీ యితిహాస మును జయమును గోరురాజులును, రాజపుత్త్రులును దప్పక వినఁదగుదురు. దీని పఠనాదులచే స్వర్గకాముఁడు స్వర్గమునం

డును, జయాభిలాషి జయమును గాంచును. గర్భవతిసుపుత్త్రుని గాని, సౌభాగ్యవతి యగు పుత్త్రికనుగాని కనును. సనాతనుఁడును, ముక్తస్వరూపుఁడును, సర్వసమర్థుఁడు నగు కృష్ణద్వైపాయనమునీంద్రుఁడు ధర్మవాంఛచే నీ మహాగ్రంథమును నిబంధించెను. నాలుగు వేదముల సంహితలకంటె వేఱుగా నా మహాత్ముఁ డఱువదిలక్షల పరిమితి గల నీ భారతసంహితను నిర్మించెను. అందు ముప్పదిలక్షల సంహితను నారదునితో దేవలోకమునఁ బ్రఖ్యాతి సేయించెను. పితృలోకమునఁ బదునైదులక్షల గ్రంథభాగమును నసితుఁడగు దేవలునితో వినిపించెను. పదునాలుగులక్షల పరిమితి గల సంహితను శుకమహర్షితో యక్షలోకమునఁ బ్రచారము సేయించెను. తక్కిన నూఱువేల గ్రంథమును మర్త్యలోకమున వైశంపాయనునితోఁ జెప్పించెను.

మునీంద్రులారా! వ్యాస ప్రోక్తమై మహార్థమును వేదతుల్యము నై మూఁడులోకములను వ్యాపించి పవిత్ర మగు నీ యితిహాసమును బ్రాహ్మణపురస్సరముగ నెవ్వఁ డాలకించునో యాతఁ డిహలోకమున నెల్లకోరికల నంది కీర్తిమంతుఁడై తుదికిఁ బరమపదము నందు ననుట కెంతమాత్రమును సందేహము లేదు. ఇట్టి యీ పుణ్యసంహితనుండి యొక పాదము నైనను భక్తిశ్రద్ధలతో నధ్యయనము సేయునాతఁ

డును, వినునాతఁడును నైహికసౌఖ్యముల నన్నింటి నంది కీర్తిమంతులై యుత్తమసిద్ధిని బ్రాపింతురు.

పుణ్యమగు నీసంహితను వ్యాసభగవానుఁడు తనపుత్త్రుఁడగు శుకునిచే నధ్యయనము చేయించెను.

తుదియును మొదలును లేని యీ సంసారములలో ననుభవమును బొందు మనకు వేలకొలఁది తలిదండ్రులును, నూఱులకొలఁది యాలుబిడ్డలును గడచిపోయినారు. కొందఱు గడచుచున్నారు. మఱికొందఱు గడవనున్నారు. ప్రతిదినమును వేలకొలఁదిగా సంతోషస్థానములును నూఱులకొలఁదిగా భయస్థానములును మూర్ఖుఁడగువానికే యావేశించును; గాని పండితుఁ డగువానికిఁ గాదు. ఇదే నేను జేతులుపై కెత్తియుచ్చైస్స్వరమునఁ జాటుచున్నాఁడను. ఒక్కరైనను వినరేల? ధర్మమువలన నర్థమును, గామమునుగూడఁ గలుగుచున్నవి. అట్టి ధర్మము నేల సేవింపరు?

ఎన్నఁటికినైనను గామమునఁగాని, భయమునఁగాని, లోభమునఁగాని, తుదికిఁ బ్రాణరక్షణకారణమున నైననుగాని ధర్మమును ద్యజింపరాదు. ధర్మము నిత్యము. సుఖమును దుఃఖమును ననిత్యములు. జీవుఁడు నిత్యుఁడు. ఆతనికిఁ గల సంసారకారణ మనిత్యము.

భారతసావిత్రి యనుపేరిటి యీ యర్థము నెవ్వఁడు ప్రాతఃకాలముననే లేచి పఠించునో యాతఁడు భారతము

వలనఁ గలుగుఫలముల నన్నింటిని బొంది తుదికిఁ బరబ్రహ్మ
మును జేరును. పూజనీయములగు సముద్రము హిమగిరియును
బోలె నీ భారతసంహితయు రత్ననిధి యని పేర్కొనఁదగినది.
కృష్ణద్వైపాయనభగవానుఁడు విరచించిన యీవేదము నే
విద్వాంసుఁడు వినిపించునో, యెవఁడు దానియర్థము నవగతము
చేసికొని వినునో, యెవఁడు మనస్సును గుదురుపఱచుకొని పఠిం
చునో యాతఁ డెల్ల నిస్సంశయముగ నుత్తమసిద్ధి నందును.

కృష్ణద్వైపాయనుని పెదవులనుండి, నిర్గమించి యప్ర
మేయమై పవిత్రమై పాపముల నెల్ల నడఁచి శుభకరమై పఠింపఁ
బడు నీ భారతాఖ్యానమును లెస్స యవగాహించినయాతనికి
నాకాశగంగాస్నానమం గవ్వకును సూడఁ గొఱ గాదు. బంగార
మును బొదిఁగిన కొమ్ములతోడి పాడియావులను నూటిని వేద
వేత్తయగు విప్రునకు దానము సేసినయాతఁడును, బుణ్యమగు
నీ భారతేతిహాసము నెల్లవేళల విను నాతఁడును దుల్యమగు
ఫలము నందుదురు. ఆస్తిక్యబుద్ధి గలవాఁడై శ్రద్ధతోను,
నేకాగ్రచిత్తముతోను నాదినారాయణుఁ డగు వాసుదే
వుని ధ్యానించుచు మహార్థమును వేదతుల్యము నగు నీపుణ్యేతి
హాసమును బ్రీతియుక్తుఁడై యెవ్వఁడు వినునో యాతఁడును,
బ్రాహ్మణపురస్సరముగఁ దదేకమనస్కుఁడై శుచియై యన్ని
వర్ణములవారికి నెవ్వఁడు వినిపించునో యాతఁడును నిహలోక
మునఁ గోరిన కోరికల నెల్ల నంది, మిక్కిలి కీర్తిని బొంది, పాప
ముల నన్నింటిని బోఁదోలి, సుఖించి వ్యాసానుగ్రహమునం
జేసి తుదికి స్వర్గలోకమును బొందును. ఈ భారతాఖ్యానము సంత

యు నెఱింగిన ద్విజుఁడు వేదార్థముల నన్నింటిని నెఱింగిన వాఁడై సర్వకాలములందును బూజనీయుఁడై గౌరవము నందును.

ఇది యయిదవ యధ్యాయము

స్వర్గారోహణపర్వము సమాప్తము.

ఇది శ్రీమద్వేదవ్యాస విరచితంబైన మహాభారతం
బను శతసహస్ర పరిమితం బగు మహా
సంహితయందు విద్వాన్ అవధానము
చంద్రశేఖరశర్మ ప్రణీతంబు
లైన మౌసల మహాప్రస్థానిక
పర్వంబులతోడి స్వర్గా
రోహణ పర్వంబున సర్వంబును
బంచమాధ్యాయము
శ్రీమన్మహాభారతము సమాప్తము
తత్సద్బ్రహ్మార్పణ మస్తు.

ఉ. సాత్యవతేయ విష్ణుపదసంభవమై విబుధేశ్వరాబ్ధిసం
గత్యుపశోభితం బయి జగద్విదితం బగు భారతీయభా
రత్యమరాపగౌఘము నిరంతరసంతతపుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్.

"నన్నయ."

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

శ్రీః

# శ్రీమన్మహాభారత శ్రవణవిధి

---

మహాత్మా ! విద్వాంసులతో నీభారతమును వినవలసిన విధి యెట్లు ? దీనిని వినినచో లభించుఫల మేమి ? ఇందు నేయే దేవతలఁ బూజించి సంతర్పణముల నొనరింపవలయును? ప్రతిపర్వము ముగిసినప్పు డొసఁగఁ దగినదానము లేవి ? గ్రంథమెల్లను ముగిసినతరువాత నేమి దానము నొనరింప వలయును ? ఈ భారతము వినిపించునాతఁ డెటువంటివాఁడు గా నుండవలయును ? ఇవి యన్నియు వివరింపవే యని యడిగిన జనమేజయునకు వైశంపాయనుఁ డిట్లనియె.

రాజేంద్రా ! యీ భారతమున వినఁ దగినవిధాన మును, వినినదానఁ గలుగుఫలమును మొదలుగాఁ గల నీ యడి గిన విషయముల నన్నింటిని వివరించెద వినుము. స్వర్గలోక మున నున్న దేవతలు విలాసార్థమై భూలోకమున కేతెంచి తమ తమ కార్యములనెల్ల నిట్లు ముగించుకొని యావల మరల నిజలోకమగు స్వర్గమును జేరిరి. ఆ ఋషులయు, దేవతలయు నవతారవిషయము నంతయును దెలిపెదను. ఏకాగ్రమన స్కుఁడవై వినుము. ఈ మహాభారతమున రుద్రులు, సాధ్యులు, విశ్వేదేవతలు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు,

లోకపాలురు, మహాఋషులు, గుహ్యాకులు, గంధర్వులు, నాగులు, విద్యాధరులు, సిద్ధులు, ధర్మదేవత, స్వాయంభువు, కాత్యాయనముని, పర్వతములు, సముద్రములు, నదులు. అప్సరసలు, గ్రహములు, సంవత్సరములు, అయనములు, ఋతువులు, దేవతలు, రాక్షసులు మొదలగు చరాచరాత్మకమగు విశ్వమంతయు నొక్కచో నుండి కానవచ్చుచున్నది. ఆ దేవాదు లందఱును భూలోకమునఁ బ్రతిష్ఠనందినవిధమును, వారిపేరులను, వా రొనరించినపనులను నాలకించి కీర్తించు మానవునకు నెంతక్రూరము లగు పాపములును దత్క్షణమే వీడిపోవును. శుచియును, నియతాత్ముఁడునై యీ యితిహాసమును మొదటినుండి తుదివఱకుఁ గ్రమముగా యథావిధిగా విని ముగిసినతరువాత నాదేవాదులకెల్ల శ్రాద్ధముల నొనరింపవలయును. తత్ప్రకారమును దెలిపెద వినుము. భారత శ్రవణానంతరము శక్త్యనుసారముగ భక్తియుక్తుఁడై బ్రాహ్మణులకు మహాదానముల నొసంగవలయును. నానావిధములగు రత్నములు, పాలు పిండుకొను కంచుపాత్రములతోఁ గూడ నావులు, చక్కఁగా నలంకరింపఁబడి యెల్ల మేటిగుణములును గల కన్యకలు, అనేకవిధములగు యానములు, విచిత్రములగు మేడలు, భూమి, వస్త్రములు, బంగారము నివియెల్ల దానమీయవలయును. ఇంకను గుఱ్ఱములు, మదించిన యేనుఁగులు, పఱుపులు, పల్లకీలు, బాగుగా నలంకరింపఁబడిన రథములు, మొదలుగా నింట నున్న వెలగల శ్రేష్ఠవస్తువులెల్ల నొసంగవలయును. ఇంత యేల? బ్రాహ్మణసేవకై దారపుత్త్రులతోఁ దానుగూడ నాత్మార్పణ మొనరింపఁదగును.

మిక్కిలి శ్రద్ధ గలిగి యథాశక్తిగ వరుసగా నీ మహా భారతమును దుదముట్ట వినవలయును. అపు డతఁడు మంచి మనస్సుతో నెట్టి సందేహములును బొందకుండఁ బ్రీతిపూర్వ కముగ వినవలయును. మఱియు సత్యమును, జక్కని నడవడిని బాటించి యింద్రియనిగ్రహము గలిగి లోపలను, వెలుపలను గూడ శుచియై క్రోధాదులను జేరనీక శ్రద్ధావంతుఁడై యుండవలయును.

ఇంక వాచకుఁ డగువాఁడు (చదువునట్టివాఁడు) శుచి యును, సత్స్వభావమును, సదాచారమును బాటించు వాఁడును, దెల్లనివస్త్రములను దాల్చువాఁడును గావలయును. మంచిసంస్కారము గలిగి జితేంద్రియుఁడై సర్వశాస్త్రము లను నెఱింగి యసూయావిరహితుఁడై యాతఁడు శ్రద్ధా వంతుఁడుగ నుండవలయును. మఱియు రూపవంతుఁడును, సౌభాగ్యశాలియును, సత్యసంభాషియు నై యుండవలయును. తప్పక యంతరింద్రియములను, బహిరింద్రియములను నిగ్ర హించినవాఁడు గావలయును. అట్టి యా వాచకునిని దాన పూర్వకముగ సగౌరవముగ నర్చించి కైకొనవలయును.

అట్టి యా వాచకుఁడు మంచి కుదురుపాటుతో నేకాగ్రచిత్తముతోఁ జక్కఁగాఁ గూరుచుండి మిక్కిలి యాల స్యమును, మిక్కిలి వేగమును లేని యుచ్చారణముతో, ఆయా సము నందక గంభీరమును, రసవంతము నగు స్వరముతో, అక్షరములుగాని, పదములుగాని కలిసిపోకుండ విస్పష్ట మగు నట్లు చక్కని స్వరమును, మంచిభావమును గలుగునట్లు ముప్పదియాఱు వర్ణములును గంఠము మొదలగు నెనిమిది

స్థానములనుండి ప్రవ్యక్త మగుచుండ నీ భారతమును జదువవలయును. ఆతఁడు శ్రీమన్నారాయణునకును, బురుషశ్రేష్ఠుఁడగు నరునకును (అర్జునునకు), సరస్వతీదేవికిని, వ్యాసభగవానునకును మున్నుగా నమస్కరించి పిమ్మట జయ మను పేరిటి యీ మహాగ్రంథమును జదువవలయును.

భరతశ్రేష్ఠా! యిట్టి వాచకునివలన నీ భారతమును నియమవంతుఁడై శుచియై మున్ను చెప్పిన యెల్లగుణములును గలిగి వినినశ్రోతకు సంపూర్ణముగ భారతశ్రవణఫలము గలుగును. ఇట్లు భారతము నంతయును వినినతరువాత బ్రాహ్మణుల కెల్ల కోరికల నొసంగి వారిని తృప్తిపఱుపవలయును. ఇట్లొకసారి గావించినయాతఁ డగ్నిష్టోమ మనుయాగము నొనరించినఫలమును బొందును. అప్సరసలతోఁగూడ నిండిన దివ్యవిమానముపై నెక్కి యాతఁడు దేవతలతోఁగూడఁ బ్రీతియుక్తుఁడై స్వర్గలోకమున కేఁగును. ఇట్లు రెండవమా ఱొనరించినయాతని కతిరాత్ర మనుయజ్ఞమును జేసినఫలము లభించును. ఆతఁడు సర్వరత్నమయ మగు దివ్యవిమానము నధిరోహించును. దివ్యములగు మాల్యములను, వస్త్రములను దాల్చి, దివ్యములగు గంధపుఁబూఁతను, భూషణములను నలంకృతుఁడై దివ్యములగు భుజకీర్తులనుం దాల్చి యాతఁడు దేవలోకమునను బూజ్యత నందును. మూఁడవ పర్యాయ మొనరించినవానికి దశాహ మను యజ్ఞఫలము గలుగును. ఆతఁడు దేవతలతోఁ బాటివాఁడై స్వర్గలోకమునఁ బెక్కువేల సంవత్సరములు నివసించును. నాలుగవ మాఱు శ్రవణముఁ జేసిన వాజపేయము నొనరించినఫలమును, నయి

దవమా యొనరించిన దాని కిబ్బడిఫలమును మానవునకు లభించును. ఆతఁ డుదయించిన సూర్యునివలెఁ బ్రకాశించుచు నగ్నితో సమాన మగు తేజము గల విమానమునెక్కి దేవతలు పరివేష్టింప దేవలోకమున కేఁగి యచట నింద్రభవనమునఁ బెక్కువేల సంవత్సరములు సంతోషము ననుభవించును. ఆఱవమా యొనరించినవానికి నింతకు రెండింతలును, నేడవ మా యొనరించినయాతనికి నింతకు మూఁడింతలును ఫలము గలుగును. ఆతఁడు కైలాసశిఖరమువంటిది యై వైదూర్య మణులచేఁ గట్టిన యరుఁగులతోడను, నెడనెడ ననేకవిధముల నలంకరింపఁబడిన మణులతోడను, బగడములతోడను నొప్పారి కామగమనము గలిగి యప్సరసలతో నిండినవిమానము నెక్కి యెల్లలోకములను రెండవసూర్యునివలెఁ బ్రకాశించుచు సంచరించును. ఎనిమిదవపర్యాయముఁ జేసినయాతనికి రాజసూయ ఫలము లభించును. ఆతడు మనస్సువంటి వేగము గల చంద్ర కిరణములవంటి యచ్చతెలుపురంగు గుఱ్ఱములను బూంచి నదియుఁ, జంద్రోదయమువలె మనోహర మగునదియు నగు విమానము నధిరోహించును. చంద్రునికంటె నందమైన మోములు గల యుత్తమాప్సరస లాతని సేవింతురు. ఆయుత్త మాంగనల తొడలపై సుఖముఁగా నిద్రించినయాతనిని వారి యొడ్డాణపుఁగజ్జెల గలగల ధ్వనులును. నందెల నిస్స్వనము లును నిద్దురలేపును. తొమ్మిదవసారి శ్రవణ మొనర్చినవానికిఁ గ్రతుశ్రేష్ఠమగు నశ్వమేధయాగమును గావించినఫలము గలుగును. ఆతఁడు బంగారుపుస్తంభములతోడను, నైదూర్య మణుల యరుఁగులతోడను, గుందనపుఁగవాటములతోడను

నొప్పారి, దివ్యాప్సరసలతోను, దివ్యగంధర్వులతోను సేవితమై యలరు దివ్యవిమానము నెక్కి మిక్కిలి యుత్తమమగు సిరితోఁ బ్రకాశించుచు, దివ్యమాల్యములను, దివ్యాంబరములను దాల్చి, దివ్యగంధము నలఁది దేవతలతోఁగూడ వేఱొక దేవతయో యన సురలోకమున సుఖ ముండును. పదియవమాఱు చేసి బ్రాహ్మణాభివందనము నొనరించిన పుణ్యాత్మునకుఁ జిరుగంటల గలగలలతో, పతాకములతోడి ధ్వజములతో నలంకృతమై, రతనాలయరుఁగులతో వైడూర్యమణుల తోరణములతో నిండారి, బంగారపు గవాక్షములతోఁ బగడపుగోణిగలతో నొప్పారి, గీతనిపుణులగు గంధర్వులతో, నప్సరసలతోఁ గలకలలాడుచున్న సుకృతనివాసమగు దివ్యవిమాన మనాయాసముగనే లభించును. దానిపై నెక్కి యాతఁ డగ్నివలెఁ బ్రకాశించు బంగారపుఁగిరీటమును దాల్చి, దివ్యచందనమును మేనినిండ నలఁదికొని, దివ్యమాల్యములచే నలంకృతుఁడై దివ్యభోగముల నెల్ల ననుభవించుచు దేవతానుగ్రహముచే నుత్తమైశ్వర్యము నంది దివ్యలోకముల సంచరించును. ఇట్లాతఁడు వెయ్యిసంవత్సరము లుండి యావల గంధర్వులతోఁ గూడ నిరువదియొకవేయేఁడు లింద్రనగరమున నింద్రునితోఁగూడ సంతోషము నందును. దివ్యయానములను, దివ్యవిమానములను, దివ్యలోకముల నన్నింటను దివ్యాప్సరసలు పరివేష్టింప వేలుపువలెఁ గాఁపురముండును. పిమ్మట సూర్యభవనమునఁ జంద్రమందిరమున, శివపదమునఁ గొంతకాల ముండి యాపయి విష్ణులోకమున కేఁగును. శ్రద్ధావంతుఁడై యివి యెల్ల యథావిధి నొనరించిన

వానికి నీ ఫలము లన్నియుఁ దప్పక లభించును. ఇది నిస్సంశయ మని మా గురువులుగూడ వచించిరి.

మఱియు నీ భారతశ్రవణమున వాచకుఁ డేదియేది మనస్సునఁ గోరునో దానిదాని నెల్ల నెఱింగి యొసఁగవలయును. విశేషించి యేనుఁగులు, గుఱ్ఱములు, యానములు, వాహనములు, చేతిమురుఁగులు, పోఁగులు, యజ్ఞోపవీతము, మేలుదుకూలములు, గంధము నొసఁగి యాతనిని వేలుపువలెఁ బూజించినవానికి విష్ణులోక మందఁ గలుగును.

జనమేజయ నృపాలా! యిఁక భారతపఠనకాలమున నొక్కొక పర్వమునను బ్రాహ్మణులకు నొసఁగఁ దగినదానములఁ దెలిపెద వినుము. క్షత్త్రియు లగువారు జాతిని, దేశమును, సత్యమును, మాహాత్మ్యమును, ధర్మమును, వృత్తిని నెఱింగి యీ దానముల నొనరింపవలయును. ఆదిపర్వమున స్వస్తివాచనముఁ గావించి విప్రులను బూజింపవలయును. ఆవలఁ బఠనారంభము నొనరించి పర్వము ముగియఁగనే శక్త్యనుసారముగ బ్రాహ్మణులను బూజింపవలయును. మొట్టమొదట వాచకునకు వస్త్రములను, గంధము నొసఁగి యథావిధిఁ బూజించి మంచి తీపుగల పాయసమును భుజింపఁ బెట్టవలయును. ఆస్తీకపర్వమున ఫలమూలములతోడఁ దీపును, నేయియుం జేరిన పాయసమును, బెల్లపుఁ బొంగలిని, భక్ష్యములను, కుడుములను భుజింపఁబెట్టవలయును. సభాపర్వమునఁ హావిష్యమును, ఆరణ్యపర్వమున ఫలమూలములను బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. అరణీపర్వమున జలకుంభముల నొసంగవలయును. అడవిలోఁ గల మూలములతోడను, ఫల

ములతోడను సమృద్ధముగ బ్రాహ్మణులకు నుత్తమసంతర్పణము గావింపవలయును. విరాటపర్వమున నానావిధములగు వస్త్రములను దాన మీవలయును. ఉద్యోగపర్వమున బ్రాహ్మణులను గంధమాల్యములచే నలంకరించి సర్వకామసమృద్ధముగ భుజింపఁజేయవలయును. భీష్మపర్వమున యానముల నొసంగి షడ్రసోపేతముగ నన్నప్రదానము గావింపవలయును. ద్రోణపర్వమున బ్రాహ్మణులను బూజించి భుజింపఁబెట్టి శరములను, చాపములను, ఖడ్గములను దానము చేయవలయును. కర్ణపర్వమున నియతాత్ముఁడై బ్రాహ్మణులకు యథేష్టముగ నుత్తమాన్నమును లెస్సగా నొసంగవలయును. శల్యపర్వమునఁ గుడుపులతోను, బెల్లము పొంగలితోను, బిండివంటలతోను సంతర్పణ పూర్వకముగ నన్నప్రదానము గావింపవలయును. గదాపర్వమునఁ బులగమును, స్త్రీపర్వమున రత్నదానపురస్సరముగ ఘృతాన్నమును, ఐషీకపర్వమున మున్ముగా షడ్రసోపేతమగు సిద్ధాన్నమును, శాంతిపర్వమున హవిష్యమును భుజింపఁ బెట్టవలయును. అశ్వమేధపర్వమున సర్వకామసమృద్ధ మగు నన్నమును, నాశ్రమవాసపర్వమున హవిష్యమును భుజింప నిడవలయును. మౌసలపర్వమున గంధమాల్యానులేపనపూర్వక మగు భోజనమును, మహాప్రస్థానికపర్వమున నట్లే యథేష్టభోజనమును నొసంగవలయును. స్వర్గారోహణపర్వమున హవిష్యభోజనము నిడవలయును. హరివంశము ముగిసినతరువాత వేయిమంది బ్రాహ్మణుల కన్నదానము గావింపవలయును. ఒకమాడను గాని, దరిద్రుఁడైనచో సగము మాడనుగాని దక్షిణగాఁ

బెట్టి బ్రాహ్మణునకు గోదానముఁ జేయవలయును. ఒక్కొక పర్వము ముగిసినప్పుడును బుస్తకమును యథాశక్తి బంగారముతోఁగూడ వాచకునకు దానము చేయవలయును. హరివంశపర్వమునందును నిట్లే పాయసమును భోజన మిడవలయును. ఈ పారణముల నొనరించుటలో నెల్లఁ బైఁ జెప్పిన విధానమును జక్కఁగా ననుసరింపవలయును.

ఇట్లు నియతాత్ముఁడై భారతమును బూర్తిచేసిన తరువాత శాస్త్రజ్ఞుఁడగు నరుఁడు తెల్లనివస్త్రములను దాల్చి పూలదండలు మొదలగువానిచేఁ జక్కఁగా నలంకరించుకొని శుచియై సంహితాగ్రంథముల నన్నింటిని బట్టువస్త్రముతోఁ జుట్టి యొకపవిత్రప్రదేశమున నునిచి వేర్వేఱుగా గంధమాల్యాదులచే యథావిధిఁ బూజింపవలయును. ఇట్లు నియతాత్ముఁడు, నేకాగ్రచిత్తుఁడు నై సంహితాపుస్తకములను బూలదండలచేఁ బూజించి పిండివంటలను, పేయములను నానావిధములగు నిష్టవస్తువులను వానికి నివేదింపవలయును. పదాఱవ వన్నెబంగారమును దాన మొసఁగవలయును. ఎల్లయెడలను దాన మిడుబంగారము మూఁడుపలములతూకము కలిగియుండవలయును. అందు సగపాలుగాని నాలవపాలుగాని ధనలోభము నందక యథాశక్తి దానము నొసఁగవచ్చును. బ్రాహ్మణులకుఁ గోరినవెల్ల నొసంగవలయును. సర్వవిధములను భక్తియుక్తుఁడై తనకు గురువగు వాచకుని సంతోషపెట్టవలయును. సర్వదేవతలను, నరనారాయణులను గీర్తింపవలయును. పిమ్మట గంధమాల్యములచే బ్రాహ్మణోత్తములను జక్కఁగా నలంకరించి యిష్టార్థముల నెల్ల నొసఁగియు, నానా

విధములగు దానముల నొసరించియు సంతోషము నందింప వలయును. ఇట్లు చేసినయాతని కతిరాత్రయాగము నాచరించినఫలము గలుగును. ప్రతిపర్వమునను జెప్పిన యాయా క్రతువులఫలము లభించును. వాచకుఁడును—బదములును, నక్షరములును విస్పష్ట మగునట్టి సుస్వరముతో నీభారతమున భవిష్య మనుభాగమును వినిపింపవలయును. ఆవల బ్రాహ్మణభోజన మయినతరువాత మంచిభోజనముచేఁ బరితుష్టుఁ డయిన వాచకుని యథాశక్తి దానము నొసఁగి సంతృప్తి నొందింప వలయును. వాచకుఁడు సంతృప్తి నొందినచో నెల్ల దేవతలును మహోత్తమమగు సంతుష్టి నందుదురు. బ్రాహ్మణులు సంతృప్తు లగుచో నెల్ల వేలుపులును బ్రసన్ను లగుదురు. కావుననే యెల్లకోరికల నొసఁగియు, ననేకవిధముల వారికి మేలుల నొడఁగూర్చియు బ్రాహ్మణులను సంతోషపెట్ట వలసియున్నది. జనమేజయమహారాజా! యిట్లు నీ వడిగిన భారతశ్రవణవిధానము నంతయును వివరించితిని. సావధానుఁడవు గమ్ము. ఉత్తమశ్రేయమును గోరువాఁడు భారతశ్రవణమునందును, పారణములయందును యత్నవంతుఁడై పై విధానము నాచరింపవలయును. ఎల్లప్పుడును వినవలసినది భారతము. ఎల్లవేళలను గీర్తింపఁదగినది భారతము. అదియింటిలోనున్నను జాలును. జయమును గరతలామలకము గావింపఁజాలునది భారతము. పరమపుణ్యమే యయిన భారతము. అనేకవిధములగు కథలెల్ల వెలసినతావే యయిన భారతము. దేవతలచేతనుగూడ సేవింపఁబడునది భారతము. పరలోకమునకుఁ బరమసాధనము భారతము. సర్వశాస్త్రములలోను

నుత్తమమైనది భారతము. వేయేల? భారతమువలన మోక్షము కరతలామలక మగును. ఇది యథార్థము.

రాజేంద్రా! యొకమాటఁ దెలిపెద వినుము. మహాభారతాఖ్యానమును, భూమిని, గోవును, సరస్వతిని, బ్రాహ్మణులను, నారాయణుని గీర్తించునాతనికి నధమగతు లెన్నఁటికిని గలుగవు. పవిత్రము లయిన వేదములను, రామాయణమునను, నీ మహాభారతమునను మొదలను, నడుమను, దుదిని, నెల్ల యెడలను నారాయణుని నామకీర్తనము నిండారియున్నది. విష్ణుకథల కెల్ల నేది స్థానమో, సనాతనములగు శ్రుతు లెల్ల నెచట సాక్షాత్కరించునో యట్టి యీ మహాభారతము పరమపదము నందఁగోరినయాతఁ డెల్లఁ బఠింపఁ దగినది. ఇయ్యది పరమపవిత్రమైనది. సర్వధర్మములకును నిదర్శన మియ్యదియే. సర్వగుణసమృద్ధ మగు నీ భారతము నభ్యుదయమును గోరువా రెల్ల వినఁదగును. శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను నార్జింపఁబడిన పాప మంతయును నీ భారతముచేఁ జీకటి సూర్యోదయముచేతనుంబలెఁ బటాపంచ లయిపోవును. పదునెనిమిది పురాణములను వినుటవలన నెట్టిఫలము గలుగునో యాఫల మెల్ల విష్ణుభక్తియుక్తుండై యీ భారతమును వినినయాతనికి నిస్సంశయముగ లభించును. స్త్రీలును, బురుషులును గూడ నీనిచే విష్ణులోకము నందుదురు. పుత్త్రులు గావలయు నని కోరు స్త్రీ లెల్లరును నీ విష్ణుసంకీర్తనమును వినవలయును. పైఁ జెప్పినఫలము నందఁగోరువారు వాచకునకు నైదుమాడల బంగారమును గాని, లేక యథాశక్తి సువర్ణమును గాని దాన మొసఁగవలయును. ఆత్మశ్రేయమును

గోరినవాఁడు దూడతోఁగూడ నొక కపిలధేనువును [illegible] లకు బంగారము పొదిఁగి పైన వస్త్రమును గప్పి వాచకునకు దానము చేయవలయును. మఱియును [illegible]ను, చెవులకును ధరించు నాభరణములను, ధనమును, విశేషించి భూదానమును నొసఁగవలయును. భూదానమునకు సాటివచ్చు దాన మిప్పటికి లేదు; ఇంకముందుఁ గలుగఁబోదు.

ఇట్టి యీ భారతము నెల్లవేళలను వినువాఁడును వినిపించువాఁడును సమస్త పాపముల నెల్లను విడిచిపెట్టి విష్ణులోకమున కేఁగుదురు. దీనిని వినినను, వినిపించినను మానవుఁడు తన పితరులను బదునొకండు తరములవారిని, భార్యాపుత్త్రులను, దన్నునుగూడ నుద్ధరించును. ఈ భారతమును వినినతరువాత దీనికిఁ బదియవభాగము హోమమునుగూడ నొనరింపవలయును. జనమేజయనృపాలా! [illegible] యర్థమెల్ల నీ కడ వివరించితిని.

గద్య:—ఇది విద్వాన్ అవధానము చంద్రశేఖరశర్మ ప్రణీతంబైన హరివంశాంతర్గత మగు భారతశ్రవణ విధియను పేరిటి యధ్యాయము.

తత్సద్బ్రహ్మార్పణ మస్తు

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

---

Ananda Press, Madras